## న్యూఢిల్లీ లేఖ

డా.జయ్ దుబాష్



# సాంఘిక భద్రత ఎంతైనా అవసరం

మరియమ్మ (35), ఆమె ముగ్గురు కుమార్తెలకు పదిరోజుల నుంచి సరైన ఆహారం లేదు. ఆమె భర్త చేయడానికి పని దొరకక కుటుంబ పోషణ భారాన్ని మోయలేక ఎప్పుడో వెళ్ళిపోయాడు. తిండిలేకుండా పిల్లలు ప్రాణాలతో నిలువ గలిగేటట్లు మరియమ్మ తన శాయశక్తులా ప్రయత్నించింది. వాళ్ళు ఆహారం కావాలని అడిగినా ఇవ్వడానికి ఆమె దగ్గర ఏమీలేదు. పెద్ద కూతురు ఆరేళ్ళ సుజినా కుప్పకూలిపోయి జనవరి 17న మరణించింది. (న్యూస్‌టైమ్ మార్చి 6).

ఈ సంఘటన ఆంధ్రప్రదేశ్‌లోని ప్రకాశం జిల్లా, పంగలూరు గ్రామంలో జరిగింది. ఎన్. టి. రామారావు రాష్ట్రంలో ఇటువంటి మరణాలు చాలానే జరిగాయి. కనీసం డజనుమంది ఆకలి చావులకు బలైతే ఏభైమంది ఆత్మహత్యలు చేసుకున్నారు. ఆకలి చావు అనేది నెమ్మది నెమ్మదిగా జరిగేది. అందుకనే త్వరగా చావడానికి పంట నష్టపోయిన ప్రత్తి రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు.

ఒక నెల తర్వాత నారాయణ్ దత్ తివారీ దానికీ దీనికీ ఖర్చు పెడతాం అంటూ కోట్ల రూపాయలతో కూడుకున్న వార్షిక బడ్జెటును పార్లమెంటులో సమర్పించారు. కానీ అందులో ఒక్క రూపాయి కూడా మరియమ్మ కుటుంబానికి లేదు. మన నాయకులు వినోద యాత్రలకు, ఉత్సవాలకు కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తుండగా, గత ఏడాది రు. 70 వేల కోట్లు ఖర్చుపెట్టిన మనదేశం ఏటేటా ఆకలి, పౌష్టికాహార లోపం వల్ల పిల్లలు చనిపోతున్న మరియమ్మ, అలాంటి వేలాది మందిని రక్షించడానికి ఎందుకు ఏమీ చేయలేక పోయారో ఢిల్లీలోని తివారీని కాని, హైదరాబాదులోని రామారావుని కానీ ఎవరూ అడగలేదు.

భారతదేశంలో ఇంక ఆకలి చావులు ఉండవు, మన ఆహార సమస్యని తరిమివేసాము, ప్రతి ఒక్కరికి తినడానికి సరిపడా తిండి ఉన్నది అని మనం కొన్ని సంవత్సరాలుగా వింటున్నాము. ప్రతిరాత్రి లక్షలాది కుటుంబాలు కాలే కడుపుతోనే నిద్రపోతున్నా యనడానికి తగినంత రుజువున్నప్పటికీ, మరియమ్మ ఆరేళ్ళ కూతురు సుజినాకు జరిగినట్లుగా వారిలో చాలామంది ఆకస్మికంగా చనిపోకుండా నెమ్మది నెమ్మదిగా చనిపోతున్నప్పటికీ కొందరు ఇచ్చకాలాడేవారు, పిరికివారు అయిన ఆర్థికశాస్త్రవేత్తలు అదే పాట పాడుతున్నారు. జె. బి. పట్నాయక్, వారికుటుంబీకులు మాత్రం సర్వతోముఖాభివృద్ధి చెందినా ఆయన ఒరిస్సా రాష్ట్రంలోని కలహండీలో కనీసం వందమంది ఆకలితో చచ్చిపోయి ఉంటారు. నేను అనుమానించినప్పటికీ మనం ఆహార సమస్యను పరిష్కరించి ఉండవచ్చు. కానీ తీవ్రమైన దారిద్ర్య సమస్య ఇంకా మనతోనే ఉంది. ఎంత పెద్ద వార్షిక ప్రణాళికలు తయారు చేసినా ఒరిస్సాలో పట్నాయక్, ఆంధ్రప్రదేశ్‌లో ఎన్. టి. రామారావు, కేంద్రంలో రాజీవ్‌గాంధీ వంటి రాజకీయ నాయకులు ఉన్నంత కాలం ఇది మనల్ని వదలదు.

ప్రపంచంలో కొన్ని ధనిక దేశాలతో సహా ఇతర దేశాలలో కూడా పేదరికం ఉంది. కానీ అది భారతదేశంలో, బంగ్లాదేశ్‌లో ఉన్నటువంటి రకం పేదరికం కాదు. బ్రిటన్‌లోగానీ, అమెరికాలోగానీ ఆకలి చావులు లేవు. అక్కడ సాంఘిక భద్రత ఉంది. అది వారికి ప్రాణాలు నిలుపుకోవడానికి అవసరమయ్యే ఆదాయానికి హామీ ఇస్తుంది. ఒక్క బ్రిటన్‌లో మాత్రమే 30 లక్షల మంది నిరుద్యోగులు ఉన్నారు. అమెరికాలో అంతకంటే ఎక్కువమంది ఉన్నారు. వారిని సేవా సంస్థలే పోషిస్తాయి. పెట్టుబడిదారీ దేశాలలో ఈ విధమైన సాంఘిక భద్రత ఉండగా అధికారికంగా సోషలిస్టు దేశమైన మన దేశంలో ఎందుకు లేదో నా కర్థం కాదు. ఒక కుటుంబ పోషణకు ఎంత అవుతుంది? నెలకి రెండు వందలా? మూడు వందలా? రాబోవు సంవత్సరంలో రోజుకి 200 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టడానికి రాజీవ్ ప్రభుత్వం తయారవుతున్నప్పుడు అందులో ఒక శాతం ఈ పనికి పక్కన పెట్టలేరా? గోవాలాంటి చిన్న ప్రాంతంలో కూడా స్వాతంత్ర్యం రాక ముందు ఎవరూ ఆకలి చావులు చావలేదు. ఎందుకంటే పోర్చుగీసు వారి ప్రభుత్వంలో కూడా సాంఘిక భద్రతా పథకాలు ఉండేవి. చాలామంది వృద్ధుల సంక్షేమానికివి తోడ్పడేవి.

భారతీయ రాజకీయవేత్తలకు ఇలాంటి మౌలిక అవసరాలని గుర్తించడానికి సమయం ఉండదు. వారు ఎప్పుడూ రాజకీయాలని నడపటంలో తలమునకలై ఉంటారు. ఇప్పుడా విషయంలో అనుమానాలు వ్యక్తం చేయబడుతున్నప్పటికీ రామారావు మంచివాడే కావచ్చు. అయితే ఆయన ఎంత సమయం రాజకీయాలలో గడుపుతున్నారు. ఎంత సమయం ప్రభుత్వ పాలనలో గడుపుతున్నారు. ప్రత్తి పంట నష్టం కావడంతో ప్రకాశం జిల్లాలో ఆత్మహత్యలు సంభవించాయి. కానీ పంటలభీమా పథకం ద్వారా అనేకమంది వ్యవసాయదారులు దాన్నుంచి రక్షింపబడి ఉండవచ్చు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏం చెపుతుందో నాకు తెలుసు. రాష్ట్రంలో సంక్షోభం సంభవించినపుడు



జ్యోతిబసు ప్రభుత్వం కూడా అదే అంటుంది అవసరమైనంత ధనం ఇవ్వడంలేదని కేంద్రాన్ని నిందిస్తారు అది నిజమే కావచ్చు కానీ పూర్తిగా కాదు వ్యవసాయ మనేది కేవలం రాష్ట్రానికి సంబంధించిన వ్యవహారం రైతుల మంచి చెడ్డలు చూడటం రాష్ట్ర ప్రభుత్వ బాధ్యత పూర్తి పంట నష్టపోయిన ఇటువంటి పరిస్థితులలో పెద్దఎత్తున రక్షణ చర్యలకుగాను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా కృషి చేయాలి కానీ అలా జరుగలేదు వందలమంది మరియమ్మల్ని, వారి పిల్లల్ని వారివారి ఖర్మకు వదిలి వేశారు

భవిష్యత్తులో ఇటువంటి చావులు ఇంకా ఎక్కువగా ఉంటాయి ఎందుకంటే పేదవారు నిరుపేదలవడమేగాక అట్టడుగుకు నెట్టి వేయబడుతున్నారు మీ దగ్గర పదివేల రూపాయలు ఉంటే ఇంకో పదివేల రూపాయల అప్పుకోసం బ్యాంకులకు అనగా ప్రభుత్వం దగ్గరకు వెళ్ళవచ్చు మీ దగ్గర పదిరూపాయలు కూడా లేకపోతే, మీరు ఎవరినీ కలువవలసిన పనిలేదు లక్షలాది మంది దగ్గర అవిలేవు దాదాపు 20 కోట్ల మంది ఇలాంటివారు ఉన్నారు వారికి తివారీ బడ్జెట్‌వల్ల ఒరిగేదేమీ ఉండదు వాళ్ళు బడ్జెట్ అమలు జరిగేంత వరకు బ్రతికి ఉంటారని నమ్మకంలేదు వారికి రాబడిలేదు, ఆస్తులులేవు ఏమీలేవు మన దేశంలాంటి దేశంలో ప్రణాళికల ప్రయోజనం ఇటువంటి వారిని ఒక నికరాదాయ పరిధిలోకి తీసుకు వచ్చేదిగా ఉండాలి దాంతో వారికి సంఘంలో ఒక స్థానం ఏర్పడుతుంది ప్రస్తుతం వారు ఎవరికీ పనికిరానివారు రాజకీయ పార్టీలకు వీరు ఎన్నికల సమయంలో మాత్రమే గుర్తుకి వస్తారు పాలక పార్టీకి ఓటు బ్యాంకు అనుకున్న దానిని కొల్లగొట్టే తికాయత్ లాంటి మనుషుల గురించి తివారీ గారికి ఆకస్మికంగా గుర్తుకు వచ్చింది కానీ తికాయత్ తప్పించి ఒంగోలులో 'మరియమ్మలాంటి వారు ఉన్నటువంటి పలువురు వ్యవసాయదారులకు బడ్జెట్‌తో ఒరిగేది ఏమీ ఉండదు

ఈ దేశంలో రాజకీయాలు చాలా ఎక్కువగా ఉన్నాయి సంవత్సరం పొడుగునా పంచాయితీ ఎన్నికలో, జిల్లా పరిషత్తు ఎన్నికలో లేదా ఉప ఎన్నికలో ఏదో ఒక రకం ఎన్నికలు లేకుండా ఏ నెలా గడవదు ఈ దేశంలోని పేద ప్రజలకు ఇందువల్ల ఒరిగేదేమిటి? ఏ పార్టీ గెలిచినా, ఏ పార్టీ ఓడినా నిజానికి వారికేమయినా పెద్ద తేడా కనిపిస్తుందా? రామారావు, రామకృష్ణ హెగ్డే, జె బి పట్నాయక్, అర్జున్‌సింగ్ రాజకీయాలు నడపటంలో అదీ ఢిల్లీలో, ఎందుకు ఎక్కువ సమయాన్ని గడుపుతున్నారు? మరియమ్మలాంటి వారి బాగోగులని కనుక్కోడానికి అతి స్వల్ప సమయాన్ని ఎందుకు వెచ్చిస్తున్నారు? ఎందుకు ఇంతమంది నక్సలైట్లు, ఉగ్రవాదులు ఉన్నారు? దేశం ఎందుకింత అల్లకల్లోలంగా ఉన్నది? అనుకుంటూ మనం ఆశ్చర్యపోతూ ఉంటాము □

## మార్పు

ఓటు
వేసే
ముందు
మన
చేతుల్లో
అభ్యర్థి
చేతులు
గెలిచాక
అతని
కాళ్ళపై
మన
చేతులు

–బచ్చు వీర్రాజు




# మార్వెల్ - కంచిపట్టు వంటి మృదువైన, అపూర్వమైన అనుభూతి.

పట్టు కుచ్చు వంటి కోమలత్వం, కంచిపట్టువంటి లావణ్యం. కొబ్బరి నూనె సహజ గుణాన్ని రంగరించుకున్న, పాల మీగడవంటి నురగ.

సాధారణమైన సబ్బులకన్న
3 రెట్లు అధికంగా కొబ్బరి నూనెను కలిగి యున్నది.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)

3.6.88; 10.6.88

శ్రీ విభవ నామ సం. అధిక జ్యేష్ఠ బ. తదియ

బ. ఏకాదశి

సంపుటము 80 : సంచికలు 41; 42

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

విడి ప్రతి వెల రు. 3.00

పోస్టులో 6 నెలల చందా రు. 87.10

పోస్టులో 12 నెలల చందా రు. 174.20

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక





## ఉత్తరాలు

### ముఖచిత్రం

8-4-88; 15-4-88 జయప్రద ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక జయప్రదంగా ఉంది మా ఇంటిల్లిపాదిని విశేషంగా ఆకర్షించింది.

- పెయ్యేటి చాముండేశ్వరి, కుటుంబ సభ్యులు, శ్రీకాకుళం

### సీరియల్స్

నటి జయప్రద ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఎంతో ఆకర్షణీయంగా వుంది. చల్లా సుబ్రహ్మణ్యంగారి 'పవిత్రపాపి' ఆరంభంలో నే నన్ను బాగా ఆకట్టుకుంది "రాకా" పాత్ర అద్భుతంగా వుంది. మంచి సీరియల్ వ్రాస్తున్న రచయితగారికి నా ధన్యవాదాలు.

-కూసంపూడి ప్రభాకరరావు, సత్తుపల్లి

* * *

'జయప్రద ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో అందంగా మా ఇంటికి చేరింది. 'పవిత్రపాపి' సీరియల్ సూపర్బ్. ఎప్పుడు పత్రిక వస్తుందా? అని ఎదురు చూడాల్సిన పరిస్థితి వచ్చింది.

-సి. చంద్రశేఖర్‌రెడ్డి, ఇందాణి; కుంచనపల్లి

'జయప్రద' ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వెలువడుతున్న "పవిత్రపాపి" సీరియల్ చాలా అద్భుతంగా వుంది. ఈ సీరియల్‌లో 'రాకా' పాత్ర చాలా బాగున్నది. రచయిత చల్లా సుబ్రహ్మణ్యంగార్కి మా థాంక్స్.

- శిరం వెంకటరామకృష్ణ, శిరం శ్రీనివాసరావు, కంకిపాడు

* * *

"పవిత్రపాపి" సీరియల్ ప్రారంభంలో నే ఎంతో బాగుంది- రైటర్ చల్లా సుబ్రహ్మణ్యం గార్కి అభినందనలు.

మేదరమెట్ల శ్రీనివాసరావు, బుద్ధారం

* * *

ఆణిముత్యాల వంటి సీరియల్స్ ప్రచురించడంలో అగ్రగామి అయిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో మా అభిమాన రచయిత శ్రీ చల్లా సుబ్రహ్మణ్యంగారి పవిత్ర పాపి సీరియల్ చాలా బావుంది. ధనవంతుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించే రాకాను పట్టుకోవడంలో పోలీసుల ఆగచాట్లు చూస్తుంటే నవ్వు వస్తుంది.

-పి. యల్. కృష్ణ, రామవరం

( 78 వ పేజీ చూడండి)

సీరియల్

# వినాయక రావు పెళ్ళి



## మల్లాది వెంకటకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

సుబ్బలక్ష్మి మాటలు వినగానే రెండో సారి కొట్టడానికి ఎత్తిన చెయ్యిని దింపేసాడు షణ్ముగరావు.

"మోసమా? అడిగాడు డాంబికేశ్వరరావు ఆశ్చర్యంగా

"అవును పచ్చి మోసం ఈ ఫోటోని నేను బావకి పంపాను, మా పెళ్ళికి తాంబూలాలు పుచ్చుకుంటారని తెలియగానే ఈశ్వరరావుకి పంపలేదు దీన్ని బావకి ఈశ్వరరావు పంపడం అబద్ధం గబగబ చెప్పింది సుబ్బలక్ష్మి

"ఈశ్వరరావుకి ఇలాంటి ఫోటో పంపావేమో? ఇది బావకి పంపిందేనా? సరిగ్గా చూడు" అపనమ్మకంగా చూస్తూ అడిగింది చాముండేశ్వరి

కామేశ్వరి ఓ మూల ఇదేం తనకి పట్టనట్టు కూర్చుని పదమూడో ఎక్కాన్ని వెనకనించి ముందుకు వల్లె వేస్తోంది– అన్నీ తప్పులతో, జిన్ ప్రభావం ఆవిడ మీద తీవ్రంగా వుండటంతో

అసలు నేను పంపింది ఒకటే ఫోటో అదీ బావకే ఈశ్వరరావుకి కానేకాదు రోషంగా చెప్పింది సుబ్బలక్ష్మి"

"అసలీ ఈశ్వరరావెవరు?" అడిగాడు షణ్ముగరావు.

"పోయిన సారి నేను విజయవాడ బాబాయ్ మనవరాలి పెళ్ళికి వెళ్ళినప్పుడు, విడిది తీసుకున్న ఇంట్లో వుండేవాడు "

"అతనికి నీకు పరిచయం ఎలా అయింది?" అడిగింది చాముండేశ్వరి జిన్ ప్రభావం అప్పుడప్పుడే ఆవిడలో పోతోంది

"పరిచయమా, పాడా ఆయన ఆ ఇంటి ఓనర్ వయసు అరవైపైనే

"అరవై పైబడ్డ వాడితో నీవు ప్రేమ, పెళ్ళి, తనువులు కలపడం?" ఆశ్చర్యపోయాడు డాంబికేశ్వరరావు

"ఇదంతా అబద్ధం కావాలంటే విజయవాడ పూర్ణానందంపేట వెళ్ళి ఆయన్ని కలిసి మాట్లాడి రండి ఆయన భార్య సులక్షణంగా బ్రతికి వుంది" చెప్పింది సుబ్బలక్ష్మి, కోపంగా

"మరయితే నాకొచ్చిన ఈ వుత్తరం?" అడిగాడు డాంబికేశ్వరరావు.

"ఈ పెళ్ళి చెడగొట్టడానికి ఎవరో గిట్టని వాళ్ళు రాసి వుంటారు" చెప్పాడు అంత దాకా చేతులు కట్టుకుని దూరంగా, మౌనంగా నిలబడ్డ రాములు.

అయి వుండచ్చు నాకు వూరి నిండా శత్రువులే" చెప్పాడు షణ్ముగరావు

నాకు తెలుసు దాన్ని ఎవరు రాసారో చెప్పింది సుబ్బలక్ష్మి వెంటనే.

'మరి ఇందాక చెప్పలేదే? ఎవరు?" అడిగాడు డాంబికేశ్వరరావు.

"ఇంకెవరు? వినాయకం బావ" చెప్పింది

"ఛ పిచ్చి సన్నాసి అది వాడి చేతి రాత కాదు" అంది చాముండేశ్వరి.

"అదే అసలు ట్రిక్కు తను రాస్తే తెలిసి పోతుందని ఎవరి చేతో ఆ వుత్తరాన్ని రాయించాడు" చెప్పింది సుబ్బలక్ష్మి

'వాడలాంటి వాడు కాదు" చెప్పింది చాముండేశ్వరి.

**జరిగిన కథ– 11:** ఆదిలక్ష్మి, వినాయకరావులు మనసులు ఇచ్చి పుచ్చు కుంటారు సుబ్బలక్ష్మికి వినాయకరావు మనసు తెలిసి పోతుంది ఆదిలక్ష్మి బావ కామేశ్వరరావుతో ఆమెకి జరగబోయే నిశ్చితార్థాన్ని తప్పించే ఆలోచన చెప్పమని శాస్త్రిని అడుగుతాడు వినాయకరావు శాస్త్రి సలహా మేరకు తండ్రి డాంబికేశ్వరరావుకి సుబ్బలక్ష్మి ప్రియుడు రాసినట్లు ఒక ఉత్తరం రాసేస్తాడు వినాయకరావు అది చాలక సుబ్బలక్ష్మి తన ప్రియుడికి అంద చేసిన ఫోటో అంటూ సుబ్బలక్ష్మి ఫోటోని తండ్రికి పంపిస్తాడు అవి చూసి డాంబికేశ్వరరావు, చాముండేశ్వరి సుబ్బలక్ష్మిపై మండిపడతారు ఆవిషయం సుబ్బలక్ష్మి తల్లి తండ్రులకు చెపుతారు సుబ్బలక్ష్మి తండ్రి కూతురిపై చేయిచేసుకుంటాడు

# పెరుగుదలకి ఒక రుచికరమైన మార్గం గురించి రాశిఫలం చెప్తోంది
# ఫారెక్స్




మీకు రాశి చక్రాలలో నమ్మకం వుంటే, మిథున రాశిలో జన్మించిన బాబు ఉత్సాహం చిందిస్తూ, చురుగ్గా వుంటాడని భావించవచ్చు. బాబు ఎంత వేగంగా కదులుతూ ఉంటాడంటే, ఒకేసారి రెండుచోట్ల వున్నాడేమోనని మీకు అనిపిస్తుంది. బాబులో కుతూహలం ఎక్కువ. కొత్త-కొత్త విషయాలు తెలుసుకోడానికి ఇష్టపడతాడు. ప్రతి విషయంలోనూ అభిరుచి కల్గివుంటాడు.

అందుకే మీరు మీ సామాన్య లోకజ్ఞానం పెంచుకొని బాబు ఆపకుండా వేసే ప్రశ్నల పరంపరను ఎదుర్కోడానికి తయారుగా వుంటే మంచిది. భావావేశం ఎక్కువగా వుండే బాబుకి తన కుటుంబ సభ్యులంటే చెప్పలేనంత ప్రేమ. బాబు హస్తకౌశల్యం కూడా చెప్పుకోదగ్గదే.

మీకు రాశిచక్రాలలో నమ్మకం వున్నా లేకపోయినా, పోషకాహారం విషయానికి వస్తే మీరు నమ్మదగినది ఒకటి వుంది - అదే ఫారెక్స్.

**4** నెలలనుంచీ మీ బాబుకి 'పాలతో కూడిన ఫారెక్స్ సీరియల్' ఇవ్వండి. సమగ్రమైన గోధుమ సీరియల్‌తోనూ, సంపూర్ణమైన పాలతోనూ తయారు చేసిన దీనిలో కాల్షియం, మినరల్స్, విటమిన్లు మరియు ప్రోటీన్లు వుండి శీఘ్రంగానూ, అన్ని విధాలా బాబు పెరగడానికి కావలసిన పోషకత్వం అవి అందచేస్తాయి.

**6** నెలలనుంచీ రకరకాల రుచుల కోసమే కాక పూర్తి పోషకత్వం చేరిన ఆహారం కోసం బాబుకి 'ఫారెక్స్ వెజ్' కలిపి ఇవ్వండి.







**పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**

GX/48/244 TEL

లేకపోతే ఈశ్వరరావు పేరు ఎందుకు వుపయోగిస్తారు? ఓ సారి వుత్తరంలో నేను తమాషాకి విజయవాడలోని ఈశ్వరరావుని పెళ్ళి చేసుకుంటా జాగ్రత్త" అని బెదిరించడానికి రాసాను. పైగా నేను వినాయకం బావకి పంపిన ఫోటోని ఈశ్వరరావు తనకి పంపినట్లుగా ఎందుకు రాస్తాడు? ఇది బావ తెలివి."

అంతా నిశ్శబ్దంగా వుండిపోయారు ఎవరి ఆలోచనలతో వాళ్ళు డాంబికేశ్వరరావు, చాముండేశ్వరి ఒకరి మొహాల వంక మరొకరు చూసుకున్నారు చిన్నగా ఏడుపు వినబడటంతో సుబ్బులక్ష్మి వైపు చూసారంతా ఆమె వెక్కుతోంది

ఊర్కో' తల్లి నిజం తెలీక నీ మీద అనవసరంగా చెయ్యి చేసుకున్నాను" చెప్పాడు షణ్ముగరావు

"అందుక్కాదు నాన్నారు. నా మీద బావ అలాంటి అభాండం వేసినందుకు మీరంతా నమ్మితే నేనేమైపోవాలి?"

"నిజమే తల్లి వినాయకం దుర్మార్గుడు" చెప్పాడు షణ్ముగరావు కూతురు జుట్టు నిమిరి.

డాంబికేశ్వరరావు తల వంచుకున్నాడు

"బావకి నన్ను పెళ్ళి చేసుకోవడం ఇష్టం లేక ఇంత నాటకం ఆడి వుంటాడు మళ్ళీ వెక్కుతూ చెప్పింది సుబ్బులక్ష్మి

"వెధవని లాక్కొచ్చి కాళ్ళు చేతులు కట్టి మరీ పెళ్ళి చేయిస్తాను ఏమనుకుంటున్నాడో రాస్కెల్? మరీ ఇంత ఘోరమయిన అబద్ధాలా?" మండిపడ్డాడు డాంబికేశ్వరరావు

సుబ్బులక్ష్మి లోపలకి వెళ్ళి కొద్ది క్షణాల్లో ఓ వుత్తరంతో వచ్చి, దాన్ని డాంబికేశ్వరరావు కిచ్చి చెప్పింది

"ఇది బావ నాకు రాసాడు తను లక్ష్మి అనే అమ్మాయి నెవతనో ప్రేమిస్తున్నాడట. పెళ్ళి చేసుకుంటాడట. నన్ను మర్చిపొమ్మని రాసాడు"

'ఆ? మీకు తెలీకుండా వాడికి ప్రేమ కూడానా?" ఏదీ బయటకి చదవండి" చెప్పింది చాముండేశ్వరి కోపంగా

ఆయన లోపలికే చదువుకుని చెప్పాడు చిన్నగా నిట్టూర్చి



"ఎంతగా ఎదిగిపోయాడే నీ ముద్దుల కొడుకు మనం వాడింకా వెనకటి వినాయకం అనుకుంటున్నాం "

"హైదరాబాద్‌లో మేడ మీద ఆ రోజే చెప్పాడు నన్ను పెళ్ళి చేసుకోవడం ఇష్టం లేదని" చెప్పింది సుబ్బలక్ష్మి

"మరా విషయం నాతో అప్పుడే ఎందుకు చెప్పలేదు?" అడిగాడు షణ్ముగరావు క్రోధంగా

"పెళ్ళయ్యాక మర్చుదామనుకున్నాను "

"నీ బొందనుకున్నావు" అరిచాడాయన

"పదమూడు పదమూళ్ళు ఎన్నిరా? ' అడిగింది షణ్ముగరావు భార్య కామేశ్వరి రాములుని

అంతా ఆవిడ వంక చూసారు రెండు చేతి వేళ్ళు, రెండు కాళ్ళ వేళ్ళతో ఏదో లెక్కలు వేసుకుంటోంది

'అవును? అసలు ఈ ఆడవాళ్ళిద్దరికీ ఏమైంది ఇందాక?" అడిగాడు షణ్ముగరావు

'దొడ్లో ఆవులు అరుస్తున్నాయి చూసొస్తానయ్యా" చెప్పి రాములు బయటకి వెళ్ళిపోయాడు వెంటనే

'ఇందాక ఏమైందే నీకు? కామేశ్వరి మీద అలా విరుచుకు పడ్డావు?" అడిగాడు డాంబికేశ్వరరావు తన భార్యని

'ఏమోనండి అన్నం తింటూంటే ఎక్కడలేని శక్తి వచ్చినట్టనిపించింది ఒళ్ళు తేలి పోతున్నట్టుగా అయి ఓ విధమయిన నిర్లక్ష్యం కలిగింది ఎందుకలా అయిందో? చెప్పింది చాముండేశ్వరి

ఇలా దగ్గరకు రా పిలిచాడు షణ్ముగరావు

ఆవిడ దగ్గరకి వెళ్ళగానే చెల్లెలి నోటి దగ్గర ముక్కు వుంచి గట్టిగా వాసన పీల్చి చెప్పాడు ఏదో కనుక్కున్నట్టుగా

అదన్న మాట సంగతి

ఏది?

వాళ్ళ మంచినీళ్ళలో ఎవరో ఆల్కహాల్ కలిపారు

ఆల్కహాలా? అంటే? అడిగింది చాముండేశ్వరి

విస్కీ, రమ్, బ్రాందీ లాంటిదేదో కలిపారు

అమ్మో! నేను తాగింది అలాంటిదా?' అడిగింది చాముండేశ్వరి గుండెల మీద చెయ్యి వేసుకుని

పూర్తిగా చెప్పాడు షణ్ముగరావు

ఇందుకన్న మాట అంతా అంతంత డబ్బులు తగలేసి తాగేది భలే బావుందండి మీరు ఎన్నడూ తాగలేదు కాని చాముండేశ్వరి డాంబికేశ్వరరావు వైపు తిరిగి వుత్సాహంగా చెప్పింది

ఎవరి పని ఇది?" అడిగాడు డాంబికేశ్వరరావు షణ్ముగరావు వంక అనుమానంగా చూస్తూ

"అవును ఎవరి పని ఇది?' అన్నాడాయన ఆలోచనగా తర్వాత సుబ్బలక్ష్మి వంక చూస్తూ అడిగాడు

"మంచినీళ్ళు ఇచ్చింది నువ్వే కదా ఎక్కడివవి?'

'బిందెలో నివి '

బిందెలో నీళ్ళగా మేం తాగింది కూడా"



"ఈశ్వరరావు ఉత్తరం రాసాడంటేనే నేను నమ్మలేదు డాంబి మామయ్యచేత నిజం చెప్పించాలని నేనే ఏదయినా ఓ వుపాయం చెప్పమంటే ఒకరు ఈ పని చేయమని సలహా ఇచ్చారు "

"ఎవరు?"

"చెప్పను చెప్పనని నీ మీద వట్టేసాను" సుబ్బలక్ష్మి చెప్పింది తండ్రితో

"ఎవరా ఒకరు?' అడిగాడు డాంబికేశ్వరరావు షణ్ముగరావుని అసహనంగా

"ఇంకెవరు ఒరే రాములు" అరిచాడాయన

"రాములు పొలానికెళ్ళాడండి" బయట నించి రాములు కంఠం వినిపించింది

"నిస్సందేహంగా ఇది రాములు గాడి సలహానే" చెప్పాడాయన పళ్ళు పటపట కొరికి

"అవునా?" అడిగింది చాముండేశ్వరి

"నే చెప్పనుగా చెప్తే నన్నారు చస్తారు వట్టేసాను" చెప్పింది సుబ్బలక్ష్మి

"రాములు పని తర్వాత నేను చేస్తాను కాని, ఈ రభస వల్ల ఏతావాతా తేలిందేంటంటే వినాయకానికి సుబ్బలక్ష్మిని చేసుకోవడానికి పీల్లేదని" చిన్నగా నిట్టూర్చి చెప్పాడు షణ్ముగరావు.

"ఆ సంగతి ఇంత డొంక తిరుగుడుగా చెప్పాలా?" విసుక్కుంది చాముండేశ్వరి

"దీనికి ఒకటే మార్గం వుంది" చెప్పాడు డాంబికేశ్వరరావు

అంతా అతని వంక చూసారు

వాళ్ళు వున్న ఫలానా రమ్మని టెలిగ్రాం కొడదాం ఆ తర్వాత ' ఆయన చెప్పేది అంతా శ్రద్ధగా వినసాగారు

* * *

ఆ రోజు వుదయం వుతికిన బట్టలని ఇస్త్రీ చేస్తూ ఆదిలక్ష్మి, వినాయకరావు గురించే ఆలోచిస్తోంది

మనిషి చూడటానికి బావుంటాడు మంచి వుద్యోగం ఒకటే కులం కాకపోతే రొమాంటిక్‌గా వుండటం చేత కాదు పట్టి బుచ్చిబాబు పబ్లిక్ గార్డెన్‌లో తనతో కూర్చున్నంత సేపు అతను మాట్లాడిన మాటలని గుర్తుకు తెచ్చుకుంటూండి పోయింది

"ఏమిటే నీలో నువ్వే ఆలోచించుకుంటున్నావు?' అడిగింది కనకమహాలక్ష్మి కూతుర్ని

"ఏం లేదు ' వెంటనే సమాధానం చెప్పింది

ఆలోచించుకుని తల్లితో కొన్ని క్షణాల్లో చెప్పింది

నీకో విషయం చెప్పాలమ్మ "

చెప్పు

చిన్న కథనుకో

చెప్పవే ఎన్నో పత్రికలు లైబ్రరీ నించి తెచ్చి చదువుతున్నావుగా బావుంటే చెప్పు "

ఇది పత్రికల్లో వచ్చిన కథ కాదమ్మ నిజంగా జరిగింది "

అయితే రాసి పత్రికకో, రేడియోకో పంపు

అసలు చెప్పేది విను ముందు" విసుక్కుంది ఆదిలక్ష్మి

చెప్పు '

ఓ అమ్మాయి నాలానే రేడియోలో పాటలు పాడుతుంటుంది ఆ అమ్మాయి కంఠం, పాట నచ్చి ఓ అబ్బాయి ఆ అమ్మాయికి రేడియో స్టేషన్‌కి వుత్తరాలు రాస్తాడు ఆ అమ్మాయి జవాబులు రాస్తూంటుంది వాళ్ళిద్దరు ఒకరినొకరు ఓ రోజు ముందుగా ఓ చోటు అనుకుని అక్కడ కలుస్తారు తీరా చూస్తే ఆ అమ్మాయి ఇంట్లో అద్దెకుండే అబ్బాయే ఆ అబ్బాయి

'ఆ అబ్బాయికి ముందే ఎందుకు తెలీదు తన ఇంటి వాళ్ళ అమ్మాయి, ఈ అమ్మాయి ఒకరేనని '

# నాటి పెళ్లి ముచ్చట్లు



## అర్ధరాత్రి ముహూర్తం ముచ్చట!

నా పెళ్ళి గురించి ఎపుడు తలచుకున్నా నాకు విపరీతమైన నవ్వొస్తుంది. నాకు చిన్నప్పట్నుంచీ, బాగా నిద్రపోవడం అలవాటు. నా నిద్ర చూసి, మా ఇంటిలో వాళ్ళు అసూయపడు తుండేవారు, అంత చక్కగా ఎలా నిద్రపోగలవు అని. ఇంటికి చుట్టాలు ఎవరైనా వచ్చినపుడు వాళ్ళ బలవంతం మీద సెకండ్‌షోకి వెళ్ళానంటే, రెండు రోజులు స్కూలు ఎగ్గొట్టి, మరీ నిద్రపోయే దాన్ని. అలాంటి నాకు కుదిరిన పెళ్ళి ముహూర్తం మే 27, రాత్రి 1 గం.కి అన్నమాట. పెళ్ళి, పెళ్ళిలో తంతులు, ఏవీ పూర్తి మెలకువతో నిర్వహించలేక పోయాను. అంటే ఇంచు మించు పీటల మీద జోగుతూనే వున్నానన్న మాట. అయినా, కూరుకు పోతున్న కళ్ళతో, పట్టుచీర, నగలు సవరించుకుంటూ కూడా మా పెద్దమ్మేల, అత్తల కళ్ళకి ముగ్ధంగానే కనిపించేనట. మా పెళ్ళి అయ్యి 16 ఏళ్ళు అయినా, ఇంకా మా జంట గురించి ముచ్చటగానే చెప్పు కుంటున్నారు.

సుంకరి రమణి, విశాఖపట్నం



## సత్యభామ అనిపించుకున్నాను!

మా వారి పేరు కృష్ణశర్మ, నా పేరు రుక్మిణి. మా వివాహము అయి సంవత్సరము మీద 4 నెలలయింది. మా పెళ్ళిలో తలంబ్రాలు అన్ని అయిపోయాక దండ మార్చుకొనే టప్పుడు నన్ను లేచి దండ వెయ్యమన్నారు! నేను వేసాను. "కాళ్ళకు దండము పెట్టు" అని నన్ను ఉద్దేశించి పురోహితుడు అన్నాడు! మా వారు తన నుద్దేశించి అన్నారనుకొని నా కాళ్ళకు దండం పెట్టబోతుంటే అందరూ ఘొల్లున నవ్వారు! నేను కూడ నవ్వాపుకోలేక నిలుచున్న దాన్ని వెనక్కి తూలి కూర్చున్నాను! రుక్మిణి సత్యభామ అనిపించు కొన్నదని అందరూ అన్నారు! మా వారి మొహం చిన్నపోయినా తనూ నవ్వేసారు! ఆ విషయం తలుచుకొని యిప్పటికీ నవ్వుకుంటూ ఉంటాము.

పి. రుక్మిణి, మార్కాపురం

★ ★ ★

ఆ రోజు ప్రొద్దున్నే అక్క పెళ్ళి. అక్కని పెళ్ళి కూతుర్ని చేయాలని హడావిడిగా ఉన్నాం. పెళ్ళికూతురు చేసే ముందు మా పెళ్ళిలో నలుగు చేస్తారు.

## వినాయకరావు పెళ్లి

"ఆ అమ్మాయి పేరు ఆదిలక్ష్మి. కాని శృతి పేరుతో పాటలు పాడుతుంటుంది. పైగా ఒకరి చేతి రాత మరొకరికి పరిచయం లేదు."

కనకమహాలక్ష్మి ఆదిలక్ష్మి వంక చూసి అడిగింది.

ఆ అబ్బాయి పేరు?"

"వై. వి. రావ్."

"ఎవరతను?"

"వినాయకరావు."




"మన వినాయకరావా?" ఆశ్చర్యంగా అడిగింది కనకమహాలక్ష్మి.

"అవును."

"ఇది కథా లేక నిజంగా జరిగిందా?"

"నిజంగా జరిగిన కథ....."

మొదటి నించి జరిగిందంతా చెప్పింది ఆదిలక్ష్మి తల్లికి. పూర్తిగా విన్న ఆవిడ ఆశ్చర్యంగా అడిగింది.

"నిజమా? ఆట పట్టిస్తున్నావా?"

"నిజమే."

ఆవిడ కాసేపు మౌనంగా వుండిపోయింది. తర్వాత చెప్పింది.

"అతను నిన్నే పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడా?"

"అవును."

"నీవు?"

"నేను కూడా."

మరి కాసేపు మౌనంగా వుండి పోయిందావిడ.

"ఈ సంగతి నాన్నగారితో చెప్పాలి."

"చెప్తే ఇంకేమయినా వుందా? ముందతని చేత ఇల్లు ఖాళీ చేయిస్తారు. తర్వాత కామేశ్వరరావుకి నన్ను ముడి పెట్టేస్తారు."

"నిజమే. మీ అక్కయ్య బావని ప్రేమించి, నాన్నగారు వప్పుకోకపోతే అతనితో వెళ్ళిపోయి నప్పటి నించి ఆయనకి ప్రేమ వివాహాలంటే విరోధం. పోలీస రిపోర్ట్ ఇస్తే మీ అక్క, బావలని వెదికి పట్టుకుని పోలీసులు తమ పోలీస్‌స్టేషన్‌కి రిజిస్ట్రార్‌ని పిలిపించి, ఇద్దరికీ పెళ్ళి చేసి కాని వదల్లేదు. ఆ విషయం పేపర్‌లోకి కూడా ఎక్కడంతో మీ నాన్నగారికి తల కొట్టేసి నట్టయింది. చివరికి రాజీపడి ఇద్దరినీ ఇంటికి రానిచ్చారనుకో. అది వేరే సంగతి."

## నలుగుతో కారం!

అట్లాగే నేను పసుపు కలిపి అక్క దగ్గిర పెట్టినాను. ఇంక ఆ పసుపుని ఒక్కొక్కరు వచ్చి అక్క ముఖంకి, కాళ్ళకి, చేతులకి పూసి నలుగు చేసినారు. అంతా అయిపోయిన తరువాత కొంచెం సేపటికి అక్క, "అబ్బ! ఏవిటిది నాకు ముఖము, చేతులు మంటగా ఉన్నాయి" అంటోంది. నేనేమో పసుపేకదా కలిపి పెట్టినాను. అందులో ఏంకారం ముందబ్బా అని ఆలోచించ సాగాను. తర్వాత నాకు గుర్తొచ్చింది. మా నాన్న పిండి మిషన్‌లో పట్టించే టప్పుడు ముందుగా ఎండు మిరపకాయలు వేసి, తరువాత పసుపు కొమ్ములు వేసినారు అని. ఈ మాట అందరికి చెప్తే పగలబడి నవ్వేరు. ఇంక మా అక్క ఇటు నవ్వలేక అటు ఏడ్వలేక లేచి సబ్బుతో ముఖం కడుక్కొని ఆయింట్‌మెంట్ రాసుకుంది.



ఈ సన్నివేశం మా అక్క పెళ్ళినాటి సన్నివేశం. దీన్ని గుర్తుకు తెచ్చుకొని అప్పుడప్పుడు నవ్వుకొంటూ ఉంటాను.

ఎమ్. పర్వీన్‌బేగం, గుంటకల్

* * *

## "అనుకోని కక్షలు"

పెళ్ళి తతంగం పూర్తయినాక, బంతులాట వీపుమీద అప్పడాలతో కొట్టించడం, బిందెలో ఉంగరం – చుట్లు (మట్టెలు) వేసి తీయించటం లాంటి సరదా కార్యక్రమాలు మొదలెట్టారు. మా యిద్దరి చుట్టూ బాగా జనం మూగారు ఆ వినోదం చూడటానికి. తలంబ్రాలు పోసేటప్పుడు నేను దల్‌గా ఉన్నప్పటికీ– ఆయన, పళ్ళెంతో గబగబా గుమ్మరించేస్తూ నా మీద – ఆ కంగారులో ఆ తాంబాలంతో ఒక్కటేసారు నా నెత్తిమీద. అందరూ ఘొల్లున నవ్వారు ఆయన కంగారుకి! నా కెంతో అవమానం అయింది. బిందెలో ఉంగరం – మట్టెలు– మూడుసార్లూ నేనే తీసాను. ఆ కోపంతో నాలుగోసారి బిందెలో చెయ్యి పెట్టగానే అనుకోకుండానే కాస్త గట్టిగా గాటుపడేలా గిల్లేసారు. కెవ్వుమన్నాను నొప్పితో. అందరూ ఘొల్లున నవ్వారు! మరోసారి నాకు అవమానం– కళ్ళనీరు వచ్చాయి! సిగ్గుతో తలదించేసాను! ఈసారి ఆయన వీపు మీద అప్పడం పెట్టి కొట్ట మన్నారు. ఆ సమయం సందర్భం, వ్యక్తి, విషయం మర్చిపోయి, అవమానంతో దుఃఖంతో మా తమ్ముడ్ని కొట్టే అలవాటుతో ఒక్క అణువు అణిచాను అనుకోకుండా అప్పడం వంకతో నడ్డిమీద. అంతే! అందరూ నిశ్చేష్టులై చూస్తూండి పోయారు. అదీ అవమానమే అయింది నాకు. ఈనాటికీ తల్చుకునీ తల్చుకునీ నవ్వుకుంటాము యిద్దరము ఆ సంఘటనని. అనుకోకుండా ఒకరిమీద ఒకరం పెళ్ళిలోనే నలుగురిలోనే కక్షలు తీర్చుకున్నామనీ ఇంతైనా ఇంకితజ్ఞానం లేకుండాని!!

–శ్రీమతి జి. రామలక్ష్మి,
హైదరాబాద్



"మరెట్లా?"

"ఓసారి నాకు కామేశం అంటే ఇష్టం లేదని చెప్పావు కదూ?" అడిగిందావిడ.

తల వూపింది ఆదిలక్ష్మి.

"మీ నాన్నకి తీరికుంటే వాళ్ళకిలేక, వాళ్ళకి తీరికుంటే మీ నాన్నకిలేక కుదర లేదు కాని ఈపాటికి తాంబూలాలు పుచ్చేసుకుని వుండేవాళ్ళం."

"అది మన మంచికే వాయిదా పడిందమ్మా. ఈ పెళ్ళిని ఆపాలి." చెప్పింది ఆదిలక్ష్మి.

"ఈ విషయంలో మీ నాన్న దగ్గర నోరెత్తితే నన్ను గొంతు పిసికి చంపినా చంపగలరు" చెప్పింది కనకమహాలక్ష్మి.

"అదే నా భయం కూడా. నాన్నగారు ఓ పట్టాన వప్పుకోరు."

"వినాయకరావంటే ఇదివరకు ఆయనకి వున్న కోపం తగ్గింది కదా" చెప్పింది కనకమహాలక్ష్మి.

"అవును."

చాలా సేపు తల్లీ కూతుళ్ళిద్దరూ ఆ విషయం మాట్లాడుకుంటూండి పోయారు."

* * * * * * * * * * * * *

ఆ రోజు సాయంత్రం అకస్మాత్తుగా మద్రాస్ నించి దిగారు నాదకర్ణి, ఆయన కొడుకు కామేశ్వరరావు. వాళ్ళని చూసి కనకమహాలక్ష్మి కొద్దిగా తబ్బిబ్బయింది.

"రేపు వుదయం ఎనిమిదీ అయిదుకి తాంబూలాలు పుచ్చుకుని ఐర్నించి కరీంనగర్‌కి వెళ్తాం. రేపు మధ్యాహ్నం రెండూ అయిదుకి నా కొత్త సినిమా ముహూర్తం షాట్" చెప్పారు నాదకర్ణి.

"సామాను లేకుండా దిగారేమిటి?" అడిగింది ఆవిడ.

"హోటల్‌లో దిగాం. విషయం చెప్పి పోదామని వచ్చాం" చెప్పారు నాదకర్ణి.

"సమయానికి ఆయన ఇంట్లో లేరు."

"ఫర్వాలేదు. వస్తే అశోకా హోటల్‌కి వచ్చి నన్ను కలవమని చెప్పు. వెళ్ళొస్తాం. చాలా పనులున్నాయి."

వచ్చినంత హడావిడిగా బయట ఆపుకున్న కారులో వెళ్ళి పోయారు. బాత్‌రూంలో బట్టలు వుతుకుతున్న కూతురు దగ్గరకి వెళ్ళి ఆ విషయం చెప్పింది ఆవిడ.



# వినాయకరావు పెళ్ళి

"అరెరె! ఎలా?" కంగారుగా చెప్పింది ఆదిలక్ష్మి

'మీ నాన్నగారికి చెప్పాల్సిన అవసరం వచ్చింది ఏమవుతే అదే అవుతుంది చెప్తాను'

ఆదిలక్ష్మి వెంటనే చేతులు తుడుచుకుని, బట్టలు మార్చుకుని బయటికి వెళ్ళింది ఎల్ ఐ సి కి వినాయకరావు కోసం ఫోన్ చేసింది

"ఏమిటి?" అడిగాడు వినాయక రావు

ఆదిలక్ష్మి నాదకర్ణి, కామేశ్వరరావుతో రావడం గురించి చెప్పింది అంతా విన్నాక అడిగాడు వినాయకరావు

"తర్వాత కరీంనగర్ వెళ్తార్టా?'

"అవును అక్కడ వరసగా ఇరవై ఆర్రోజులూ మీటింగ్ అట

సరే అయితే మిగతా విషయాలు ఇంటి దగ్గర మాట్లాడుకుందాం' ఫోన్ పెట్టేసాడు వినాయకరావు

శాస్త్రి దగ్గరకి వెళ్ళాడు

ఆదిలక్ష్మి ఫోన్ చేసింది

నాదకర్ణి, కామేశ్వరరావు వచ్చారు రేపే తాంబూలాలు అంతేనా? అడిగాడు శాస్త్రి నింపాదిగా

"నీ కెలా తెలుసు" ఆశ్చర్య పోయాడు వినాయకరావు

"నీ ఎక్స్‌టెన్షన్ కి ఆదిలక్ష్మిని కనెక్ట్ చేసాక మొత్తం విన్నాను'

అంటే ఆదిలక్ష్మి ఎప్పుడు ఫోన్ చేసినా నీవు మా సంభాషణ వింటూంటావా? అడిగాడు వినాయకరావు కోపంగా

'అవును'

"అదేం బుద్ధి?"

"మీ లైన్ ఎప్పుడూ సాఫ్ట్‌గా వుంటుంది కాని ముద్దులు లాంటివేం ఎక్స్ఛేంజ్ చేసుకోరు కాబట్టి హాట్‌గా వుండదు అదే గిరీశానికి ఫోన్ వస్తే ఆ లైన్ పరమ హటాత్తి హాట్‌గా మారి పోతుంది

ఇది చాలా చెడ్డ అలవాటు చెప్పాడు వినాయకరావు ఎర్రబడ్డ మొహంతో

నా అలవాట్ల గురించి తర్వాత అసలు విషయానికి వద్దాం రేపు తాంబూలాలు కదా!"

"అవును వాటిని ఆపాలి

'ఓ పని చెయ్యి

వినాయకరావు ఏమిటన్నట్లుగా శాస్త్రి వంక చూసాడు

"నగరంలో అన్ని కిళ్ళీ కొట్లలోకి, అన్ని కూరల మార్కెట్లలోకి వెళ్ళి తమలపాకులన్నీ కొనేసెయ్ ఇంక తాంబూలా లెలా పుచ్చుకుంటారు?"

'వెధవ జోకులు మాని మంచి ఆలోచన చెప్పు"

"జోకు కాదది ఓ ఐడియా. ఇలా ఆలోచిస్తే రాదు రాత్రిలోగా దానంతట అదే వస్తుంది" చెప్పాడు శాస్త్రి

"రాకపోతే?"

ఆఫీసయాక ఓ తేలు చేత కుట్టించు చచ్చినట్లు వస్తుంది'

'ఆ ఖర్చు తప్పదా స్వామీ?" అడిగాడు వినాయకరావు నిస్పృహగా

'జీవితంలో కొన్ని ఖర్చులు మనిషికి ఆనందాన్ని ప్రసాదిస్తాయి శిష్యా ఇది నీ ఆనందం కోసం పెట్టే ఖర్చు అనుకో" చెప్పాడు శాస్త్రి

ఆ రాత్రి ఆఫీసయాక ఇంటి కెళ్ళి శాస్త్రి స్నానం చేసి మొహానికి పౌడర్ కొట్టుకుని నీట్‌గా తల దువ్వుకుని ఇస్త్రీ బట్టలు తొడుక్కున్నాక ఇద్దరు దగ్గరే వున్న బార్‌కి వెళ్ళారు క్వార్టర్ ఆర్డర్ చేసాక చెప్పాడు శాస్త్రి

అదేంటో? విస్కీ ఎంత మధుర మయిందయినా నా డబ్బులో తాగబుద్ధి కాదు ఎందుకో తెలుసా?

నీ డబ్బుతో ఆరోగ్యం పాడు చేసుకోవడం ఎందుకనా?'

'కాదు దుబారా ఖర్చు లెందుకని!' నవ్వాడు

త్వరగా సమాధిలోకి వెళ్ళి మంచి ఐడియాని పట్టుకురా చెప్పాడు వినాయకరావు

ఎప్పటిలానే ఎలాంటి ఆలోచనా శాస్త్రికి తట్టలేదు బార్‌లోంచి బయటకి వస్తూంటే

వస్తుందిలే శిష్యా రాక ఎక్కడికీ పోదు చెప్పాడు శాస్త్రి తూలుతూ

* * * * * * * * * * *

రమణమూర్తి ఇంటికి వచ్చాక చెప్పింది కనకమహాలక్ష్మి నాదకర్ణి వచ్చి వెళ్ళిన సంగతి

అశోకా హోటల్‌లో వున్నార్ట మిమ్మల్ని వచ్చి కలవమన్నారు' చెప్పింది

'అలాగా ముహూర్తం ఎప్పుడన్నావు? తమలపాకులు, పళ్ళు, అగరబత్తి వగైరాలన్నీ తీసుకు రావాలి సంచీ ఇవ్వు' చెప్పాడాయన

"ఓసారి మీరు దాన్ని కూడా అడిగితే మంచిదేమో? చెప్పింది ఆయన భార్య

"ఎవర్ని?'

'ఆదిని"

'ఏమని?

కామేశంతో పెళ్ళి ఇష్టమో కాదో"

అడిగి? దాని కిష్టం లేదంటే మానేయాలా? ఒకొక్కళ్ళనీ నరుకుతాను, ఇలాంటివి మాట్లాడారంటే దానిష్టం ఏమిటి, బోడిష్టం ఎవర్ని చేసుకోమంటే వాళ్ళని చేసుకోవాలి వాళ్ళ కష్ట సుఖాల్ని వాళ్ళకన్నా నేనే ఎక్కువ ఆలోచిస్తాను కసిరాడాయన

అదికాదు నాన్నగారు! నాకు

ఆదిలక్ష్మి పక్క గదిలోంచి వచ్చి తల వంచుకుని ఏదో చెప్పబోతుంటే ఆయన వినిపించుకో లేదు

ఇప్పుడు కాదు తర్వాత అవతల పెద్దమనిషి నా కోసం ఎదురు చూస్తున్నాడు చెప్పి హడావిడిగా బయటికి వెళ్ళి పోయాడు రమణమూర్తి

ఆదిలక్ష్మి వినాయకరావు గది దగ్గరకి వెళ్ళి బయటనించే తలుపు మీద తట్టింది వినాయకరావు బయటికి వచ్చాడు

మీరా? అడిగాడు ఆమెని చూసి

మా నాన్నగారితో మా అమ్మ ఈ విషయం మాట్లాడింది ఆయన మా ఇద్దరి మాట వినేట్లుగా లేరు

'ఏం చేద్దాం?'

ఇది తప్పించుకోడానికి మీరే ఏదో ఒకటి ఆలోచిస్తానన్నాడు'

ఇంకా మంచి ఐడియాలేం రాలేదు'



# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

755-T

"కానీ ఓ పని చేయండి" అడిగింది

'ఏమిటి?'

తలవంచుకుని, కుడి కాలి బొటన వేలిని నేలకేసి కాసేపు రాసి నెమ్మదిగా చెప్పింది

"మా నాన్నగారితో చెప్పండి, మీకు నన్ను చేసుకోవాలని వుందని"

అలాగే. కాని నన్ను గది ఖాళీ చేయిస్తే?'

"మొరాయించండి మీ కలవాటేగా!" నవ్వింది

'అయినా మీ నాన్నగారు తాంబూలాలు పుచ్చేసుకుంటే?'

"పెళ్ళయినట్లు కాదుగా తర్వాత ఏం చేయాలో ఆలోచించచ్చు"

ఆ రాత్రి మూడు సార్లు వినాయకరావుకి మెలకువ వచ్చింది ఓసారి పన్నెండుం పావుకి శాస్త్రి వినాయకరావుని లేపి మంచినీళ్ళిమ్మన్నాడు రెండోసారి రెండున్నరకి మళ్ళీ లేపాడు

"అబ్బబ్బ మందు కొట్టిన రాత్రల్లా ఇలా ఎందుకు డిస్టర్బ్ చేస్తావు' లేచి గ్లాసులో మంచినీళ్ళని అందించాడు

దాన్ని గటగట తాగి, ఖాళీ గ్లాసు అందించి చెప్పాడు–

"ఈ సారి దాహం అయి లేపలేదు నిద్రలో నా మెదడు సబ్‌కాన్షస్ స్టేట్‌లో నీ సమస్య గురించి ఆలోచించింది మంచి పరిష్కారం దొరకగానే మెలకువ వచ్చింది

'ఏమిటది?'

'రేపు వుదయం ముహూర్తం టైంలో ఆదిలక్ష్మిని ఓ పని చేయమను ఎలాగూ వాళ్ళు కరీంనగర్ దగ్గరున్న పల్లెటూరికి సినిమా ముహూర్తానికి బయల్దేరాలి– కాబట్టి వుండరు '

ఆదిలక్ష్మి ఏం చేయాలో చెప్పాడు శాస్త్రి

'సింపుల్ అండ్ బెస్ట్ ఇంతకంటే మంచి ఐడియా మళ్ళీ నిద్రలో వస్తుందేమో చూస్తాను"

"ఇది బానే వున్నట్టుంది" చెప్పాడు వినాయకరావు.

మూడోసారి టెలిగ్రాఫ్ మెసెంజర్ తలుపు కొట్టి వినాయక రావుని నిద్ర లేపాడు సంతకం చేసి టెలిగ్రాం అందుకుని దాన్ని చదివిన వినాయకరావు పై ప్రాణాలు పైనే పోయినట్లయ్యాయి

శాస్త్రిని నిద్ర లేపి చెప్పాడు

'ఇంటి నించి టెలిగ్రాం వచ్చింది

'ఏమని? అడిగాడు

"సుబ్బలక్ష్మి అటెంప్టెడ్ సుయిసైడ్ స్టార్ట్ ఇమీడియట్లీ" అని నాన్నగారు మా సుబ్బలక్ష్మి వూరు నించి ఇచ్చారు

'సుబ్బలక్ష్మి ఆత్మహత్యా ప్రయత్నమా? ఎందుకట?'

ఎందు కేమిటి? నీ చచ్చు సలహా విని ఈశ్వరరావు ఆ ఫొటో ని పంపినట్లుగా వుత్తరం రాసి పంపానుగా అది నిజం కాదు కాబట్టి తన మీద పడ్డ అపవాదుకి సుబ్బులు కదిలిపోయి ఆత్మహత్యా ప్రయత్నం చేసి వుంటుంది"

"ఇంత వూహాశక్తి వున్న వాడివి నన్నెందుకు సలహాలు అడగడం? నీ చావు నీవు చావు సుబ్బలు చావు ఆమెని చావనీ మత్తుగా మళ్ళీ ముసుగు తన్నాడు శాస్త్రి

వినాయకరావు చేతి గడియారం వంక చూసుకున్నాడు పూర్తిగా తెల్లవార డానికి ఇంకా గంటన్నర టైముంది బాత్‌రూం లోకి వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకున్నాడు బ్రీఫ్‌కేసులో బట్టలు సద్దు కున్నాడు. ఆఫీసుకి రెండు రోజులకి శెలవు చీటీ రాసి దాన్ని శాస్త్రి టూత్‌పేస్ట్ ట్యూబ్ కింద వుంచాడు

బ్రీఫ్‌కేసుతో బయటకు వచ్చిన వినాయకరావుని నీళ్ళు పడుతున్న ఆదిలక్ష్మి చూసింది

"వూరా వెళ్ళేది?" అడిగింది





# స్పెల్లింగ్ పోటీలో వుయ్యూరు "రత్న" ప్రభ

విదేశాలలో నివశిస్తున్న భారతీయులు అనేక రంగాలలో తమ ప్రతిభను ప్రదర్శించి అక్కడి వారికే ఆశ్చర్యం కలిగించిన సంఘటనలెన్నో వున్నాయి. అవకాశం కల్పిస్తే భారతీయులు ఏ రంగంలోనైనా ఉన్నత శిఖరాలను అందుకోగలరని నిరూపించారు.

కృష్ణాజిల్లా వుయ్యూరుకు చెందిన బాలిక సజ్జా రత్న అమెరికాలో తాను విద్యాభ్యాసం చేస్తున్న లేక్‌షోర్ జూనియర్ హైస్కూలుకు టైటిల్‌ను తిరిగి సంపాదించి అందరి ప్రశంసలు పొందింది.

లేక్ మిచిగాన్ కళాశాలలో జరిగిన స్పెల్లింగ్ పోటీలో ప్రథమస్థానం సంపాదించి క్లోవర్ లీఫ్ స్పెల్లింగ్ బీ టైటిల్‌ను గెలుచుకుంది.

లేక్‌షోర్ జూనియర్ హైస్కూలులో సజ్జా రత్న 8వ తరగతి చదువుతోంది.

1980 నుండి 1985 వరకు వరుసగా ఆరేళ్ళు లేక్‌షోర్ పాఠశాలకు క్లోవర్ లీఫ్ వ్యక్తిగత టైటిల్స్ దక్కాయి. గత రెండేళ్ళు ఈ పోటీలో లేక్‌షోర్ విద్యార్థులు పాల్గొనలేదు. వేతనానికి సంబంధించిన వివాదం వల్ల పాఠశాలకు కోచ్ లేకుండా పోయాడు. లేక్‌షోర్ విద్యార్థులు పోటీలో లేక పోవడంతో బెరీన్ స్ప్రింగ్స్ సెవెన్త్‌డే అడ్వెంటిస్ట్ పాఠశాలకు చెందిన మార్లాకు వ్యక్తిగత టైటిల్ లభించింది.

డాక్టర్ సజ్జా ప్రసాద్, శ్రీమతి విజయల నోముల పంట రత్న. డాక్టర్ ప్రసాద్ బెంటాన్‌లోని రివర్ వుడ్ కమ్యూనిటీ మానసిక ఆరోగ్య కేంద్రంలో సైకియాట్రిస్ట్‌గా పని చేస్తున్నారు.

1974లో రత్న వుయ్యూరులో జన్మించింది. ఆరు మాసాల వయసులోనే తల్లిదండ్రులతో అమెరికాకు వలస వచ్చింది. '1984లో రత్నకు అమెరికన్ పౌరసత్వం లభించింది.

లేక్‌షోర్ హాలీవుడ్ ప్రాథమిక పాఠశాలలో విద్యాభ్యాసం ముగిసిన తరువాత రత్న జూనియర్ హైస్కూలులో చేరింది.

"హెమిక్రేనియా" వంటి మారుమూల పదాల స్పెల్లింగ్‌ను కూడా ఖచ్చితంగా చెప్పి రత్న ఈ పోటీలో విజయం సాధించింది.

మే 30 నుండి జూన్ 5 వరకు వాషింగ్టన్‌లో జరిగే స్పెల్లింగ్ పోటీలలో రత్న పాల్గొంటుంది. వాషింగ్టన్ పర్యటనకు గాను క్లోవర్ లీఫ్ సంస్థ 650 డాలర్లు యిస్తుంది. ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికా సంస్థ కూడా ఎన్‌సైక్లోపిడియా (విజ్ఞాన సర్వస్వం)ను బహూకరిస్తుంది. లేక్‌షోర్ పాఠశాలలో ఆరవ తరగతి చదువుతున్న అమంద మోర్టిమోర్‌కు ద్వితీయ స్థానం లభించింది. 

"అవును మా సుబ్బులుకి సీరియస్‌గా వుందిట" చెప్పాడు.

"నిజమా? లేక మా నాన్నగారితో మాట్లాడమన్నానని వుడాయిస్తున్నారా?" నవ్వుతూ అడిగిన ఆదిలక్ష్మి కంఠంలో తీవ్రత ధ్వనించింది.

"నాలో పలాయనవాదంలేదు."

జేబులోంచి టెలిగ్రాం తీసి చూపించాడు. దాన్ని చదివి అడిగింది.

"ఎందుకంటే?"

"నావల్లే".

సుబ్బులుతో పెళ్ళి తప్పించుకోడానికి తను ఈశ్వరరావు గురించి రాసిన వుత్తరాలు గురించి చెప్పాడు.

"బెడిసికొట్టినట్టుంది" చెప్పాడు బాధగా.

"ఊరికే ఇదవకండి. ఐ హోప్ ఎవ్విరి థింగ్ విల్‌బి ఆల్‌రైట్" చెప్పింది ఆదిలక్ష్మి ధైర్యం చెప్తూ.

"అన్నట్టు మీకు ఐడియా...."

తాంబూలాలు తప్పించుకోడానికి ఏం చేయాలో చెప్పాడు వినాయకరావు.

"ఎలా వుంది?" అడిగాడు.

చిన్నగా నవ్వి చెప్పింది ఆదిలక్ష్మి–

"మీ చిన్న బ్రెయిన్‌కి ఇంత చిన్న ఆలోచన తట్టినందుకు థాంక్స్."

"ఇది నాకొచ్చిన ఆలోచనకాదు. శాస్త్రిది"

"అది పని చేస్తుందనే ఆశిద్దాం" చెప్పింది ఆదిలక్ష్మి.

"గుడ్‌లక్" చెప్పాడు.

"మన సంగతి నిన్న మా అమ్మకి చెప్పేసాను. ఎలాంటి వ్యతిరేకత ఆవిడవైపునించిలేదు. గుడ్‌లక్ టూ మీట్" చెప్పింది ఆదిలక్ష్మి.

వినాయకరావు బయటకు వెళ్ళిపోయాడు.

సరిగ్గా ముహూర్తానికి అరగంట ముందు వచ్చాడు నాదకర్ణి, కామేశ్వరరావు, పురోహితుడు.

"పిల్లని త్వరగా తెమల మనండి" హెచ్చరించాడు పురోహితుడు.

"అలాగే" చెప్పింది కనకమహాలక్ష్మి.

ముహూర్తానికి పావుగంట ముందు చెప్పాడు. పురోహితుడు మంత్రాలు చదవడం మధ్యలో ఆపి–

"ఇహ టైంలేదు. అమ్మాయిని తీసుకురావాలి."

"త్వరగా తీసుకురా. ఏం చేస్తోంది?" కసిరాడు రమణమూర్తి.

లోపలకి వెళ్ళొచ్చి చెప్పిందావిడ.

"స్నానం చేస్తోంది"

"ఇంకానా? బట్ట చుట్టుకుని రమ్మను".

"ఇప్పుడే వంటికి నూనె రాసుకుంది" చెప్పింది కనకమహాలక్ష్మి.

"నూనా?"

"అవును తలకి, జుట్టుకి, వంటి మీదంతా నూనె రాసుకుంది. జిడ్డోడుతూ అలా ఎలా రాగలదు ఇప్పుడు. ముహూర్తం తొమ్మిది అయిదుకు అనుకున్నా అన్నది ఇదేం పనమ్మా అని అడిగితే" నెమ్మదిగా చెప్పింది కనకమహాలక్ష్మి.

"ఇహ అయినట్టే""విసుక్కున్నారు పురోహితుడు అందరివంకచూసి.

ఆదిలక్ష్మి స్నానం పూర్తి చేసి బాత్‌రూమ్‌లో నుంచి వచ్చేసరికి రమణమూర్తి మండిపడుతూ అటు, ఇటు తిరుగుతున్నాడు. నాదకర్ణి, కామేశ్వరరావు కారులో కరీంనగర్ వెళ్తున్నారు.

"దాన్నేం అనకండి. నాది పొరబాటు. తొమ్మిది అయిందనుకుని నేనే దాన్ని స్నానానికి పంపాను" చెప్పింది కనకమహాలక్ష్మి భర్తతో.

ఆయన ఇద్దరివంకా కోపంగా చూసి పెద్ద అడుగులు వేసుకుంటూ బయటకు వెళ్ళిపోయారు.

ఆదిలక్ష్మి తల్లివంక చూసి నవ్వుతూ చెప్పింది.

"ఆ ఐడియా పని చేసింది"

* * * * * * *

అక్కడ కొన్నివందల మైళ్ళ దూరంలో వున్న షణ్ముగరావు ఇంట్లో పెళ్ళి పందిరి తయారవుతోంది. సుబ్బలక్ష్మిని పెళ్లికూతుర్ని చేయడానికి మధు పర్కాలకోసం వెళ్ళాడు షణ్ముగరావు.

బస్సులో ఆ వూరికి వెళ్తున్నాడు వినాయకరావు. మధ్యాహ్నం రెండుంపావుకల్లా చేరుకుంటాడు.

(ఇంకా వుంది)

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

హెచ్ ఎన్ కాజులూరు

★ రూప కన్వార్‌పై మీ అభిప్రాయం?

● పాపం రోజూ దారుణంగా కాల్చి చంప బడుతున్న ఆడపిల్లలలో ఒకతె

★ నేటి సినిమాలపై మీ అభిప్రాయం?

● ఆడదీనాడింత అలుసై అవమాన కరమైన స్థితిలోకి దిగజారి పోడానికి– సగం కారణం తెలుగు సినిమాలే! మిగిలిన సగం– వాటిని నిజ జీవితాలకి అన్వయించే ప్రబుద్ధులు!

★ శత్రువంటే ఎవరు?

● మీతో ఏకీభవించని వాడను కుంటున్నారా? కాదు– మీతో ఏకీభవిస్తూన్నట్టు నటిస్తూ గొంతు కోసేవాడు!

**ఎన్. ఆర్. బి. హైదరాబాదు**

★ మీరు రాసిన మంచి నవలను ఒరియాలోకి అనువాదం చేయాలని వుంది.

● హైదరాబాదులో వుండి– నాకు రాయడం ఏమిటి? శుద్ధ అమాయకుడిలా వున్నారు! కన్నడ రాజ్యలక్ష్మిని ఏలుతూన్న అతిరథ మహారథులు అక్కడే వున్నారు– అవే– అందుకుని అనువదించండి– మీకూ పేరు– వారికీ పేరు. కన్నడంలోకి ఏ ఇతర భాషా చిత్రాలూ డబ్ చేయనీయరు కాని పాపం– వారి పత్రికలవి విశాల దృక్పథం– మన సెన్సేషనల్ సీరియల్స్ అన్నీ– ధారావాహికంగా అక్కడ ఏలుతున్నాయి కన్నడ సాహితీవేత్తలు కళ్ళు తెరిచేదాకా– భో కాలేదు

బి ఎస్ కాశిబుగ్గ

★ మీరు చలం గారి సాహిత్యం చదివారా? వారి స్త్రీపై మీ అభిప్రాయం ఏమిటి? నేటి సమాజ స్త్రీకి ఆ చలం స్త్రీ ఆశాదీపం అవుతుందా కాదా?

● చలంగారు వ్యక్తిగతంగా తెలియక ముందు చలం రచనలు చదివాను ఇక వారి స్త్రీ యీతరం స్త్రీకి ఆశాదీపం కాకపోయినా ఫరవా లేదు. మానసిక దౌర్బల్యానికి అతీతంగా బ్రతకా లనుకునే నేటి మహిళలు– ఒక రకంగా వీర వనిత లని నా నమ్మకం చలం స్త్రీలు కారు

★ వర్గ రహిత సమాజం వచ్చేదాకా స్త్రీ సమస్య– పరిష్కారం అవుతాయని అనుకోను

● అని ఎలా చెప్ప కలరు? అసలు రష్యాలో వర్గరహిత సమాజం వుందా? లేదా? ఎవరూ సూటిగా జవాబు చెప్ప రెందుకు?! రాని సమాజం వస్తే గాని సమస్యల పరిష్కారం కావను కోడం నిరాశావాదం చదువు, ఆర్థిక బలం, అవకాశం పెంపొందించు కుంటే– ఆడది సాధించ లేనిది ఏదీ వుండదని– నా నమ్మకం

★ నవ సమాజ నిర్మాణంలో మీ పాత్ర?

● చాలా తక్కువే కాని ఒక్కటి ధైర్యంగా చెప్ప గలను నేను సహితం స్త్రీల దౌర్భాగ్యానికి ఓ సమిధ అందించ లేదు! నా కంట్రిబ్యూషన్–అంతే చాలదా?!

**ఎల్. కె. ఆర్. కానూరు అగ్రహారం**

★ జీవ్ మంచి పనులు చేస్తుంటే ఇతర దేశాలు అభినందిస్తున్నాయి మనవాళ్ళు వ్యతిరేకిస్తున్నారు

● పైవాడి కేం తెలుస్తుంది– మన బాధ!!

★ కట్నం తీసుకోని యువకునికి ఏదో లోపం వుందన్న సంఘాన్ని ఏమనాలి?

● అసలు కట్నం తీసుకోవాలను కోడం కంటే పెద్ద జబ్బు యింకోటి వుంటుందని నేను అనుకోను! మిగిలిన రోగాలకి వైద్యం వుంది. దీని కేం మందో– ఎవరికి వారు గ్రహించాలి– అందుకే– కుదరడం కష్టం

**వి. బి. జి. తిరుపతి**

★ మీ శీర్షికలో ఉన్న ఫోటో తీసేశారెందుకు?

● వేస్తే వేశా రెందుకని గోల పెట్టేశారు. మరిచి పోయారా?!

★ మీరు రాజకీయాలలో చేర కూడదా?

● గట్టున వుండి చూస్తే వున్న సుఖం– దిగాక వుండదు కదా?

★ చాలా మంది పత్రిక రాగానే ప్రశ్నావళి చూస్తా రెందుకు? రచయిత్రిగా అభిమానమా? మీరు నిర్మొహ మాటంగా ఇచ్చే సమాధానాలా?

● సింపుల్ క్యూరియాసిటీ!

**బి. ఎస్. భీమవరం**

★ కె రా గారూ సమాజం మారడానికి సాహిత్యం ఎంత వరకు ఉపయోగ పడుతుంది?

● ఇప్పు డొస్తున్న సాహిత్యం (అనొచ్చా?) అసలు ఎందుకు ఉపయోగిస్తుందో– అర్థం కావడం లేదు. ఆడ పిల్లలని అల్లరి చేయడానికి, చౌకబారు సమాచారం అంద చేయడానికి, రేపులు, దోపిడీలు, దొంగతనాలు పకడ్‌బందీగా ప్లాను చేయడానికి కొత్త కొత్త మోడస్ ఆపరేడీ అరటి పండు ఒలిచి చేత పెట్టినట్టు– బోధిస్తూ కృషి చేయడం లేదా? ఇదీ చిన్న విషయం కాదే!! అని చదివే వాళ్ళు సంతోషిస్తున్నట్టు– పుంఖాను పుంఖాలుగా అభిప్రాయ ప్రకటనల ప్రచురణ ద్వారా– తెలియ చేస్తున్నారు కదా! మానిందే– మందు చదివిందే సాహిత్యం!!

**ఎమ్ వి. ఆర్. హైదరాబాదు**

★ ప్రేమించకపోతే ఏం?

● ఏం లేదు– మనసు చంపుకొని పండు ముసలిగా కాలం చేయవచ్చు మనసు కళ్ళెం సడలించి– కోరికల గుర్రాలు స్వారి చేసి చిన్న వయసులోనే కాలమూ చేయవచ్చు– ఎలాగైనా– ముగింపు తప్పదు కద! అందుకే– కాస్త కోరిక, కాస్త కంట్రోలు– కాస్త వ్యథ, కాస్త తృప్తీ వీటితో అటూ ఇటూ కాని వయసులోనూ– కన్ను మూయవచ్చు. ఏం పోదు!! □

# కాగితం పడవలు

డి.ఎ. సుబ్రహ్మణ్యశర్మ

ముందు కొంగి సైకిల్ తొక్కుతున్నాడా వ్యక్తి.

వయసు గడిచిన ఛాయలు మొహం మీద కన్పిస్తున్నాయి.

జుట్టు పైకి దువ్వుకొన్నాడేమో – నుదురు విశాలంగా కన్పిస్తోంది.

ముక్కు మీద తమాషాగా ఆనిన కళ్లజోళ్లోంచి చురుగ్గా చూస్తున్నాయి కళ్లు. రోడ్డు ఎత్తుగా ఉందేమో – మూతి బిగబట్టి తొక్కుతున్నాడు.

ఇతను రాఘవ కాదు కదా? –

కిటికీలోంచి చూస్తున్న రమ్య అనుకొంది.

ఎదురుగా కూర్చుని వున్న దివ్య – తల్లిని గమనిస్తూనే వుంది.

"ఆయన మా కొత్త లెక్చరర్" అంది.

తనని గమనిస్తోందన్న మాట!

"మా కాలేజీకి కొత్తగా ట్రాన్స్‌ఫరయి వచ్చారు. ఇంగ్లీషు చెప్తారు" మరికొన్ని వివరాల్ని అందజేసింది.

"పేరు?"

"రాఘవగారు. చాలా బాగా చెప్తారు."

"అహఁ –" అంది గాలిలో ఎగురుతూన్న తల వెంట్రుకల్ని పైకి తోసుకుంటూ.

రాఘవేనన్నమాట!

క్రితం రోజు కూడా సైకిల్ మీద వెళ్తూ కనిపించాడు. అప్పుడే తన కనిపించింది – అతను రాఘవేనని. కానీ – మనిషిని పోలిన మనుషులుండొచ్చు కదా – అని సరిపెట్టుకొంది.

ఎంతగా మారిపోయాడు!

అప్పట్లో రాఘవ ఎంత అందంగా ఉండేవాడని! వంకీలు తిరిగిన నల్లని జుత్తుతోనూ, మిలమిల మెరిసే కళ్లతోనూ, చక్కని ముఖకవళికలతోనూ, ఎవరన్నాసరే – ఇట్టే ఆకర్షించుకొనేవాడు!

కానీ – ఇప్పుడో?! – మనిషి సన్నబడ్డాడు. జుట్టు పల్చబడింది. మొహంలో కాంతీ తగ్గింది. అప్పటికీ ఇప్పటికీ పోలికే లేదు! పైగా ఆ కళ్లజోడొకటి! ఫ్రెంచి ఫిలాసఫర్ లాగ!

కాలం మనిషిలో ఎంతటి మార్పుని తెస్తుంది!

ఎదురుగుండా అద్దంలో తన ప్రతిరూపం కనపడుతోంది....

తను మాత్రం పూర్వానికి మల్లేనే వుందా? మార్పు రాలేదూ?–

ఆ కళ్లలో పూర్వపు కాంతి ఉందా? తుమ్మెద రెక్కలకి మల్లే నల్లగా నిగనిగలాడే తన జుట్టు మధ్య మధ్యలో నెరిసిపోలేదూ? తన వొంటి మిస మిస, చెక్కిళ్ల నునుపుదనం, పెదాల ఎరుపుదనం, ఇంకా అలానే ఉన్నాయా? కాలం – తనలో కూడా మార్పులు తీసుకురాలేదూ?...

విశాఖ సముద్రతీరంలో –రాఘవ తన కెదురుగా ప్రేమ పూజారికి మల్లే నిలబడి– తన అందచందాల్ని కావ్య పరిభాషలో పొగుడుతూంటే – తనెంతగా మురిసిపోయేదని!

ఇప్పుడు కనుక – రాఘవ తనని చూస్తే – బావురుమని పోదూ?...

దివ్య అద్దం ముందు నిలబడి – బొట్టు సరి చేసుకొంటోంది. మధ్య మధ్యలో పమిట సరి చేసుకొంటోంది. యవ్వన ప్రాంగణంలోకి నూతనంగా ప్రవేశించిన హుషారు ఆ సవరింపులో కనపడుతోంది.

"కాలేజీకి టైమయిపోతోంది. వెళ్లొస్తానమ్మా –" పుస్తకాలు చేతిలోకి తీసుకొంటూ అంది.

"సరేనమ్మా–"

★ ★ ★ ★

కదిపిన తేనె పట్టులోని తేనె టీగలకి మల్లే ఏవేవో జ్ఞాపకాలు...

తనూ రాఘవా సముద్ర తీరంలో కూచుని – చెప్పుకున్న మాటలూ, చేసుకొన్న బాసలూ, అన్నీ ఒకొటొకటిగా గుర్తుకొస్తున్నాయి....

తనని కలుసుకోలేక పోతే రాఘవ పిచ్చెక్కి పోయేవాడు! అతణ్ని చూడకపోతే తను వెఱ్ఱెక్కి పోయేది! తను అతనితో కలిసి అక్కడా, ఇక్కడా, మరో చోటా, కనిపించడంతో – కాకుల్లాటి లోకులకి కావలసినంత మేత దొరికింది. తమ ప్రేమ వ్యవహారం గురించి ప్రతి ఒక్కరూ చెప్పుకోవడం మొదలు పెట్టేరు. తమ పేర్లు గోడల మీద కెక్కనే ఎక్కాయి! కాలేజీలో ప్రతి ఒక్క స్టూడెంట్‌కీ తమతో మాటాడాలని కుతూహలమే! లెక్చరర్స్‌కి మరీను! స్టూడెంట్స్‌ని పిలిచి మరీ తమ ప్రేమ వ్యవహారం గురించి భోగట్టా చేసేవారు

ఆ సమయంలో తనూ, రాఘవా, ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్న మనుషులకి మల్లే ప్రవర్తించారు! జరుగుతున్నదేమిటో, జరగబోయేదేమిటో, అంతుపట్టని స్థితి అది.

కొనకొక నిర్ణయాని కొచ్చారు. ఎలాగైనా పెళ్లి చేసుకోవాలని.

కానీ – ఎలా? ఏ విధంగా?? లాంటి ప్రశ్నలకి మాత్రం సులభంగా జవాబులు దొరికేవి కావు!

తమ వివాహం విషయం – తమ తల్లిదండ్రులతో – ధైర్యంగా ప్రస్తావించాలనుకొన్నారు. రాఘవ – ఎలాగైతేనేం – తన తల్లిదండ్రులని – తమ వివాహానికి – వొప్పించగలిగాడు. తనూ – తన తల్లిని వొప్పించగలిగింది. కానీ తండ్రి దగ్గరికొచ్చే సరికి మాత్రం అడ్డకట్ట పడింది! తనొక పేరు మోసిన లాయర్. తన క్కాబోయే అల్లుడు తన అంతస్తుకి తగ్గ వాడై వుండాలి. అంతే కానీ – ఒక ఎలిమెంటరీ స్కూల్ టీచర్ కొడుక్కి తన కూతుర్నిచ్చి పెళ్లి చేస్తాడా? నో! నెవ్వర్!! తన కంఠంలో ప్రాణం ఉండగా అది జరిగేది కాదని చెప్పేవాడు.

వార్ ఫుటింగ్ మీద తన హోదాకి తగ్గ సంబంధాల కోసం గాలించడం మొదలు పెట్టాడు.

తన తండ్రొక రాక్షసుడు! అనుకొన్నంత పనీ చేస్తాడు. తన నెవరికో ఇచ్చి కట్ట బెడతాడు. అదే కనుక జరిగితే – తను బతగ్గలదా? పోనీ – రాఘవని కలుసుకొందాం అంతే – ఇంటి నుంచి బయటికి వెళ్లడానికి వీల్లేకుండా కట్టడి చేశాడు. రాఘవ తన ఇంటి దరిదాపుల్లోకి రాకుండా రౌడీల్ని కాపలా పెట్టేడు. పెళ్లి గురించి మాటాడ్డాని కొచ్చిన రాఘవ తండ్రిని ఇన్సల్ట్ చేసి పంపించాడు.

తన గతేం కాను? తమ ప్రేమ కథా... అన్ని ప్రేమ కథలకి మల్లే విషాదాంతం కావలసిందేనా??

రాఘవేమయినట్టు? అతణ్ని గురించిన సమాచారమే తెలియటం లేదు.

మరికొద్ది రోజులకే పెళ్లి సంబంధం కుదుర్చుకొచ్చాడు – తండ్రి.

తనకాపెళ్లొద్దని ఎంత మొరపెట్టుకొన్నా లాభం

లేకపోయింది.

ఒక దుర్ముహూర్తాన్ని – ఒక ఇంజనీరు చేత తన మెడలో తాళి కట్టించేశాడు.

పెళ్ళాం అనే దాని కోసం అవురావురని పోయిన ఆ రెండో పెళ్ళాయన – ఇలా పెళ్ళవటంతోనే అలా తనని తీసుకుపోయాడు.

ఆ మానవుడితో పదేళ్ళ పాటు నిర్వికారంగా నిర్లిప్తంగా కాపురం చేసింది.

దివ్య పుట్టాక– తన జీవితాని కొక ధ్యేయం ఏర్పడుతున్న సమయంలో – తన భర్త ఒక రోడ్డు ప్రమాదంలో మరణించాడు. అప్పట్నించీ తనే తల్లీ తండ్రి అయి దివ్యని పెంచి పెద్ద చేసింది.

తన జీవితంలో వచ్చిన ఒడిదుడుకుల్ని దృష్టిలో పెట్టుకొని– దివ్య జీవితాన్ని తీర్చి దిద్దటానికి ప్రయత్నం చేస్తోంది.

మరి రాఘవ సంగతి?

అతను గుర్తొచ్చినప్పుడల్లా గుండె తరుక్కుపోతూ ఉంటుంది!

అతనేమయి పోయాడో?... ఎక్కడున్నాడో?... ఏం చేస్తున్నాడో?... తన మూలంగా అతని జీవితం నాశనం అయిపోయిందో... ఏమిటో ...

రాఘవని గురించిన ఆలోచనలతో మనస్సు వికలం అయిపోతూంటుంది!

మళ్ళీ ఇన్నాళ్ళకు కనబడ్డాడు!

క్షేమంగా ఉన్నాడు!

అంతే చాలు!

"దివ్య ఉందాండీ?"

"ఎవరూ?"

"నేనండి– సునీల్‌ని" లోపలికి ప్రవేశిస్తూ అన్నాడు.

సునీల్ ఎమ్. బి. బి. యస్. ఫైనలియర్ చదువుతున్నాడు. పక్కింట్లో గది అద్దెకు తీసుకుని ఉంటున్నాడు.

"కాలేజీకి వెళ్ళింది నాయనా..."

"సరేనండి. మళ్ళీ వస్తాను."

వెళ్ళి పోతున్నాడతను.

"ఏదైనా చెప్పమంటావా సునీల్?"

"అబ్బే– ఏం లేదండి. సాయంత్రం వస్తానని చెప్పండి" వెనక్కి తిరిగి చెప్పాడు.

"సరే నాయనా."

మెట్లు దిగి కాలి దారమ్మటే గేటు వేపుకి నడుస్తున్నాడు. అతని మాటలో, నడకలో, ప్రవర్తనలో, ఒక విధమైన హుందాతనం కనిపిస్తూంటుంది. దివ్యకి తగ్గ ఈడు జోడూ– అనుకొంది రమ్య.

* * * * * *

గేటు దగ్గిర నిలబడి "రాఘవా" అని పిలిచింది.

రాఘవ తనకేసి చూశాడు. కంగారెత్తి పోయాడు!!

రమ్యేనా?! తనని పిలుస్తున్నది రమ్యేనా?! ఎదురుగా నిల్చుని తనని లోపలికి రమ్మనమని పిలుస్తున్నది– తన రమ్యేనా?!!!

అందరి కళ్ళ లాంటి కళ్ళు కావు రాఘవవి. అవి మాటాడతాయి! వాటి విషయం తనకి బాగా తెలుసు.

సడన్ బ్రేక్ చేసి– దిగటంతో – కిందకి పడినంత పని చేశాడు!

"లోపలికిరా రాఘవా...." అంది తను – నవ్వుతూ.

"ఈ ఇల్లు?!...." సంభాషణ ఎలా మొదలు పెట్టాలో తెలియక తికమక పడుతున్నాడు.

"ఈ ఇల్లు మాదే– నీ కోసమనే ఇక్కడ నుంచున్నాను. లోపలికి రా...." అంది తను. ఆశ్చర్యానందాల్లో మునిగి తేలిపోతున్నాడు! ఏదొచ్చినా పట్టలేడు! అతని మనస్తత్వం తనకి బాగా తెలుసు.

సన్నటి దారమ్మట చెట్ల మధ్య లోంచి నడిచి వస్తూంటే– తన వైపే ఆరాధనగా చూస్తున్నాడు. ఏవిటేవిటో మాట్లాడు దామను కొంటున్నాడు కానీ– అంతలోనే ఆగి పోతున్నాడు.

రాఘవని సోఫాలో కూచోబెట్టింది. టిఫినూ కాఫీ ఇచ్చింది.

ఆ తర్వాత అతని కెదురుగా వున్న సోఫాలో కూచుంటూ "బాగున్నావా రాఘవా?" అంది.

రాఘవ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

కొంచ్మ సేపయాక "ఇదిగో ఇలా వున్నాను" అన్నాడు.

చేవేసినట్టయి పోయింది తన మనస్సు! కళ్ళ లోంచి నీళ్ళు కారుతున్నాయి.

మళ్ళీ అతనే అడిగాడు "నువ్వెలాగున్నావ్?"

గుండె గొంతుకలో కొట్టాడినట్టని పించింది. తనేమని చెబుతుంది? బాగున్నానని చెబుతుందా? బాగా లేదని చెబుతుందా?...

"ఏదో – ఫర్వాలేదు" అంది ఆఖరికి.

రాఘవ తన ముఖం కేసే చూస్తున్నాడు.

అతని కళ్ళల్లో ఏదో ఆవేదన!

"నీ భర్త?..." ఏదో అడగబోయి అంతలోనె ఆగిపోయాడు.

"ఆయన పోయారు. దివ్యా – నేనూ – మిగిలాం" గద్గద స్వరంలో అంది.

"దివ్య అంటే మీ అమ్మాయేనా?"

"అవును. మీ కాలేజీలోనే బి. ఏ. సెకండియర్ చదువుతోంది. అదే నీ గురించి చెప్పింది."

"అలాగా?""

ఆ తర్వాత – ఎంత సేపు మాటాడుకొన్నారో తెలియదు!

దివ్య తన ఫ్రెండ్సుతో పిక్చర్‌కి వెళ్ళింది. కనుక – ఎవరి ఆటంకమూ లేదు.

తను అతను చెబుతున్నది వింటోంది....

అతను తను చెబుతున్నది వింటున్నాడు...

తమ వీధి కొసలో నున్న ఇంట్లో ఉంటున్నాట్ట.

తన నెలాగయినా కలుసుకొందామని ప్రయత్నించి – రౌడీల చేత తన్నులు తిన్నాట్ట. తనకి పెళ్ళయిన చాలా కాలం దాకా – తనెక్కడయినా కనబడుతుందేమోనన్న వెఱ్ఱి ఆశతో – దేశదిమ్మరికి మల్లే వూరూరా తిరిగాట్ట. రాను రాను ఒక వేదాంత ధోరణి లాంటిది అలవడటంతో – మామూలు మనిషయ్యాట్ట. ఎమ్. ఏ. పాసయి – లెక్చరర్‌గా జీవితంలో స్థిరపడినప్పటికీ – మనసుకి తగిలిన గాయం ఇంకా రగులుతూనే ఉండటంతో – వివాహం మాత్రం చేసుకోలేదట. వొంటరివాడిగానే మిగిలిపోయాట్ట.

ఒకరి బాధలు మరొకరికి చెప్పుకోవటంతో –



మనసులు తేలికైపద్దాయి!

తనని కలుసుకోవడం మూలంగా రాఘవ ఎంతగా ఆనందించాడో – అతని ముఖం చూస్తేనే తెలుస్తోంది

రామవ వెళ్ళేప్పటికి తొమ్మిది గంటలవుతోంది

★ ★ ★ ★

దివ్య ఏ రోజూ కూడా రాఘవ గురించి చెప్పకుండా ఉండదు! డ్రామా ఆయన చెప్పినట్టుగా మరెవరూ చెప్పలేరట!

'రోమియో అండ్ జూలియట్'' నాటకంలోని పాత్రల గురించి, వాటి మనస్తత్వాల గురించీ, విడి చేసే విన్యాసాల గురించీ వివరించి చెబుతూ ఆయన చేసే కామెంట్స్‌ని విని తీరాలట! రోమియో జూలియట్‌లు కలుసుకొన్న దృశ్యాల్ని వివరిస్తున్నప్పుడు ప్రేమికుల హృదయాలకి ఆయన అద్దం పట్టేరా అన్నట్టుంటుందిట! 'వాట్ ఈజ్ ఇన్ ఎ నేమ్ అనే పాసేజీని ఆయన వివరించి చెప్పిన తీరు నిజంగా అద్భుతంట! షేక్స్‌పియర్ మహాకవి గొప్పతనం గురించీ ఆయన నాటకాల ప్రాశస్త్యాన్ని గురించి చెబుతూంటే – రాఘవ గారెంతటి గొప్ప పండితుడు! అనిపిస్తుందిట స్టూడెంట్స్ ఎవళ్ళ క్లాసయినా ఎగొట్టుకొంటారు గానీ ఆయన క్లాసు మాత్రం పోగొట్టుకోరట! అందరి స్టూడెంట్స్‌కీ ఆయన ఫేవరిట్ లెక్చరరయిపోయాట్ట!

రామవని గురించిన స్తోత్రాలు వినటానికి తనకీ ఆనందంగానే వుంది గానీ – అతణ్ణి గురించి దివ్య దృక్పథం ముందు ముందెలా మారుతుందో నన్నదే – రమ్య బయం

దివ్య తన బర్త్‌డే పార్టీకి రామవని ఆహ్వానించింది!

తన ఆహ్వానాన్ని మన్నించి రాఘవ వచ్చినందుకు – ఉబ్బి తబ్బిబ్బయిపోయింది! దివ్య రాఘవని తన దగ్గరికి తీసుకొచ్చి పరిచయం చేస్తున్నప్పుడూ – రాఘవ ఒక కొత్త వ్యక్తిని కలుసుకొంటున్నట్టుగా చేతులు జోడించి నమస్కారమండీ అంటున్నప్పుడూ – రమ్య కొద్దిగా కంగారు పడకపోలేదు

అయినా తన కంగారుని కనబడనీయకండా నమస్కారమండీ – మా దివ్య ఎప్పుడూ మీగురించే చెబుతూంటుంది అంది

ఆ తర్వాత దివ్య రాఘవకి - సునీల్‌ని తన ఫ్రెండ్‌గా పరిచయం చేసింది

రామవ సునీల్ కేసి ఆప్యాయతగా చూశాడు

ఆ రోజు పార్టీలో రామవ దివ్యకి బర్త్‌డే గ్రీటింగ్స్ తెలుపుతూ– చక్కని ఉపన్యాసాన్నిచ్చాడు

పూర్వపు హుషారును రాఘవలో తిరిగి చూడగలిగింది– రమ్య

మొత్తానికారోజు చాలా ఆనందంగా గడిచి పోయింది!

మరో రెండు రోజులకి – సునీల్ తల్లి దండ్రు లొచ్చారు

దివ్య చాలా తెలివైనది!

ఆమె సునీల్‌తో స్నేహం చేస్తోంది ఎందుకంటే – అతను యోగ్యుడూ, మంచివాడూ, కనుక

స్నేహం చేస్తోందని చెప్పి – అతనికి మరీ చనువివ్వదు ఎందుకంటే – అలా చెయ్యడం తనకే ముప్పు కనుక

సునీల్‌తో పెళ్ళి ముందు– ప్రేమ తర్వాత– అని స్పష్టంగా చెప్పేసింది ఎందుకంటే –

జారుడు మెట్ల మీద నడవటం ఆడదానికి క్షేమం కాదు కనుక

సునీల్‌కి కూడా దివ్య చెప్పింది సబబుగానే అనిపించింది

అందుకే – తన తల్లిదండ్రుల్ని రప్పించాడు దివ్యతో తన వివాహానికి వారిని వొప్పించాడు!

వాళ్ళకి దివ్య నచ్చింది!

అందుకే – వాళ్ళే రమ్యని అభ్యర్థించేరు – ఆమె కభ్యంతరం లేకపోతే–

దివ్యని తమ కోడలిగా చేసుకొంటామని

సంతోషంగా వొప్పుకొంది –రమ్య

తొందర్లోనే ముహూర్తం నిర్ణయించి కబురు పెడతామన్నారు

వాళ్ళు వెళ్ళాక అనుకొంది 'దివ్య ఎంత అదృష్ట వంతురాలు!' అని

రాఘవని కాలవగట్టు దగ్గిర కలిసినప్పుడు – దివ్య పెళ్ళి గురించి చెప్పింది

రామవ ఎంతగానో ఆనందించాడు!

'పెళ్ళికి నేనేం చెయ్యాలో చెప్పు' అన్నాడు

నువ్వేం చెయ్యనక్కర్లేదు పెళ్ళికొస్తే చాలు అంది నవ్వుతూ

'మరి – పెళ్ళికి నన్ను పిలుస్తారా?' చిన్న పిల్లాడికి మల్లే అడిగాడు అమాయకంగా

'నీ శిష్యురాలు నీకు వెడ్డింగ్ కార్డ్ ఇవ్వకుండా ఉంటుందా? – కొంటిగా అంది– తను

★ ★ ★ ★ ★

నేనొకటడుగుతాను నిజం చెప్తావా?

నేర విచారణ చేసే పోలీసు ఆఫీసర్ మల్లే అడిగింది దివ్య

'దేన్ని గురించి?! కంగారు పడుతూ అడిగింది రమ్య

నువ్వూ – రాఘవగారూ – తరుచు కలుసు కొంటున్నారా?'

క్రాస్ ఎగ్జామిన్ చేసే లాయర్‌కి మల్లే అడిగింది

దీనికి నేను భయపడటం ఏమిటన్నట్టుగా "కలుసుకొంటున్నాం ఏమంటావ్?" అనడిగింది

"నీకు – రాఘవగారు – ఇంతకు ముందు నుంచే తెలుసా?" మళ్ళీ ప్రశ్న వేసింది

దివ్య అడుగుతూన్న పద్ధతి తనకి చాలా చికాకనిపించింది.

నువ్వు బుఱ్ఱ పాడు చేసుకోనంటే చెబుతాను ఆయన నాకెప్పటి నుండో తెలుసు'

మొండిగానే చెప్పింది

ఆయనతో నీ కెప్పటి నుంచి పరిచయమో తెలుసుకోవచ్చా?" బోనులో నిలుచున్న నేరస్థుణ్ణి అడిగినట్టు అడిగింది

తనూ కుండ బద్దలు కొట్టినట్టు చెప్పింది సమాధానం మేమిద్దరం కాలేజీలో చదువు



కొంటున్న రోజుల్లో ప్రేమికులం. పెళ్ళి చేసుకోందామనుకొన్నాం కూడా. కానీ విధి మాతో ఆటలాడటంతో విడిపోయాం. తిరిగీ మా అదృష్టం కొద్దీ ఇక్కడ కలుసుకొన్నాం".

తన తెగింపు చూసి దివ్య అదిరి పడింది! అయినా బింకంగా "ఆ కథేమిటో నేను తెలుసుకోవచ్చా? అంది.

"నిరభ్యంతరం తెలుసుకోవచ్చు. ఎప్పుడో ఒకప్పుడు నీకు చెప్పక తప్పదు కాబట్టి చెబుతున్నాను." అంటూ తన కథంతా పూసగుచ్చినట్టు చెప్పింది.

అంతా విన్నాక దివ్య అంది "అమ్మా- నేన్నీ కూతుర్నమ్మా – నీ మూలంగా నా పెళ్ళి ఆగిపోవటం నీకిష్టమా?"

"నీ పెళ్ళి నా మూలంగా ఎందుకాగుతుందమ్మా?" ఉక్రోషంగా అడిగింది తను.

దివ్య కళ్ళల్లో నీళ్ళు పెట్టుకొంది! తన మనస్సు కలచి వేసినట్లయి పోయింది!

"ఎందుకమ్మా – ఏడుస్తున్నావ్?!" అంది దివ్య తల నిమురుతూ.

"అమ్మా – కొంచెం ఆలోచించు. కొద్ది రోజుల్లో నా పెళ్ళి జరగబోతోంది.

అలాంటపుడు నువ్వీవిధంగా ప్రవర్తిస్తే నా పెళ్ళి ఆగిపోదా?–" న్యాయం కోసం అడుగుతున్నట్టుగా అడిగింది.

"నేనేం తప్పుగా ప్రవర్తించ లేదే?" బోనులో నిలబడ్డ ముద్దాయికి మల్లే ఫీలవుతూ అంది తను.

"నువ్వు తప్పు చెయ్యకపోవచ్చు. కానీ ఆయనతో కలిసి నువ్వు కనబడుతూంటే చూసిన వాళ్ళేమనుకొంటారు! ఈవిషయం సునీల్‌కి తెలిస్తే నన్నుపెళ్ళి చేసుకొంటాడా?– అనుకొన్న పెళ్ళి ఆగిపోతే మళ్ళీ ఆడపిల్లకి పెళ్ళవుతుందా? నువ్వే చెప్పు." ఇంకా నువ్వు చేస్తున్న తప్పు నీకర్థం గావటం లేదా- అన్నట్టడిగింది.

"నీ పెళ్ళి జరగడం కంటే నాకింకేం కావాలి తల్లీ – నన్నేం చెయ్యమన్నావో చెప్పు".

నేరం వొప్పుకొంటున్న దోషికి మల్లే అంది.

అవకాశం జారవిడుచుకొనే వ్యక్తి కాదు – దివ్య.

తన తల్లి చేతిని తన తల మీద పెట్టుకొని "నా మీద ప్రమాణం చేసి చెప్పమ్మా." అంది.

"ఏమిటమ్మా?! ఏమిటంటున్నావ్?!" కలవర పడుతూ అడిగింది – తను.

"అవునమ్మా- నువ్వే కనుక నీ కూతురి క్షేమం కోరుకొన్న దానివయితే – నా మీద ప్రమాణం చేసి చెప్పు. రాఘవ గారినింకెప్పుడూ కలుసుకోననీ, మాట్లాడననీ, ఆయనతో ఏవిధమైన సంబంధమూ పెట్టుకోనని". అర్థిస్తున్నట్టుగా అడిగింది – దివ్య.

తనూ రాఘవా చాలా కాలం తర్వాత కలుసుకొన్నారు. అతనిప్పుడిప్పుడే మానసిక వ్యథనుంచి కోలుకొంటున్నాడు. దివ్య చెప్పినట్టుగా ప్రమాణం చేస్తే – రాఘవ గతేం కాను? మరో మారు తనకి దూరమైన పక్షంలో అతను బతకగలడా??– అలా అని – అతనితో డిదే లోకమని తను అనుకొంటే – తన కూతురి పెళ్ళి ఆగిపోవటం ఖాయం. తన స్వార్థం కోసం – తన కూతురి జీవితం బలిచేస్తుందా? నలుగురికీ తెలియక ముందే – రాఘవతో తెగతెంపులు చేసుకొంటే – కనీసం కూతురి భవిష్యత్తన్నా బావుంటుంది.

ఏం చెయ్యాలి – తను?

దివ్య తనకేసే ఆతృతగా చూస్తోంది.....

కళ్ళల్లోంచి నీరు కారుతూంటే – దివ్యని దగ్గరకి తీసుకొని వాత్సల్య పూరిత స్వరంతో అంది : "అమ్మా – దివ్యా! నీ మీద ప్రమాణం చేసి చెబుతున్నాను. ఈ క్షణం నుంచీ రాఘవతో – నాకే విధమైన సంబంధమూ ఉండబోదు. అతన్నెప్పుడూ కలుసుకోను. అతనితో మాటాడను. సరేనా?"–

"మా అమ్మ మనసు వెన్న!" అంటూ ఒక కాంప్లిమెంటిచ్చింది దివ్య. పనిలో పనిగా ఒక ముద్దు కూడా పెట్టుకొంది!

తను రాఘవ గురించే ఆలోచిస్తోంది....

చాలాకాలం తర్వాత దగ్గరయిన తను – మళ్ళీ దూరమయిందని తెలుసుకొన్న రోజున – రాఘవ ఎంతగా కుమిలి పోతాడు?

కిటికీ లోంచి బయటకు చూస్తోంది....

వర్షం కురిసి వెలిసి వుండాలి.

రోడ్డంతా వాన నీటితో నిండి పోయింది!

పిల్లలు నీళ్ళలో కాగితం పడవలు వదులుతున్నారు. □




బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

## బాల నేరస్థులపై విచారణ ఆరు మాసాల్లో పూర్తి అవ్వాలి

పదహారు సంవత్సరాల లోపు వయస్సు వున్న బాల నేరస్తులను అందరిని జైళ్ళ నుంచి విడిచి పెట్టాలని షీలాబార్సీ అను సంఘ సేవకురాలు సుప్రీమ్ కోర్టుకు రిట్ పిటిషన్ పెట్టుకున్నది. జైళ్ళలో ఎంత మంది నేరస్తులు ఉన్నారో వివరాల కోసం ఆమె పిటిషన్ పెట్టింది. సుప్రీమ్ కోర్టు వారు భారత ప్రభుత్వానికి అన్ని రాష్ట్రాలకు నోటీసులు పంపారు. అన్ని రాష్ట్రాలలోని జిల్లా జడ్జీలకు కూడా జైళ్ళను తనిఖీ చేసి ఎంత మంది బాల నేరస్తులు ఉన్నారో, వారు చేసిన నేరాలు పరిశీలించి వారికి తగు న్యాయ సహాయం కలిగించినది, లేనిది వివరాలు తెలియ పర్చమని సుప్రీమ్ కోర్టు వారు 1986 సంవత్సరం ఏప్రిల్ 15వ తేదీన వుత్తర్వులు జారీ చేశారు. ఆగస్టు నెలలో జైళ్ళలో వుంచ వలసి వస్తున్నదని రాష్ట్రాల వాదనను సుప్రీమ్ కోర్టు వారు అంగీకరించ లేదు. బాల నేరస్తులను రిమాండ్ గృహాలు లేదా అబ్జర్వేషన్ గృహాలలో మాత్రమే వుంచాలని అవి చాలినన్ని లేనపుడు బాల నేరస్తులను బెయిలుపై విడిచి పెట్టాలని సుప్రీమ్ కోర్టు వారు ఆదేశాలను జారీ చేశారు. బాల నేరస్తుల కొరకు ప్రత్యేకమైన జువనైల్ (బాలల) కోర్టులు ఏర్పాటు చేసి ఆ కోర్టులలో ఈ విధమైన కేసులలో శిక్షణ పొందిన వారిని మాత్రమే మేజిస్ట్రేట్‌లుగా నియమించాలని సుప్రీమ్ కోర్టు వారు ఆదేశాలు జారీ చేశారు. 16 సంవత్సరాల లోపల వయస్సు ఉన్న బాలలపై కంప్లయింటు ఇచ్చినట్లయితే ఆ నేరం ప్రకారం ఏడు సంవత్సరాలు దాటకుండా కారాగార శిక్ష విధించ వలసి వచ్చినప్పుడు మూడు మాసాలలో పరిశోధన పూర్తి చెయ్యాలి. లేనిచో ఆ కేసును ముగించి వెయ్యాలి. మూడు మాసాలలో ఛార్జిషీటు పెట్టి నట్లయితే ఈ కేసును ఆరు మాసాలలో విచారణ చేసి కేసు పరిష్కారం చెయ్యాలి. లేనట్లయితే ఆ కేసును కొట్టి వెయ్యాలని 1986 ఆగస్టు 13వ తేదీన సుప్రీమ్ కోర్టు వారు ఆదేశాలు జారీ చేశారు. □

సుప్రీమ్ కోర్టు వారు జిల్లా జడ్జీలు పంపిన రిపోర్టులు పరిశీలించారు. భారత రాజ్యాంగంలోని 39 (ఎఫ్) ఆర్టికల్ ప్రకారం రాష్ట్రాలు బాలల అభివృద్ధికి కృషి చేయాలని వారి రక్షణకు చర్య తీసుకోవాలని సుప్రీమ్ కోర్టు వారు పేర్కొన్నారు. బాలల చట్టం వున్నప్పటికి బాల నేరస్తులను జైళ్ళలో నిర్బంధిస్తున్నారు. చాలినన్ని రిమాండ్ గృహాలు లేకపోవడం వలన బాల నేరస్తులను




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**కె. శ్రీధర్ (వయస్సు 16) ఖమ్మం**

ప్ర : తలలో చుండ్రు ఉన్నది. జుట్టు రాలిపోతున్నది.

జ : తలకు సోపు వాడవద్దు, తల మీద వేడి నీటి స్నానము చేయవద్దు. బైద్యనాథ్ సురక్తా ద్రాంగ్ ఉదయం సాయంత్రం 2 చెంచాల మందు 2 చెంచాల నీరు కలిపి ఉదయం సాయంత్రం లోనికి వాడుతూ తల నూనెగా బైద్యనాథ్ మహాభృంగరాజ తేల్ వాడండి. వేడి చేసే వస్తువులు మానివేయండి.

**డి. వి. పార్థసారధి, అమలాపురం**

ప్ర : నాకు ఫ్రిజ్ వాటర్ తాగినప్పుడు ద్రాక్ష ఏవైన పుల్లటివి తీసుకొన్నప్పుడు తరచు జలుబు చేస్తూ ఉంటుంది. నివారణ.

జ : సాధ్యమైనంత వరకు పడని వస్తువులు తగ్గించాలి. పగలు భోజనం అవగానే నిద్రించవద్దు.

బైద్యనాథ్ సర్వదో షాంతకబటి 1 మాత్ర బైద్యనాథ్ సురక్తా ద్రాంగ్ 2 చెంచాలు మందు రెండు చెంచాలు నీటితో ఉదయం సాయంత్రం వాడండి. రాత్రి పడుకోపోయేటప్పుడు బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ పాలతో సేవించండి. అతి భోజనము, పులుపు, కారము, అజీర్ణకర పదార్థములు నిషేధము.

**తిరుమాని నాగమల్లేశ్వరరావు పొన్నపల్లి, నరసాపురం**

ప్ర : సుమారు 8 సం.ల నుండి అరిచేతులు, అరిపాదాలకు చెమట వస్తుంది. ఎండా కాలం ఎక్కువగా ఉంటుంది.

జ : బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో సేవిస్తూ బైద్యనాథ్ అశ్వగంధారిష్ట భోజనం తరువాత రోజు రెండు సార్లు 2 చెంచాలు మందు సమభాగము నీళ్ళతో రోజుకు రెండు సార్లు వాడండి. బైద్యనాథ్ మహాచందనాది తేల్ అరికాళ్ళకు, అరిచేతులకు మర్దన చేయండి, పాలకొల్లు పెద్ద గుడి ఎదురుగా, మారుటేరులోను మా ఔషధములు దొరుకును.

**నారాయణరెడ్డి, ఎన్. వి. పురం, అనంతరం**

ప్ర : 18-20 సంవత్సరముల మధ్య దురలవాటులచే శక్తి తగ్గినది. గత రెండేళ్ళుగా హస్త ప్రయోగం మానివేసినాను. నివారణ రాయండి.

బైద్యనాథ్ విటా-ఎక్స్ టాబ్లెటులు 2 చొప్పున బైద్యనాథ్ చ్యవనప్రాశ్ స్పెషల్‌తో ఉదయం సాయంత్రం పాలతో సేవించండి. భోజనం తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట 2 చెంచాలు మందు, సమభాగము నీటితో రోజు రెండు సార్లు లోనికి సేవించండి. పులుపు, కారము తగ్గించడం. సాధ్యమైనంత వరకు విశ్రాంతి అవుసరము.

**పక్కి సంజీవకుమార్, నెల్లూరు**

ప్ర. కుక్క కరిచింది. ఇంజక్షన్ తీసుకోవడమైనది.

జ. అక్కడ ఆయుర్వేద డాక్టరుగారిని సంప్రదించితే మంచిది. విడవకుండా బైద్యనాథ్ రక్తశోధక టాబలెట్ 1 చొప్పున బైద్యనాథ్ సురక్తా ద్రాంగ్ 2 చెంచాల మందు సమభాగము నీటితో ఉదయం సాయంత్రం రెండు సార్లు 2 నెలల వరకు లోనికి సేవించండి. మీరు వ్రాసిన వస్తువులు కొంత కాలము మానివేయండి.

**సుమలత (30 సం.లు) ఔరంగాబాద్**

ప్ర. మాసక్రమము సరిగా లేదు, కొంత కాలము నుండి నీరసము కడుపులో నొప్పి. ఏ విషయములోను నిస్పృహ.

జ. బైద్యనాథ్ లూకోనిల్ 1 మాత్ర, బైద్యనాథ్ విటా-ఎక్స్ 1 మాత్ర చొప్పున బైద్యనాథ్ సుందరీ కల్ప పోర్టు 3 చెంచాల మందు సమభాగము నీటితో ఉదయం సాయంత్రం రోజుకు రెండు సార్లు లోనికి సేవిస్తూ. మంచి బలమైన ఆహారం సేవించండి. విశ్రాంతి అవుసరము.

**రామలింగం, మంధసా**

ప్ర : ప్రతిరోజు కఫముతో గూడిన దగ్గు, ఆయాసం ఛాతీలో బరువుగా ఉండటం.

జ : బైద్యనాథ్ శ్వాసకల్ప టాబిలెటులు ఉదయం సాయంత్రం 1 మాత్ర చొప్పున బైద్యనాథ్ దశమూలారిష్టతో సేవించండి. తేలికయైన ఆహారము మంచిది. మలబద్ధకము ఉన్నచో బైద్యనాథ్ కబ్జ-హర చూర్ణం వాడండి. □

**కూపన్**

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాథ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న : ..........................................

..........................................

..........................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# క్రాంతి రెసిడెన్షియల్ కాలేజి స్థాపితం: 1985

## నాగార్జున నగర్, సిద్ధార్థ మెడికల్ కాలేజ ఎదుట విజయవాడ-8. ఫోన్: 84477

- గత మూడు సంవత్సరములలో మా మొదటి, రెండవ బ్యాచ్ విద్యార్థుల ఫలితములు
- 1985–1987 – 100% ప్రథమశ్రేణి
- 1986–1988 – 96% ఉత్తీర్ణులైరి
- కృష్ణా జిల్లాలో ద్వితీయ స్థానము, మా అనుబంద సంస్థ – జూనియర్ కాలేజి, ఈదుపుగల్లు విద్యార్థి, P నవీన్, MPC గ్రూప్‌లో 905 మార్కులు సాధించాడని తెలియజేస్తున్నాము ఇతర కాలేజీలలో మొదటి సంవత్సరం ఇంటర్ చదివిన విద్యార్థులు కూడా పరిమిత సంఖ్యలో చేర్చుకొనబడుదురు
- 1988–89 విద్యా సంవత్సరమునకు ఇంటర్మీడియెట్ మొదటి సంవత్సరం MPC BiPC CEC MEC గ్రూపులకు ఇంగ్లీష్, తెలుగు మీడియంలలో అడ్మిషన్లు జరుగుచున్నవి. అప్లికేషనులు రూ 10/-లు స్వయముగా లేదా MO చేసి పొందండి
- క్లాసులు ప్రారంభం రెండవ సంవత్సరం ఇంటర్ విద్యార్థులకు 5-6-88 నుండి మొదటి సంవత్సరం ఇంటర్ విద్యార్థులకు 25-6-88 నుండి
- నగర రణగొణ ధ్వనులకు దూరంగా, ప్రశాంత వాతావరణంలో, నూతన బవన సముదాయంలో, చక్కటి వసతి ఏర్పాటు చేయడమైనది రుచికరమైన బోజనము, అనుభవజ్ఞులైన అధ్యాపకులచే శిక్షణ అన్ని సౌకర్యములు కలలాబ్ మా ప్రత్యేకతలు

డైరెక్టర్




క్రాంతి విద్యానగర్‌లో ప్రస్తుతము తరగతులు జరుగుచున్న భవన సముదాయము

EXPRESS

# క్రాంతి మహిళా రెసిడెన్షియల్ కాలేజి స్థాపితం 1987

## నాగార్జున నగర్, సిద్ధార్థ మెడికల్ కాలేజ ఎదుట, విజయవాడ-8, ఫోన్: 84477

- 1988–89 విద్యా సంవత్సరమునకు ఇంటర్ మొదటి సంవత్సరం MPC BiPC CEC గ్రూపులకు ఇంగ్లీషు, తెలుగు మీడియంలలో అడ్మిషన్లు జరుగుచున్నవి అప్లికేషన్లు రూ 10/-లు స్వయముగా చెల్లించి లేదా MO చేసి పొందగలరు
- ఇతర కాలేజిలలో మొదటి సం ఇంటర్ చదివిన విద్యార్థినులు కూడా చేర్చుకొనబడుదురు
- క్లాసులు ప్రారంభం రెండవ సంవత్సరం ఇంటర్ విద్యార్థినులకు 9-6-88 నుండి మొదటి సంవత్సరం ఇంటర్ విద్యార్థినులకు 25-6-88 నుండి
- నగర రణగొణ ధ్వనులకు దూరంగా ప్రశాంత వాతావరణంలో అధునాతనమైన బవంతులతో, పూర్తి రక్షణతో కూడిన కట్టుదిట్టమైన ఏర్పాటులతో మహిళలకు వసతి ఏర్పాటు చేయడమైనది

ప్రిన్సిపాల్ M సోమేశ్వరరావు, MSC

Retired Principal of S R R & C V R Govt College, VIJAYAWADA
,Ex Incharge Secretary, Board of Intermediate Education, A P , HYDERABAD




(గత సంచిక తరువాయి)

"ఏక్స్యూజ్‌మీ ..... కొంచెం అగ్గిపెట్టి యిస్తారా.....?"

అన్న యిన్‌స్పెక్టర్ మాటకు తలెత్తిన లెడ్జర్ కీపర్ లలిత్ కుమార్ అతనికి అగ్గి పెట్టి అందించి లెడ్జర్ పేజ్ టోటలింగ్‌లో మునిగిపోయాడు.

"క్యా..... భాయిజీ..... కైసే హై......"

అన్న సర్దార్‌జీని చూసి పలకరింపుగా నవ్వాడు క్యాష్ కౌంటర్‌లోని అయ్యప్ప దీక్షాధారి పరమశివం.

బ్రీఫ్‌కేస్ రహస్యంగా తెరిచిన మేనేజర్ రెండు చేతులూ జోడించాడు.

"శ్రీ అంజనేయం.... ప్రసన్నాంజనేయం.... ప్రభాదివ్యకాయం.... ప్రకీర్తి ప్రదాయం...." గొణుగుతున్నట్టుగా తనలో తనే కళ్ళు మూసుకుని అనుకుంటున్నాడు. గడియారం వేపు చూసాడు. పన్నెండు గంటల యాభై

**జరిగిన కథ– 5:** హోటల్ బ్లూనైల్‌లో రాకా దేదీప్యకు విచిత్రంగా పరిచయ మవుతాడు. దీన్‌దయాళ్‌కు రాకా నుంచి చంపుతానని బెదిరిస్తూ ఉత్తరం వస్తుంది. మృత్యువు ఏ రూపంలో రాబోతోందో దీనదయాళ్ ఊహ కందదు. ఆయన డ్రైవ్ చేస్తున్న కారుకి యాక్సిడెంట్ అయి మరణిస్తాడు. రాకా తాను బ్యాంకు దోపిడి చేయబోతున్నట్టు పోలీస్ కమీషనర్‌కి వార్నింగ్ ఇస్తాడు. ఆ సంగతి పోలీస్ కమీషనర్ తన తల్లికి చెప్తుండగా వింటుంది దేదీప్య. దేదీప్యను దుండగుల బారి నుండి ఒక యువకుడు రక్షిస్తాడు. అతను రాకా. రాకా ఆ రోజు బ్యాంక్‌దోపిడి చేస్తాడని పోలీసు డిపార్టుమెంట్ అంతా అప్రమత్తంగావుంది.

నాలుగునిముషాలైంది. బ్రీఫ్‌కేస్‌లో ఎదురుగా వున్న వీరాంజనేయ స్వామి ఫొటో మీదే మనసంతా లగ్నం చేసాడు.

"స్వామీ..... డబ్బుకోసం సిద్ధాంతాలతో రాజీపడ్డ కమ్యూనిస్టుని కదస్వామీ.... అందుకే నిన్ను బహిరంగంగా అందరి ముందు పూజించలేక పోతున్నాను. ఈ విషయంలో నన్ను క్షమించేసి రాకా బారిన పడకుండా కాపాడుస్వామీ....."

ఒణుకుతున్న కంఠంతో ప్రార్థించాడు.

బ్రీఫ్‌కేస్ మూసేసి గ్లాస్ ప్యానెల్లోంచి చూసాడు. లలిత్‌కుమార్, మరో యిద్దరు క్లర్కులూ తలొంచుకుని పని చేసుకుంటున్నారు. కానిస్టేబుల్స్ పోలీస్ స్టేషన్ 'లాకప్స్'లో ఖైదీలతో తమ వీరోచిత కథల గురించి చెప్తుంటే శ్రద్ధగా వింటున్నాడు మెసెంజర్ కృష్ణ.

క్యాషియర్ పరమశివం ఎవరో సర్దార్‌జీ కస్టమర్‌తో కౌంటర్‌లో బిజీగా వున్నాడు. తృప్తిగా వూపిరి పీల్చుకుని కుర్చీలో వెనక్కి వాలాడు మేనేజర్ సదానందం.

అంతలో –

టేబుల్ మీది ఫోన్ మోగింది.

కంగారుగా రిసీవర్ ఎత్తి "హలో....." అన్నాడు.

"పరమశివం గారు కావాలి సార్...." భోరున ఏడ్చేస్తూ అడిగింది ఓ స్త్రీ కంఠం.

"పరమశివం..... నీకు ఫోన్ ... అర్జంట్.... " అని అరిచేసి "యింతకీ ఏమైందమ్మా.....?" ఆ స్త్రీన్ని అడిగాడు సదానందం.

"మా మామగారు..... మా మామగారూ......" అంటూ మళ్ళీ ఏడ్చేసింది.

"అయ్యొయ్యో ఎంతపని జరిగి పోయిందమ్మా....." అంటూ అప్పుడే క్యాబిన్‌లో కొచ్చిన పరమశివానికి ఫోన్ అందించాడు సదానందం.

"హలో ...... ఎవరూ.... ?" అన్నాడు పరమశివం.

"................"

"ఆఁ..... నాన్నగారికి సీరియస్‌గా వుందా.....? ఎంత సేపయింది టెలిగ్రాం వచ్చి......?" కళ్ళనీళ్ళ పర్యంతం అయాడు పరమశివం.

"...................."

"నో.... నో.... వీల్లేదు. వెంటనే బయల్దేరి రావడం కష్టం. యివాళ అసలే స్టాఫ్ తక్కువగా వున్నారు. సాయంత్రం ఐదింటి వరకూ కదలడానికి వీల్లేదు....."

"...................."

"మీనాక్షీ..... చెప్పేది అర్థం చేసుకోవేం....? మేనేజర్ గార్ని అడిగితే ఆయన మాత్రం ఏం చేస్తారు.....? క్యాష్‌లో వున్నది నేనొక్కణ్ణే."

తనను తాను కంట్రోల్ చేసుకొంటూ మేనేజర్ వేపు చూసాడు పరమశివం.

"ఫర్వాలేదులే వెళ్ళవయ్యా..... క్యాష్‌లో నేను కూర్చుంటానులే..... అభయమిచ్చాడు సదానందం.

"లేదుసార్.... యివాళేగా ఆ రాకాగాడు....."

మౌత్ పీస్ అరచేత్తో మూసి మేనేజర్‌తో అన్నాడు పరమశివం.

"వాడు పెట్టిన టైం అయిపోయిందిగా.... నువ్వెళ్ళు.... మేం చూసుకుంటాంలే..... " అంటూ గడియారం వేపు చూసాడు పన్నెండు గంటల యాభైఎనిమిది నిముషాలు.

"ఏమోసార్.... మీరింతగా చెప్తున్నారు గనక వెళ్తాను." అని "మీనాక్షీ నువ్వు రెడీగా వుండు వెంటనే బయల్దేరుతున్నాను. మేనేజర్ గారు పర్మిషనిచ్చారు......"

**హెత్రీ హోం ప్రొడక్ట్స్ ప్రై. లిమిటెడ్, సికింద్రాబాద్ సమర్పిస్తున్న స్పెషల్ సీరియల్**

అని చెప్పి ఫోన్ పెట్టేసిన పరమశివం

'థాంక్యూసార్ థాంక్యూ వెరీమచ్. కౌంటర్‌లో క్యాష్ " అంటున్న అతని మాటల్ని కట్ చేస్తూ అబ్బా. అవన్నీ నేను చూసుకుంటాను గానీ త్వరగా వెళ్ళవయ్యా అవతల మీ నాన్నగారికి సీరియస్‌గా వుంటే అన్నాడు సదానందం

థాంక్యూ వన్స్ ఎగెయిన్ సార్

అని క్యాబిన్‌లోంచి బయటికి పరుగెత్తాడు పరమశివం

అప్పుడే కౌంటర్లో పరమశివం యిచ్చిన ఎనిమిది లక్షల క్యాష్‌నీ బ్రీఫ్ కేస్‌లో ర్దుకుని బయటికి అడుగు పెట్టారు సర్దార్‌జీ

ఏమైంది సార్ అప్పుడే వెళ్ళిపోతున్నారు . ?"

రివాల్వర్ సర్దార్‌జీకి అందిస్తూ బయటికొస్తున్న పరమశివాన్ని అడిగాడ



యిన్స్పెక్టర్ ముంచుకొస్తున్న దుఃఖంతో విషయం చెప్పాడు పరమశివం

మీరిప్పుడెక్కడికెళ్ళాలి ? అడిగాడు సబ్‌యిన్స్పెక్టర్ రంగారావు

బోయిన్‌పల్లి చెప్పాడు పరమశివం

అచ్చా సర్దార్‌జీ ఈయన్ని కొంచెం బోయిన్‌పల్లిలో డ్రాప్ చేసి వెళ్ళకూడదూ పాపం వాళ్ళనాన్నగారు .

అన్న యిన్స్పెక్టర్ మాటలకి

అచ్చా అచ్చా చలో " అంటూ దూరంగా పార్క్ చేసి వున్న మిలిటరీ జీప్ వేపు నడిచాడు సర్దార్‌జీ తడబడుతున్న అడుగులతో అతన్ని అనుసరించాడు పరమశివం

సరిగ్గా అదే సమయంలో –

కౌంటర్‌లోకి వెళ్దామని లేవబోతున్న మేనేజర్ ఫోన్ రింగవడంతో

హలో అన్నాడు

నేనుసార్ మిసెస్ పరమ శివాన్ని చెప్పింది అవతలి కంఠం.

ఏమ్మా మీ ఆయన వెళ్ళిపోయాడుగా !"

అదికాదు సార్ ఏదో చెప్పబోయిందామె

చూడమ్మా కన్న తండ్రి కన్నా డ్యూటీ ముఖ్యంకాదు నువ్వు వెంటనే రెడీ అవు మరో పది నిముషాల్లో మీ ఆయన నీ ముందుంటాడు గుండె దిటవు చేసుకో కష్టాలు కలకాలం వుండవ్ '

ఓదార్పుగా అన్నాడు సదానందం

'మా ఆయన రావడం ఏవిటిసార్ ? ఆయనకి ఒంట్లో బాగలేదు అందుకే ఈ రోజు డ్యూటీకి రావడం లేదు అని చెప్పడానికే ఫోన్ చేసాను

అంటే యింతకుముందు మీ మామగారికి సీరియస్‌గా వుందని. '

ఛ మా మామగారికి సీరియస్‌గా వుండడమేంటి సార్ ఆయన పోయి ఎన్నిండేళ్ళవుతుంటే సరే సార్ వుంటాను నమస్తే "

ఫోన్ పెట్టేసిందామె

మేనేజర్ కళ్ళముందు ప్రపంచం తిరిగి పోతోంది

అంటే నల్లడ్రస్, గడ్డం అయ్యప్ప దీక్ష గెటప్‌లో వచ్చిన వాడు????'

ఆ వూహకే ఒణికి పోయాడు సదానందం

క్యాష్ కౌంటర్‌లోకి పరుగెత్తి స్టేట్‌మెంట్‌లో వున్న ఎమౌంట్‌నీ కౌంటర్లోని డబ్బునీ లెక్క చూసాడు

సరిగ్గా ఎనిమిది లక్షలు తేడా వచ్చింది

అంతే–

మేనేజర్ సదానందానికి స్పృహ తప్పింది

మరుక్షణం పోలీస్ వ్యాన్లూ, మోటార్ సైకిళ్ళూ తమ విధినిర్వహణలో రోడ్డెక్కాయి పరమశివం వేషంలో వున్న రాకాని, సర్దార్‌జీనీ పట్టుకోడానికి

*        *        *        *        *        *        *        *        *        *




సరిగ్గా ఒంటిగంట దాటి ఐదునిముషాలైంది–

రౌండ్స్ ముగించుకుని ప్రశాంత వదనంతో తన ఆఫీస్‌లో పలికొచ్చిన డి జి పి కళ్యాణ్‌రాం టెలిఫోన్ మోగేసరికి రిసీవరెత్తాడు.

'హలో డి జి పి ! బాంక్ దోపిడి ముగిసింది!'

అన్న కంఠం విని క్షణం తన చెవులను తానే నమ్మలేక పోయాడు యింతలో ఓ ఆఫీసర్ తన గదిలోకి రావడంతో యిప్పుడు తను మాట్లాడుతున్న ఫోన్ని ట్యాప్ చేసి అవతలివాళ్ళు ఏ నంబర్నుంచి మాట్లాడుతున్నారో కనుక్కోమన్నట్లుగా కోడ్‌లో రాసాడు కళ్యాణ్‌రాం ఆ వ్యక్తి హడావుడిగా వెళ్ళిపోయాడు

"యింతకీ నువ్వెవరు?" అన్నాడు సంభాషణ పొడిగించడానికి!

"నేనెవర్నో తెలీదా? కమర్షియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో అన్న ప్రకారం ఎనిమిది లక్షల రూపాయలు దోచుకున్నాను కారణం వివరంగా చెప్తాను విను

ఆ బ్యాంక్ మేనేజర్ సదానందం పదిమంది చిన్న తరహా పారిశ్రామికులకు యివ్వవలసిన లోన్లు ఆపేసి లంచం తీసుకుని ఆ డబ్బు మరో రైస్ మిల్లు ప్రొప్రైటర్‌కిచ్చాడు

తాను లంచంగా తీసుకున్న ఆ డబ్బుతో ప్రియురాలికి యిల్లు కొనిచ్చాడు గనుక అతన్ని శిక్షించి ఆ రైస్ మిల్లు కిచ్చిన లోన్ రద్దు చేసి, ఆ డబ్బుని తిరిగి బ్యాంక్‌లో జమ చెయ్యమని చెప్పండి. నేను తీసుకున్న సొమ్ము ఆ చిన్న తరహా పారిశ్రామికులకు అందుతుంది ఆ తర్వాత వాళ్ళు యిన్స్టాల్‌మెంట్స్‌లో ఆ డబ్బుని బాంక్‌లో జమ చేస్తారు! ఓకే" అంది అవతలి కంఠం.

'చూడు మిస్టర్! ఎందుకు నీకీ శ్రమ? దోపిడీకి శిక్షఏమిటో తెలుసా? అన్నాడు డి జి పి

అవతల్నుంచి సన్నగా నవ్వు విన్పించింది

"యిది ఓల్డ్ ట్రిక్ మిస్టర్ కళ్యాణ్‌రాం! నన్ను మాటల్లో పెట్టి నా ఆచూకీ తెలుసుకోవాలని చూస్తున్నావ్ కదూ! నీకా ఛాన్స్ నేనివ్వను! బెటర్‌లక్ నెక్స్ట్ టైమ్!

ఫోన్ డిస్ కనెక్ట్ అయింది

అంతలో తాను ఫోన్ ట్యాప్ చెయ్యమని పంపిన ఆఫీసర్ వచ్చి–

"ఆ ఫోన్ సెంట్రల్ పోస్టల్ అండ్ టెలిగ్రాఫ్ ఆఫీసులోని పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచి వచ్చింది సర్!" అని చెప్పాడు– నిట్టూర్చాడు డి జి. పి

ఈ పాటికి రాకా అక్కడ్నుంచి మాయమై వుంటాడు అనుకుంటుండగా – ఉన్నట్టుండి అన్ని టెలిఫోన్లూ ఒకేసారి ఆగకుండా . చెవులు చిల్లులు పడేలా ఒకేసారి మోగసాగాయి!

*        *        *        *        *        *        *        *        *        *

"అమ్మాయిగారూ! మీకు ఫోను!" అన్న కేక విని వెనక్కి తిరిగి చూసింది దేదీప్య

"అర్జంట్ అటమ్మా!" అన్నాడు నౌకరు

దేదీప్య ఎవరైయుంటారా అని ఆలోచిస్తూ వెళ్ళి ఫోనెత్తింది

"హలో మిస్ " అన్న గంభీర కంఠం విన్న దేదీప్య గుండె ఝల్లుమంది

"మిస్టర్ రాకా???" ఆమె కంఠం నిండా ఉద్వేగం

"యస్! బ్యాంక్ పని పూర్తయింది!" అంది అతని కంఠం నిర్వికారంగా

ఆమె చేతి వేళ్ళు టెలిఫోన్ రిసీవర్ చుట్టూ గట్టిగా బిగుసుకున్నాయి!

"థాంక్స్ ఫర్ ది టిప్!" అన్నాడతను

"మీరు . మీరెక్కడ్నుంచి మాట్లాడుతున్నారు?" అంది దేదీప్య తడబాటుగా.

"అవన్నీ ఎందుకు? మీకు స్వయంగా థాంక్స్ చెప్పాలని వుంది రేపు సాయంత్రం సరిగ్గా ఆరున్నరకి సిటీకి పదిహేను కిలో మీటర్ల దూరంలో వున్న నక్కవాగు వంతెన దగ్గరకొచ్చి నీళ్ళలోకి వడి గులకరాళ్ళు విసరండి! నేనొస్తాను!"

దేదీప్యకంతా అయోమయంగా వుంది!
ఏమని చెప్పాలో అర్థం కాలేదు క్షణం వస్తానని చెప్పాలా? రాననా?
"నేను నేను రాను " అతి హీనస్వరంతో
సమాధానంగా సన్నటి నవ్వు విన్పించింది-
నువ్వు రాకుండా వుండలేవు! అన్నట్టు.
మరుక్షణం ఫోన్ డిస్ కనెక్ట్ అయింది

★ ★ ★ ★ ★ ★

"అవమానం !
గవర్నమెంటుకి మీకూ నాకూ కూడా యిన్సల్ట్! ఒక ప్రజా నాయకుడిని ఒక మంత్రిని . పట్టపగలు దారుణంగా హత్య చేస్తే హెచ్చరించి మరీ బ్యాంక్ దోచుకుంటే కనీసం ఆ వ్యక్తి ఎలా వచ్చాడో ఎప్పుడొచ్చాడో కూడా తెలుసుకోలేని పరిస్థితిలో వున్నాం మనం షేమ్ షేమ్ !" కోపంగా అరిచాడు ముఖ్యమంత్రి

ఆయనకెదురుగా వున్న డి జి. పి కళ్యాణ్‌రాం ఏం మాట్లాడలేదు సి ఎం కోపం ఆయనకి తెలుసు ఆయన ఆవేదన అర్థమైంది!

"ఏం? మాట్లాడరేం? ఏం చెబుతాం మనం ప్రజలకి! లా అండ్ ఆర్డర్‌ని ఒక వ్యక్తి అందులోనూ ఓ క్రిమినల్ కంట్రోల్ చెయ్యడమా? మీరు- నేను- మనమంతా చేతులకి గాజులు తొడిగించుకుని కూర్చోడమా?"

"అది అతను పూలదండలో " ఏదో చెప్పబోయాడు కళ్యాణ్‌రాం!

పూల దండలో కాకపోతే జేబు రుమాల్లో పెడతాడు విషం! అయ్యప్ప వేషంలో కాకపోతే అడుక్కునేవాడి వేషంలో వస్తాడు వాడు లక్షా తొంభై మార్గాలు అనుసరిస్తాడు అవి కనుక్కోడానికే మీ డిపార్ట్‌మెంట్ ఉన్నది ఏమంటే హోం మినిస్టర్‌గారూ! ఒక క్రిమినల్‌ని పట్టుకోలేకపోతే మీరంతా ఎందుకు? డోంట్ మిస్ అండర్‌స్టాండ్ మి! నా ఆవేదన అర్థం చేసుకోండి ప్రజలకు నేను సంజాయిషీ చెప్పుకోవాలి!" అన్నాడు ముఖ్యమంత్రి

హోం మినిస్టర్ హరిబాబు నీళ్ళు నమిలాడు గట్టిగా మాట్లాడితే ఆ ఉద్రేకంలో సి. యం తన పోర్టుఫోలియో మార్చినా మార్చగలడని అతని భయం!

కాస్సేపటికి సి. యం తనని తాను కంట్రోల్ చేసుకున్నాడు

"హరిగారూ! మీరూ డి జి పి గారూ ఏం చేస్తారో నాకు తెలీదు పది రోజుల్లో మీరు ఆ నేరస్తుడిని పట్టుకోవాలి లేదా నేను కేంద్రాన్ని సహాయమర్థించవలసి వస్తుంది! అంతకంటే అవమానం మరొకటి లేదు ఆ తర్వాత మీ యిష్టం!" అనేసి సి యం తన ఛాంబర్స్‌లోకి వెళ్ళిపోయాడు

హోం మినిస్టర్ తల పట్టుకు కూర్చున్నాడు

"విన్నారుగా డి జి పి గారూ! మనం మట్టుకు ఏం చేస్తాం! మీరూ రాత్రింబవళ్ళు శ్రమపడుతున్నారు ఏదైనా ఒకపథకం ఆలోచించి వాడిని పట్టుకోండి వీల్లేకపోతే కాల్చి చంపండి! వాడిని పట్టుకున్న వాళ్ళకు ప్రభుత్వం యిచ్చే బహుమతిని పెంచండి 'రాకా'ని పట్టుకున్న వాళ్ళకి ప్రభుత్వం యిచ్చే బహుమతి యాభైవేలు కాదు!

లక్ష రూపాయలు!!!"

★ ★ ★ ★ ★ ★

"లక్ష రూపాయలు వాడి తల మీద విలువ మన చేతగానితనంతో యింకో యాభైవేలు పెరిగింది ఛీ!"

చేతిలో గ్లాసు విసిరికొట్టాడు శంభుదాదా!

"గ ళ్ "మని పెద్ద శబ్దం చేస్తూ పగిలిపోయింది గాజు గ్లాసు

శంభుదాదా పేరుమోసిన గ్యాంగ్ లీడర్! అతని పేరు చెప్తే పెద్ద పెద్ద వ్యాపారస్తులకు - స్మగ్లర్లకూ హడల్!!

మదించిన ఏనుగులా వున్న అతని కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి శంభుదాదాకి సిటీలో జరిగే దాదాపు అన్ని నేరాలతోనూ సంబంధముంటుంది కమీషన్ పద్ధతి మీద టోకుగా ఒప్పుకున్న మొత్తాలకు అతను నేరాలు







## గడుసులోకం —బాబు







## పవిత్రపాపి

చేస్తుంటాడు. పెద్దమనుషులుగా చెలామణీ అయ్యేవాళ్ళు చాలామంది అవసరానికి శంభుదాదా ముఠాని 'బుక్' చేసుకుంటారు.

అతని ఆటలు సజావుగా సాగడానికి అతనికి పెద్ద పెద్ద రాజకీయ నాయకుల-అధికారుల అండదండలున్నాయని వినికిడి!

రాకా ఆపద తప్పించుకోడానికి దీనదయాళ్ శంభుదాదా ముఠాని సహాయం కోరాడు. గతంలో రాకా బెదిరింపులకు లోనయిన యిద్దర్ని రక్షించబోయి ఫెయిలయ్యాడు శంభుదాదా. అందుకే దీనదయాళ్ విషయంలో డబ్బుకోసం కాకుండా రాకా మీద కక్షతో చాలా పకడ్బందీగా అతని కోసం వలపన్ని దీనదయాళ్‌ని రక్షించే భారం చేపట్టాడు శంభుదాదా!

కాని... ఈసారి కూడా రాకానే గెలిచాడు.

శంభుదాదా రక్తం ఉడికిపోతోంది. యిది ఇలాగే సాగితే తన బిజినెస్ పూర్తిగా పడిపోతుంది.

అందుకే తన మనుగడ కోసమైనా రాకాని అంతంచెయ్యాలనే పట్టుదలతో వున్నాడు శంభుదాదా.

పోలీసులకి చిక్కడంలేదు. తనకు అందడంలేదు. వాడినెలా మట్టుపెట్టడం? అని రెండు గంటల నుంచీ తల బద్దలు కొట్టుకుంటూ బోనులో పులిలా తిరుగుతున్నాడు శంభుదాదా! ప్రజల మద్దతువల్లే వాడు తప్పించుకోగలుగుతున్నాడు.

ప్రజలు....ప్రజల మద్దతు....

శంభుదాదా బుర్రలో తళుక్కున ఓ ఆలోచన మెరిసింది.

అవును... అదే మార్గం!

శంభుదాదా పెదాలపైన క్రూరమైన నవ్వు కదలాడింది.

★ ★ ★ ★ ★ ★

మధ్యాహ్నం మూడు గంటలు!

కుసుమ దగ్గరకెళ్తున్నానని చెప్పి బయల్దేరింది దేదీప్య. ఆమె ఉదయం లేచిన దగ్గర్నుంచీ ఎగ్జైటింగ్గా వుంది.

ఆ రోజే 'రాకా కలుస్తానని చెప్పిన రోజు. అతను ఫోన్ చేసినప్పటి నుంచీ ఓ విధమైన అలజడితో మనసు రెప రెపలాడుతోంది.

అతను పిలిస్తే తానెందుకు వెళ్ళాలి?

అతనెవరు? తనెవరు? తమిద్దరి మధ్యా ఏమిటి సంబంధం? తనో జస్టిస్ కూతురు- మరి అతను?

ఓ పేరుమోసిన క్రిమినల్!

అతను పిల్చినంత మాత్రాన తాను వెళ్ళిపోవడమేనా?

అటువంటి నేరస్తుడిని కలిస్తే ఎంత ప్రమాదం? ఛ... అతనివల్ల ప్రమాదమేమిటి? తననే అతను ప్రమాదం నుండి రక్షించాడు. ఆ నరరూప రాక్షసుల బారి నుంచి తనను కాపాడి సురక్షితంగా యింటికి చేర్చాడు.

యిది కారణం కాదు అతన్ని కలుసుకోవాలని అనుకోడానికి!

ఎందుకో అతని గొంతు విన్నా-

అతన్ని తలచుకొన్నా- ఏదో తెలియని పులకింత!

చెప్పలేని అలజడి.... ఎప్పుడూ ఎన్నడూ చవిచూసి ఎరగని అనుభూతి....!

ఆటో దిగి కుసుమ యింట్లోకి నడిచింది.

"హాయ్! ఈ రోజు నిన్ను చూస్తుంటే నమిలి మింగేయాలనిపిస్తోంది" ఎత్తుకుని గిరగిరా తిప్పేసింది కుసుమ.

తనకి తెలియకుండానే శ్రద్ధగా అలంకరించుకుంది దేదీప్య. లేత గులాబీరంగు చీర- బంగారు నడుము ఒంపుల క్రిందికి జార్చి కట్టింది. తీర్చిదిద్దిన కనుబొమల మధ్య గులాబీ రంగు బొట్టు. లిప్‌స్టిక్ వెయ్యక పోయినా తడిగా మెరుస్తున్న పెదవులు. చేతుల నిండుగా గాజులు... మెడలో ముత్యాలహారం... స్వర్గం నుంచి భూలోకానికి సరదాగా షికారుకొచ్చిన అప్సర కన్యలా వుందామె.

కుసుమ కారు తీసుకుని బయల్దేరింది దేదీప్య.

చేతులు సన్నగా వణుకుతున్నాయ్.... అరిపాదాల్లో చెమట.... అందరూ పార్కుల్లో- సినిమాహాల్స్‌లో కలుసుకుంటే తామేంటి? యిలా ఊరికి దూరంగా పొలాల్లో... గట్ల మీద.... అతను చెప్పిన వాగు కన్పించేసరికి కారు ఆపింది దేదీప్య. సూర్యుడు పడమటకి కృంగుతున్నాడు. సంధ్యాకాంతులు లోకాన్ని బంగారు కాంతితో నింపుతున్నాయ్!

ఆ సాయం సంధ్యవేళ.... సంధ్యా కన్యలా ఆమె వాగు వెంట నడిచి వంతెనను చేరుకుంది. చుట్టుపక్కల ఎవరూ లేరు! దేదీప్య వంతెన క్రిందుగా దిగింది. సంధ్యాకాంతి వాగు మీద పడి ప్రతిఫలిస్తూ- నీళ్ళు రంగు రంగు ముత్యాల సరాల్లా మెరుస్తున్నాయ్!

ఆమె అక్కడ వున్నఓ రాతి మీద కూర్చుని పగడాల్లాంటి గులకరాళ్ళు ఏరి నీళ్ళలోకి విసురుతోంది. ఆ రాళ్ళు ఎంత శబ్దం చేస్తూ నీళ్ళలో మునిగిపోతున్నాయ్.

ఎనిమిది -

తొమ్మిది -

పదో రాయి విసరబోతూండగా-

"హలో..! ఫ్రెండ్!" అన్న కంఠ స్వరానికి చటుక్కున తలెత్తి చూసింది.

ఎదురుగా అతను!

తన కలల హీరో!

ఆమె తన్నుతాను మైమరచిపోయి అతన్నే చూస్తుండిపోయింది.

పొడుగ్గా దృఢంగా - వున్నాడు.

నిర్లక్ష్యంగా నుదుటిపై పడుతోన్న ముంగురులు-

పెదవులపై మనోహరమయిన చిరునవ్వు!

అతని బలిష్ఠమైన శరీరం తీరులో నో-

చురుకైన అయస్కాంతపు కళ్ళలో నో-

నిల్చున్న భంగిమలో నో-

మాట్లాడే తీరులో నో-

దేనిలో నో పరమాద్భుతమైన ఆకర్షణ వుంది! అతనికి సమీపంగా వుంటే ఆ ఆర్షణ తనను వివశురాల్ని చేస్తున్నట్టు గ్రహించింది దేదీప్య.

లేచి బొమ్మలా- మౌనంగా నిల్చుంది.

"థాంక్యూ మిస్! బ్యాంక్ విషయంలో మీరిచ్చిన సలహా నాకెంతో ఉపకరించింది. పర్సనల్‌గా థాంక్స్ చెబుదామని పిల్చాను- అఫ్‌కోర్స్ ఆడపిల్లని యింత దూరం పిలవడం యిబ్బందే అయినా- నేను నేనుగా మీ ముందుకి వచ్చి కృతజ్ఞత తెలుపుకోవడానికి యింతకంటే మార్గం లేకపోయింది!" అంటున్న అతని గొంతులో ఏ భావమూ లేదు.

రెండడుగులు ముందుకు వేసాడతను.

కళ్ళెత్తి ముందుకు చూసింది దేదీప్య.

అత్నని ముఖంలో ఏ భావమూ లేదు.

కోటు జేబులోంచి ఓ తెల్ల గులాబీ తీసి ఆమెకిచ్చాడు.

ఓ చేత్తో దాన్ని అందుకున్న దేదీప్య రెండవ చెయ్యిని అప్రయత్నంగా తల్లోకి తీసుకెళ్ళింది.

రాకా సన్నగా నవ్వాడు. యిద్దరికీ ఆ రోజు ఆమె పువ్వునే ఆమెకి బహుమతిగా యిచ్చిన సంఘటన గుర్తొచ్చింది.

"మీరీ రోజు పువ్వు పెట్టుకు రాలేదు లెండి!" అన్నాడు.

యిద్దరి మధ్యా కొద్దిసేపు మౌనం.

ఆ చీకటి వెలుగుల సంగమంలో ప్రకృతి కన్యలా నిలబడి వుంది దేదీప్య. మరో యువకుడయితే ఆమె అందాన్ని కళ్ళతోనే తాగేసేవాడు. అబ్బాయిలు తనని వెర్రెత్తినట్టు చూడటం ఆమె కలవాటే! కాని, ఈ వ్యక్తి తన అందం గురించి పట్టించుకున్నట్టు లేదు!

అలా అతను నిర్లిప్తంగా ఉన్నకొద్దీ ఆమెకి అతని పట్ల మరింత ఆకర్షణ పెరిగిపోతోంది...

"సరే మిస్... పొద్దుపోతోంది జాగ్రత్తగా యింటికెళ్ళండి!" అని వెనక్కి తిరిగాడు.

"వట్టి థాంక్స్ చెప్పడానికేనా యింత దూరం పిలిచింది?" అనాలోచితంగా చెయ్యి చాచి అతని చేతిని పట్టుకుంది దేదీప్య.

(ఇంకా ఉంది)

# శాస్త్రార్థాలపై ఇద్దరు స్వాముల వివాదం

రాజస్థాన్‌లోని దేవరాలలో రూప్ కన్వర్ సతి చేసిన దగ్గర్నుంచి 'సతి' ఆచారంపై పెద్ద దుమారం చెలరేగింది. మహిళా సంఘాలు, రాజకీయ నాయకులు 'సతి'ని దుయ్యబడితే కొంతమంది పీఠాధిపతులు దీనిని సమర్థించారు. 'సతి'ని సమర్థిస్తూ బాహాటంగా ప్రకటన చేసిన వారిలో పూరీ పీఠాధిపతి స్వామి నిరంజన్‌దేవ్ తీర్థ మొదటి వారు కాగా కంచి కామకోటి పీఠాధిపతి స్వామి జయేంద్ర సరస్వతి రెండవవారు. 'సతి' ఐచ్ఛికమైనదని, దాన్ని నిషేధించరాదని, కొన్ని కులాలకు సంబంధించి సతి ఒక ఆచారంగా వస్తుందని, అది కొనసాగినందు వల్ల వచ్చే హాని ఏమీ ఉండదని వారు అభిప్రాయపడ్డారు. హిందూ మతానికి సంబంధించిన ధార్మిక హద్దులో. నిర్ణయించి, చట్టం చేసే హక్కు భారత ప్రభుత్వానికి లేదని పూరీ శంకరాచార్య అన్నారు. సతిని ఒక పెద్ద సమస్యగా పత్రికలు, రాజకీయవేత్తలు చిత్రించటం జరిగిందని, అసలు ఇది ప్రస్తావించదగ్గ విషయమే కాదని స్వామి జయేంద్ర సరస్వతి అంటూ, పతాక శీర్షికల కోసం దేవరాల సంఘటనను అతిశయోక్తులతో ప్రచురించారని వ్యాఖ్యానించారు. స్వామి నిరంజన్‌దేవ్ తీర్థ మీరట్‌లో సతికి అనుకూలంగా ప్రకటన చేయటంపై, జనతా నాయకుడు స్వామి అగ్నివేష్ వివాదాన్ని లేవదీసి ఆయన ప్రకటనను ఖండిస్తూ స్వామి నిరంజన్ దేవ్ తీర్థను అరెస్టు చేయాలని కోరారు. స్వామి నిరంజన్ దేవ్ తీర్థ, స్వామి అగ్నివేష్ 'సతి' ఆచారంపై 'శాస్త్రార్థం'లో దిగుదామని నిర్ణయించుకున్నారు. కానీ శాంతికి భంగం వాటిల్లుతుందని ముందు జాగ్రత్తగా పోలీసులు స్వామి అగ్నివేష్‌ను అరెస్టు చేశారు. దాంతో 'చర్చ' ఆగిపోయింది. ఒక వేళ 'శాస్త్రార్థం' జరిగినా ఇరు పక్షాలు వారు ఒక నిర్ణయానికి వస్తారన్న నమ్మకం ఏమీ లేదు. ఈ ఇద్దరు స్వాములూ ఉత్తర దక్షిణ ధృవాల్లాంటి వారు. పూరీ శంకరాచార్య సనాతనుడు. స్వామి అగ్నివేష్ ఆర్య సమాజానికి సంబంధించిన ఆంధ్రుడు. కారల్ మార్క్స్ ప్రభావం ఆయనపై వున్నది. 'సతి' శాస్త్ర సమ్మతమైనదని పూరి శంకరాచార్యుల వారి అభిప్రాయమైతే అది శాస్త్ర విరుద్ధమైనదని స్వామి అగ్నివేష్ అభిప్రాయం. పూరి శంకరాచార్య వర్ణవ్యవస్థను, అస్పృశ్యతను గట్టిగా సమర్థిస్తారు. ఈ రెండూ గతంలోనే కాదు, వర్తమానంలోను అవసరమని నొక్కి చెబుతారు. స్వామి అగ్నివేష్ ఈ రెండింటిని విమర్శించటమే కాకుండా స్త్రీ స్వాతంత్ర్యాన్ని సమర్థిస్తారు. 'సతి' అమానుషం అని ఒక ప్రక్క చెబుతూ మగవాడు లేనిదే ఆడదానికి మనుగడ లేదని పరోక్షంగా 'సతి'ని సమర్థించే మహానుభావులు లేకపోలేదు. స్వామి నిరంజన్ దేవ్ తీర్థ, స్వామి అగ్నివేష్ తమ తమ అభిప్రాయాలు వేరు వేరు సందర్భాలలో అలా వ్యక్తం చేసారు.

పూరీ శంకరాచార్యుల వారి అభిప్రాయాల సారాంశం–

ప్రశ్న : సతిని గురించి మీ అభిప్రాయం ఏమిటి?

జవాబు : నాకు ప్రత్యేకమైన అభిప్రాయాలు ఏమీ లేవు. శాస్త్రాలలో వున్నది నేను ఉటంకిస్తున్నాను.

ప్రశ్న : ఏ ఏ శాస్త్రాలు ఏమేమి చెబుతున్నాయి?

జ : వేదాలు, సంహితలు, ధర్మసింధు, అన్నీ 'సతి'ని సమర్థిస్తున్నాయి. ఎవరు 'సతి' కావచ్చో, ఎవరు కాకూడదో అవి చెబుతున్నాయి. ఆ గ్రంథాలలో వున్నదే నేను చెబుతున్నాను. ఇది నా అభిప్రాయం కాదు.

ప్ర : ఏ ఏ సందర్భాలలో 'సతి' కావచ్చు?

జ : భర్త మరణించిన తర్వాత ఒక్క నిముషం కూడా అతడు లేనిదే బ్రతక లేనంతగా ప్రేమించే ఏ స్త్రీ అయినా 'సతి' కావచ్చు.

ప్ర : 'సతి' అవటం యిష్టం లేకపోతే?

జ : ఆమె పవిత్రమైన జీవితం గడపాలి. బ్రహ్మచర్యం పాటించాలి.

ప్ర : 'సతి' అవసరమని ఆ గ్రంథాల్లో రా... వుందా?

జ : ఎవరి యిష్టం వాళ్లది. ప్రతి ఒక్కరూ 'సతి' ఆచారం పాటించాలనే నియమం లేదు. గర్భిణి స్త్రీ, బాలింత, చిన్నపిల్లలు వున్న తల్లి సతి పాటించవలసిన అవసరం లేదు.

ప్ర : అంటే 'సతి' ఐచ్ఛికమన్న మాట ?

జ : అవును. ఎలాంటి సందర్భంలోనైనా 'సతి' పాటించాలని ఎక్కడా రాయబడలేదు. దశరథుడు మరణించిన తర్వాత ఆయన ముగ్గురు భార్యలు 'సతి' కాలేదు. పాండు రాజుకు యిద్దరు భార్యలు. వారిలో ఒక్కరే 'సతి'ని పాటించింది.

ప్ర : వేదాలు ఏం చెబుతున్నాయి?

జ : ఋగ్వేదంలో ఒక మంత్రం వుంది. భర్త చితిపై వున్న స్త్రీ తిరిగి తన భర్త పొందే స్థానం చేరుకోవాలని పురోహితులు ప్రార్థిస్తారు. అధర్వవేదంలో ఇలా వుంది – "ఓ గతించిన ఆత్మా! ఈ స్త్రీ మరణించాలని అనుకుంటూంది. పుణ్యఫలంతో నువ్వు ఏ లోకం పొందుతావో అదే లోకం ఈమెకు సంప్రాప్తించేట్టు చూడు."

ప్ర : విధవా పునర్వివాహం గురించి వేదాల్లో రాయబడలేదా?

జ : లేదు.

ప్ర : పురుషునికి వున్న హక్కు స్త్రీకి లేదా? మళ్లీ ఆమె పెళ్లి చేసుకోవాలా, అక్కర్లేదా? మీరేమనుకుంటున్నారు?

జ : ఇదంతా వేదాల్లో వుందని చెప్పవద్దు.

ప్ర : ఉందని స్వామీజీ అంటున్నారు?

–ఏ స్వామి?

అగ్నివేష్

జ : ఆయన ఒక్క శబ్దం కూడా సంస్కృతంలో అప్పచెప్పలేదు. సంస్కృత గ్రంథంలో వున్నది వున్నట్టు ఒక్కటి అప్పచెప్పినా నేను ఓటమి అంగీకరిస్తాను.

ప్ర: అయితే మీ అభిప్రాయం ఏమిటి?



"స్త్రీ పురుషులు సమానం కారు. శారీరకంగా, మానసికంగా ఇద్దరూ వేరు. ఆహారపు అలవాట్లలో, జీవన విధానంలో, ప్రతిస్పందనలో, భావాలలో స్త్రీ పురుషులు వేరు, వేరు. అటువంటప్పుడు సమానత్వమనే ప్రశ్న ఎక్కడ? శరీరాలు వేరైనప్పుడు సమానత్వం ఏమిటి?....."

–స్వామి నిరంజన్‌దేవ్‌తీర్థ



"సతి వేదాలలో లేదు. శాస్త్ర సమ్మతం కాదు. భర్త మరణించిన తర్వాత స్త్రీ ఆత్మహత్య చేసుకోవాలనీ, మృత్యువుని వరించాలనీ ఎక్కడా రాయబడలేదు. మన ధర్మాచార్యులు అప్పుడప్పుడు వేదాలకు, శాస్త్రాలకు తప్పుడు వ్యాఖ్యానాలు చేస్తూ ఉంటారు. స్త్రీ ఎప్పుడూ పురుషునికి దాసిగా ఉండాలని వారి తాపత్రయం"

–స్వామి అగ్నివేష్

జ : ఇది నా అభిప్రాయం కాదు. వేదాలవి.

ప్ర : మీ వ్యక్తిగతమైన అభిప్రాయం ఏమిటి?

జ : హిందువులలో ఈ వివాదం ఆయన రేకెత్తించకూడదు. ఆయనతో నేను వివాదంలో దిగనప్పుడు ఆయన ఎందుకు నాతో వివాదంలో దిగాలి? ఒక్క విషయం చెబుతాను. విధవరాలైన ఆయన తల్లి, చెల్లి, కూతురు, తిరిగి పెళ్లి చేసుకోవాలనుకుంటే చేసుకోమనండి. ఒకసారి కాదు వెయ్యి సార్లు. నేను అలా చెయ్యను అంటే ఆయన నా పరువు ఎందుకు తీయాలనుకోవడం? ఇది చాలా తప్పు.

ప్ర : స్త్రీ, పురుషుల సమాన హక్కుల గురించి మీ అభిప్రాయం ఏమిటి?

జ : స్త్రీ పురుషులు సమానం కాదు. శారీరకంగా, మానసికంగా ఇద్దరూ వేరు. ఆహారపు అలవాట్లలో జీవన విధానంలో, ప్రతిస్పందనలో, భావాలలో స్త్రీ పురుషులు వేరు వేరు. అటువంటప్పుడు సమానత్వమనే ప్రశ్న ఎక్కడ? శరీరాలు వేరైనప్పుడు అధికారాలలో సమానత్వం ఏమిటి? మగవాడు తినే దానికన్నా ఆడది రెట్టింపు తింటుంది. మగవాని కంటే ఆడది నాలుగు రెట్లు తెలివి గలది. ఆరు రెట్లు సాహసవంతురాలు. ఎనిమిది రెట్లు కామం ఉంటుంది. ఇదంతా శాస్త్రాలలో వుంది. మీరు పాటిస్తే పాటించండి, లేకపోతే లేదు. కానీ నేను నా తల్లిని, చెల్లిని, కూతుర్ని శాస్త్రాలలో వున్న దానిని పాటించమని చెబితే మీరెవరు కాదనటానికి? మాకు విరుద్ధంగా చట్టం చేసే అధికారం మీకు ఎక్కడిది?

ప్ర : అంటే ప్రభుత్వమన్న మాట?

జ : అవును. ప్రభుత్వం, సంఘ సంస్కర్తలు అందరూ మమ్మల్ని బెదిరిస్తున్నారు.

ప్ర : హిందూ విశ్వాసాలంటే నమ్మకం పోయిందా?

జ : పూర్తిగా. ఈ ప్రభుత్వం హిందూ విశ్వాశాలను, నమ్మకాలను, సంస్కృతిని, జాతిని నాశనం చేయాలనుకుంటోంది.

ప్ర : పునర్వివాహం నిషిద్ధమంటున్నారు కదా, మరైతే ద్రౌపదికి ఐదుగురు భర్తలు వున్నారుగా?

జ : తపః శక్తి వల్ల, ఋషులు, మునుల ఆశీర్వాదం వల్ల అది సాధ్యపడుతుంది. ద్రౌపదికి వున్న అయిదుగురు భర్తలు గత జన్మలలో వున్న వారే. శాపవశాన వారంతా కలిసి పుట్టారు. ఆమె శివుని ప్రార్థించి వరం పొందింది. యుధిష్ఠరుణ్ణి వివాహమాడిన మర్నాడు ఆమె మళ్లీ శారీరకంగా కుమారి అయ్యింది. భీముడ్ని పెళ్లి చేసుకుంది. అలానే అర్జునుణ్ణి, మిగతా నకుల సహదేవులని శారీరకంగా కుమారి అయిన తర్వాతే పరిణయమాడింది.

ప్ర : అంటే కుమారి అయిన విధవరాలికి మళ్లీ పెళ్లి చేసుకునే అధికారం వుందన్న మాట?

జ : కుమారి అయిందనే సాక్ష్యం వుంటే.

ప్ర : అలా వుంటే పునర్వివాహం చేసుకోవచ్చా?

జ : అవును.

ప్ర : 'సతి'ని గౌరవించని వారి సంగతి ఏమిటి?

జ : నరకానికి పోతారు. మీరు శాస్త్రాలను నమ్మకపోతే, నమ్మకపోండి. నాకు అభ్యంతరం లేదు. నాకు మాట్లాడే హక్కు లేదని చెప్పద్దు. ఇందుకు విరుద్ధంగా మీరు చట్టం తయారు చేస్తే నేను దానిని వ్యతిరేకిస్తాను.

ప్ర : శాస్త్రాలను వ్యతిరేకించిన వారు హిందువులు అవుతారా?

జ : పుట్టుకతో నే ఎవరైనా హిందువు అవుతారు. మతం మార్చుకున్నా హిందువు హిందువే.

ప్ర : 'సతి'కి విరుద్ధంగా చట్టం చేయటం గురించి మీ అభిప్రాయం ఏమిటి?

జ : ఇది సంస్కృతి, సభ్యత, నీతికి విరుద్ధమైంది. ప్రతి హిందువు దానిని వ్యతిరేకించటానికి ప్రాణాలు కూడా లెక్క చేయకూడదు.

**స్వామి అగ్నివేష్ అభిప్రాయాలు :–**

ప్ర : 'సతి'ని గురించి పూరీ శంకరాచార్యులు చెప్పిన అభిప్రాయాలతో మీరు ఏకీభవిస్తున్నారా? ఆయన 'సతి' ఆచారం కాదు, ధర్మం అంటున్నారు. వేదాలలో వుందంటున్నారు.

జ : 'సతి' వేదాలలో లేదు. శాస్త్ర సమ్మతం కాదు. భర్త మరణించిన తర్వాత స్త్రీ ఆత్మహత్య చేసుకోవాలనీ, మృత్యువుని వరించాలనీ ఎక్కడా రాయబడలేదు. మన . ధర్మాచార్యులు అప్పుడప్పుడు వేదాలకు, శాస్త్రాలకు తప్పుడు వ్యాఖ్యానాలు చేస్తూ వుంటారు. స్త్రీ ఎప్పుడూ పురుషునికి దాసిగా వుండాలని వారి తాపత్రయం.

ప్ర : స్త్రీ విధవరాలు అయిన తర్వాత 'సతి' పాటించకుండా బ్రతికవచ్చు లేదా పునర్వివాహం చేసుకోవచ్చు అనేందుకు ఏదైనా ఉదాహరణ యివ్వండి.

(81 వ పేజీ చూడండి)

పూరీ శంకరాచార్యతో శాస్త్ర చర్చకు మీరట్ వెళుతున్న స్వామి అగ్నివేష్, ఆయన అనుచరులు.



# గతం గతః

## కాకాని కమల

తెల్లవారు ఝాము....

సమయం ఐదు గంటలు దాటుతూంది.

తూరుపు ఆకాశం క్రమంగా ఎర్రబారుతూంది.

పక్షులు గూళ్ళల్లోంచి ఇవతలకి వచ్చి చెట్ల కొమ్మల మీద వాలి- రాత్రి జరిపిన శృంగారాన్ని వేదాంత పరిభాషలో వినిపిస్తున్నాయా అన్నట్లు- కలకలా రావాలు చేస్తున్నాయి.

విశ్వనాధశాస్త్రి బావిదగ్గర స్నానం చేసి తడి అంగవస్త్రం విడిచి పట్టుబట్ట కట్టుకొని ఇంట్లోకి వచ్చాడు.

అప్పటికే దేముడి గదిలో పూజా మందిరం ముందు శుభ్రంగా కడిగి ముగ్గులు పెట్టి పూజా సామాగ్రి అంతా సిద్ధం చేసింది భార్య లలితమ్మ.

విశ్వనాధశాస్త్రి పద్మాసనం వాల్చుకుని మందిరం ముందు కూర్చున్నాడు.

వంట గదిలో భార్య లలిత చల్లచిలుకుతున్న ధ్వని ఆలాపనగా వినిపిస్తోంది.

విశ్వనాధశాస్త్రి విబూది నుదుట రాసుకుని కుంకుమ గంధపు అక్షితలు కలిపిన బొట్టు పెట్టుకున్నాడు.

మందిరానికి అటు ఇటు నిలువెత్తుగ వున్న ఇత్తడి కుందీల్లో నూనెపోసి వత్తులు వేసి దీపారాధన చేశాడు.

ఎదురుగా మందిరంలో పెద్ద కుంకుమ బొట్టుతో సర్వాలంకార భూషితురాలైన అమ్మవారి విగ్రహం కళకళ లాడుతూంది.

ఎనిమిది చేతులతో అభయం ఇస్తున్నట్లు ఆ జగన్మాత చిరునవ్వు చిందిస్తూంది.

విశ్వనాధశాస్త్రి చేతులు యాంత్రికంగా జపమాల తిప్పుతున్నాయి.

పెదవులు అసంకల్పితంగా గాయత్రీ మంత్రాన్ని ఉచ్చరిస్తున్నాయి.

కాని....

ఈ రోజు విశ్వనాధశాస్త్రి మనసు మనసులో లేదు. నీళ్ళమీద బెండులా అస్థిమితంగా వుంది. బాణం దెబ్బతిన్న పావురంలా మనసు మూలుగుతూంది. ఎంత ప్రయత్నించినా "ధ్యానం" కుదరటంలేదు. నిర్మల చిత్తంతో మనసు ప్రార్ధన మీద లగ్నం కావటంలేదు..

నిన్న ఉదయం జరిగిన సంఘటనే మాటి మాటికి మనసులోకి వస్తూంది.

పదహారు సంవత్సరాల లేత వయసులో వున్న అందమైన అమ్మాయి రూపమే కళ్ళముందు కదులుతూంది.

"శివ" స్తుతికి బదులు "త్రిపుర" అన్న మూడు అక్షరాల పదమే నాలిక మీద నర్తిస్తూంది.

"ఉష్....."

విశ్వనాధశాస్త్రి అసహనంగా జపమాల పక్కకి పెట్టాడు.

మందిరంలో ప్రతిష్ఠించిన జగన్మాత విగ్రహంలోకి చూస్తూ వుండిపొయ్యాడు.

ఎంత "వద్దు" అనుకున్నా మనసు ఆరు సంవత్సరాలు వెనక్కి వెడుతూంది.

తన ఒక్కగా నొక్క కూతురు బాలాత్రిపురసుందరి రూపం కళ్ళముందు కదులుతూంది.

తెనెతుట్టె చెదిరినట్లు ఆలోచన్లు కూతురు చుట్టు పరిభ్రమిస్తున్నాయి.

"అవును.

అప్పుడు....

ఆరు సంవత్సరాల క్రితం త్రిపుర వయస్సు ఎంత?

పదహారు.

ముగ్గురు మగపిల్లల తరువాత అపురూపంగా పుట్టిన ఆడపిల్ల అని ఇంటికి మహాలక్ష్మి అని ఎంత ఆనందించారు?

త్రిపురని చూసుకుని లలితమ్మ ఆనందం వర్ణనాతీతం.

ఒంటికి పాలు, వెన్న, పచ్చి పసుపు రాసి ఏడు మల్లెల ఎత్తుగా పెంచింది.

ఆ ఊరు మొత్తానికి అరవై ఎకరాల సుక్షేత్రమైన మాగాణికి పెద్ద కామందు విశ్వనాధశాస్త్రి. ఆ వంశ పూర్వీకులు ఆలయ అర్చకులుగా వుండేవారు. వారి హయాంలో పెద్ద పెద్ద అగ్రహారాలే వుండేవి.

కాని క్రమంగా కాలం మారి విశ్వనాధశాస్త్రి దగ్గరకి వచ్చేసరికి అరవై ఎకరాలు మిగిలింది.

"శాస్త్రం" చదివిన వేదాధ్యాయన పండితుడు కావటంతో ఊరి వారందరికి తల్లో నాలుకలా వుండేవాడు విశ్వనాధశాస్త్రి.

ఏటా పంటలక్ష్మి చేతికి రాగానే కూతురి ఒంటిమీదకి కొత్త కొత్త నగలు చేయించేవాడు.

"త్రిపురసుందరి" పేరుకి తగినట్లే అపురూప సౌందర్యంతో వుండేది. ముట్టుకుంటే మాసి పోయేలాంటి పచ్చని మొగలిరేకువంటి శరీరఛాయ, చక్రల్లాంటి పెద్ద కళ్ళు, నల్లగా తాచుపాములా నిగనిగలాడే జట్టు.. త్రిపురకి పెట్టని ఆభరణాలు.

తరతరాలుగా విశ్వనాధశాస్త్రి ఇంటి ఇలవేల్పు శ్రీ మహాలక్ష్మి. ఆ వంశంలో ఆడసంతతి తక్కువ. సాక్షాత్ ఆ జగన్మాత తన ఇంట త్రిపుర రూపంలో అవతరించిందని, తన పూజలు ఫలించాయని కూతుర్ని చూసుకొని మురిసిపొయ్యేవాడు విశ్వనాధశాస్త్రి.

త్రిపుర పుట్టేటప్పటికే విశ్వనాధశాస్త్రి ముగ్గురు కొడుకులు పెళ్ళిళ్ళయి పై ఊళ్ళల్లో ఉద్యోగాల్లో స్థిరపడ్డారు.

త్రిపుర పదవ తరగతి మొదటిశ్రేణిలో పాసయ్యింది. ఊళ్ళో కాలేజీ లేదు. అయిదుమైళ్ళ దూరంలో వున్న పొరుగూరికి వెళ్ళాలి. ట్రైన్ సౌకర్యం వుంది.

కూతురు ముచ్చట కాదనలేక కాలేజీలో చేర్పించాడు. ఊళ్ళో మరి కొందరు ఆడపిల్లలు కూడా కాలేజికి వెళ్ళేవారు.

త్రిపురకి మేనరికం వుంది. అత్త కొడుకు భాస్కర్ ఇంజనీరింగ్ చదువుతున్నాడు.

విశ్వనాధశాస్త్రి ఒక్కగా నొక్క చెల్లెలు దాక్షాయణి. విధివశాన పెళ్ళయిన ఆరేళ్ళకే భర్తని కోల్పోయింది. అప్పట్కి భాస్కర్ రెండేళ్ళ పసివాడు. ఆమె పంచ ప్రాణాలు కొడుకే అయ్యాడు. పాడి పంటలకి లోటులేని లోగిలి.

త్రిపుర పుట్టగానే భాస్కర్ భార్యగా ముద్రపడింది. త్రిపురని కాలేజీలో చేర్పించవద్దని పెళ్ళిచేసి అచ్చట ముచ్చట తీరుద్దామని గోలపెట్టింది లలితమ్మ. దాక్షాయణి ఒదినగారికి వంత పాడింది.

కాని త్రిపుర ఒప్పుకోలేదు. చదువుకుంటానని పంతం పట్టింది.

చదువుపట్ల కూతురికి వున్న ఆసక్తికి శాస్త్రి ముచ్చటపడ్డాడు. కాలం మారింది.

ఆడ అయినా మగ అయినా ధనిక అయినా పేద అయినా అందరికి చదువు ముఖ్యమే.

పైగా భాస్కర్‌కి కూడా ఇంకా రెండు సంవత్సరాలదాకా చదువుంది.

ఈలోగా త్రిపురకి ఇంటర్ పూర్తి అయిపోతుంది అని ఆలోచించి కూతుర్ని కాలేజీలో చేర్పించాడు.

అంత వరకు విశ్వనాధశాస్త్రి అంచనా తప్పుకాలేదు. ఏ విషయం గురించైనా ఆలోచించి,

తర్కించి, శోధించి ఒక నిర్ణయం తీసుకుంటాడు ఇంక దానికి తిరుగులేదు నూటికి తొంభై తొమ్మిదిపాళ్ళు సత్ఫలితాన్నే ఇస్తుంది

అందుకే ఊళ్ళో అంతా ఏ సమస్య వచ్చినా చేతులు కట్టుకొని ఆయన ముందు నిల్చుంటారు

చదువుకి కూతుర్ని పొరుగూరికి పంపటంలో అనౌచిత్యం లేదని భావించాడు

కాని మొదటిసారిగా తన అంచనా ఆలోచనాసరళి దుష్ఫలితాన్ని ఇస్తాయని ఆ క్షణంలో ఆయనకి తెలియదు

త్రిపుర మొదటి సంవత్సరం కాలేజీ చదువు పూర్తి చేసి రెండవ సంవత్సరం ఇంటర్‌లోకి వచ్చింది

కూతురి తెలివితేటలు ఉత్సాహం చూసి డిగ్రీ చేయిద్దామనే అనుకున్నాడు



కాని విధి ఎదురు తిరిగింది చెల్లెలు దాక్షాయణి ఆరోగ్యం తీవ్రంగా దెబ్బతిని మంచం పట్టింది డాక్టర్లు పెదవి విరిచారు

ఆ పరిస్థితిలో దాక్షాయణి కన్నీళ్ళతో అన్నగారి చేతులు పట్టుకొని పోయేలోగా కొడుకు పెళ్ళి కళ్ళారా చూడాలనుందని, తన కోడలు త్రిపుర నట్టింట మహాలక్ష్మిలా తిరుగుతుంటే చూసి తృప్తిగా కళ్ళు మూస్తానని విశ్వనాథశాస్త్రిని బ్రతిమలాడింది

కూతురి చదువు కంటె మృత్యువు ఒడిలో వున్న చెల్లెలి కడసారపు కోరిక ముఖ్య మనిపించింది శాస్త్రికి

ఇంటికివచ్చి వెంటనే పంచాంగం తీసి సరిగ్గా వారం రోజుల తేడాలో త్రిపురకి- భాస్కర్‌కి పెళ్ళి నిశ్చయం చేశారు

కాని త్రిపురకి తన పెళ్ళి అంత తొందరగా ఇష్టంలేదు తిండిమానేసి అలిగి అర్భాటం చేసింది

కాని శాస్త్రి కూతురికి మృదువుగా నచ్చచెప్పాడు

అమ్మా త్రిపురా! ఈ ఒక్కసారికి నా మాట కాదనకు తల్లీ అత్తయ్య పరిస్థితి చూస్తున్నావు కదా! రోజుల్లో వుంది ఈ పెళ్ళి ఆవిడ తృప్తికోసమే కాని నువ్వు వెంటనే కాపురానికి వెళ్ళక్కర్లేదు మీ అత్తయ్యని, బావని ఆ ఊర్నించి మకాం మార్చి ఇక్కడికి తీసుకువస్తాను నీ డిగ్రీ పూర్తి అయ్యాకనే మిగతా విషయాలు అన్నాడు

ఆ మాటలు నెమ్మదిగా మృదువుగానే చెప్పినా శాసిస్తున్నట్లు వుంది ఆయన కంఠం

త్రిపుర మొగం గంటు పెట్టుకుంది

ఇంకా చిన్నతనం అని సరిపెట్టుకున్నాడు

వ్యవధి తక్కువైనా పాడి పంటలకి సిరిసంపదలకి పేరు ప్రతిష్ఠలకి లోటు లేక పోవటంతో రంగ రంగ వైభవంగా పెళ్ళి ఏర్పాట్లు మొదలయ్యాయి

మా శాస్త్రిగారి కూతురు పెళ్ళంటే మాటలా? సాక్షాత్ ఆ సీతా స్వయంవరమే తలంబ్రాలకి ముత్యాలు తెప్పిస్తున్నారా? లేక రత్నాలా? అంటు శాస్త్రిగారి ఊరి పెద్దలు పరిహాసాలు చేశారు చలోక్తిగా

చూస్తూ వుండగనే పెళ్ళి ముహూర్తం మూడు రోజుల వ్యవధిలోకి వచ్చింది

కాని -

తెల్లారితే పెళ్ళికూతుర్ని చేస్తారనగా త్రిపుర చిత్రంగా నగలతో సహా మాయం అయ్యింది

ఆమె బదులు చిన్న ఉత్తరం -

నాన్నా! నాకీ పెళ్ళి అస్సలు ఇష్టం లేదు మీకీవిషయం చాలాసార్లు చెప్పాలను కున్నాను కాని ధైర్యం చాలలేదు నేను ప్రేమించిన మన కులంకాని వ్యక్తితో దూరంగా వెళ్ళి పోతున్నాను మన్నించండి

త్రిపుర -

అంతే!

త్రిపుర నిష్క్రమణతో పెళ్ళి ఇల్లు శ్మశానం అయిపోయింది

ఆ షాక్‌కి క్షణాల్లో బి పి పెరిగి గుండె పోటు వచ్చి దాక్షాయణి చచ్చి పోయింది

లలితమ్మ చచ్చిపోలేదు కాని దాదాపు అదే స్థితిలో మతి చలించి మంచం పట్టింది

మకుటం లేని మహరాజులా వెలిగే విశ్వనాథ శాస్త్రి వంశ ప్రతిష్ఠ భళ్ళున బ్రద్దలయ్యింది

నింగి కేసి చూస్తూ నడిచే ఆయన తల పాతాళానికి ఒంగి పోయింది

కొడుకులు తమతో పట్నం వచ్చెయ్య మన్నారు

కాని శాస్త్రి ఇష్టపడ లేదు

పుట్టి పెరిగిన ఊరుని, పంట చేలని ఒదిలి వెళ్ళాలంటే అంతరాత్మ ఎదురు తిరిగింది

అయినా ఇందులో మీ తప్పేముంది శాస్త్రిగారూ! ఇప్పటి కాలం పిల్లలే అలా వున్నారు తెల్సీ తెలియని తనంలో ఆ పిల్ల చేసిన తప్పుకి మీరు మమ్మల్నందర్ని ఒదిలి పోవాల్సిన పని లేదు అని ఆత్మీయంగా ఓదార్చారు ఊరి ప్రజలు

త్రిపుర చచ్చిపోయిందని సమాధాన పడి దైవచింతనలో ఆ అశాంతిని మర్చి పోవటానికే శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు విశ్వనాద శాస్త్రి, లలితమ్మ దంపతులు

త్రిపుర వెళ్ళిపొయ్యాక లలితమ్మ ఆరోగ్యం దెబ్బతిని కంటికి బాగా మసక వచ్చి చూపు మందగించింది మతి స్థిమితం తప్పింది

ఇల్లుదాటి ఎక్కడికి పోదు ఎవరైనా ఇంటికి వచ్చినా సరిగా మాట్లాడదు యాంత్రికంగా ఇంటి పన్లు అన్ని చేసుకొని ఓ చోట కూర్చుని తనలో తను ఏదో సణుక్కుంటు వుంటుంది భర్తతో కూడా సరిగా మాట్లాడదు ఆవిడంతా ఒక లోకం అన్నట్లు వుంటుంది అప్పుడప్పుడు కొడుకులు కోడళ్ళు, వారి పిల్లలు వచ్చి వెడుతూ వుంటారు

మిగతా రోజుల్లో శాస్త్రి, లలితమ్మ ఇద్దరే ఆ లంకంత లోగిలిలో రోజులు వెళ్ళదీస్తున్నారు

సుదీర్ఘంగా ఆరు సంవత్సరాలు గడిచి పొయ్యాయి త్రిపుర క్రమంగా మరుపు తెరల్లోకి వెళ్ళి పోతూంది

కాని –

ప్రశాంతంగా వున్న కొలనులో రాయిపడి అలలు లేచినట్లు నిన్న ఉదయం జరిగిన సంఘటన తిరిగి విశ్వనాద శాస్త్రి మనసులో కలవరం రేపుతూంది

నిన్న–

సమయం ఉదయం 7 గం దాటుతూంది

విశ్వనాద శాస్త్రి పూజ ముగించుకొని ఇంక లేద్దామను కుంటుండగా సరిగ్గా ఆ సమయంలో ఇంటి ముందు–

అమ్మా అన్న బిచ్చుకత్తె కేక, ఆ కేకతో పాటే చంటిబిడ్డ ఆకలి ఏడుపు వినిపించాయి

అమ్మా అన్న ఆ సుపరిచితమైన కంఠ స్వరం వింటునే వీపు మీద ఎవరో చెళ్ళున చరిచినట్లు త్రుళ్ళిపడ్డాడు శాస్త్రి

చేతిలో జపమాల జారిక్రింద పడింది

ఆ కేక విచ్చు కత్తిలా సూటిగా ఆయన గుండెని తాకింది

మళ్ళీ అంతలోనే అమ్మా అంటు వీదిగేటు దగ్గర బిచ్చగత్తె గొంతు వినిపించింది

విశ్వనాద శాస్త్రి కడుపులో పేగు కదిలినట్లయ్యింది

గబాల్న పద్మాసనం మీంచి లేచి కిటికీ దగ్గరకి వచ్చి వీదిలోకి తొంగి చూశాడు

ఆయన గుండె ఝల్లు మంది

చింపిరి జుత్తు, చిరిగి మాసికలు కట్టిన దుస్తుల్లో మసిపాతకి కట్టిన మాణిక్యంలా వున్న ఆ ముష్టి దాన్ని చూడగానే గుండె ఒక్కక్షణం ఆగి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకో సాగింది

ఇంతలో లలితమ్మ రాత్రి మిగిలిన అన్నం పళ్ళెంలో పెట్టుకొని గేటు దగ్గరకి వెళ్ళి ఆ బిచ్చుకత్తె ఒడిలో ఎత్తి పడేసింది

ఆ ముష్టిది ఆశగా చూస్తూ ఏదో అడిగినట్లుంది, లలితమ్మ సణుక్కుంటు దాన్ని కసురుకుని లోపలికి వచ్చింది

అదంత కిటికీ రెక్క వెనక నుంచి చూస్తున్న శాస్త్రి శిలా ప్రతిమే అయ్యాడు

ఏదో పాపం కదా అని అన్నం పెడితే పిల్లకి కాసిన్ని పాలు కావాలిట నయమే పెరుగు మీగడ కూడా అడగలేదు ' 'సణుక్కుంటు వంట గదిలోకి వెళ్ళి పోయింది లలితమ్మ





ఆ బిచ్చుగత్తె మూసిన గేటు వేపు నిరాశక్తంగా చూస్తు ఆకలికి ఏడుస్తున్న చంటి బిడ్డని సముదాయిస్తు వెళ్ళలేక వెళ్ళ లేక వెనక్కి తిరిగి చూస్తు సందు మలుపు తిరగటం గమనించిన శాస్త్రికి ముచ్చెమటలు పోశాయి. అనుమానం స్థిర పడింది.

"మరుపు తెరల్లో అదృశ్యం అయిపోతున్న త్రిపుర రూపం "అమ్మా" అన్న తియ్యని ఆ గొంతు ఒక్కసారి మిరిమిట్లు గొలుపుతూ కళ్ళముందు మెరిసి మాయం అయ్యింది.

ఆ బిచ్చుగత్తె ఎవరు?

తన కూతురు త్రి....పు.... ర.... కదూ?

కదూ ఏమిటి?

త్రిపురే.

శాస్త్రి గుండె కలుక్కుమంది.

అరచేత్తో ఛాతీ మీద రాసుకుంటు పక్కనే వున్న పట్టి మంచంలో వాలి కళ్ళు మూసుకున్నాడు.

ఛత్వారం వల్ల చూపు మందగించి, మతి స్థిమితం తప్పిన తన భార్య బిచ్చుగత్తెగా వచ్చిన తన బిడ్డని గుర్తించ లేక పోవచ్చు.

కాని ఇంద్రియాలన్ని సక్రమంగా వున్న తను దాన్ని గుర్తించ లేక పోవటం ఏమిటి?

ఒంటిడు నగలతో పుత్తడి బొమ్మలా గడప దాటిన

## త్రిపాత్రాభినయం

'స్త్రీ' అనే-
ఏకాక్షర పదంలో నే
'స' కారం సత్వగుణానికీ
'ర' కారం రజో గుణానికీ
'త' కారం తమోగుణానికీ
ప్రతీకగా-
త్రిగుణాల సమ్యక్ సమ్మేళనంగా
నిలవ గిలిగిన శక్తి స్త్రీమూర్తి

—ఈతకోట సుబ్బారావు

తన కూతురు......

ఒంటి మీద చిన్న మెత్తు నగలేకుండా జీర్ణమైన వస్త్రాలతో గుప్పెడు మెతుకుల కోసం తన గుమ్మంలోకి వచ్చింది అంటే.......

జరిగింది ఏమిటో చెప్పకనే తెలుస్తుంది.

ఆ ప్రేమించిన వాడు నగలు దోచుకొని, మోజు తీర్చుకొని, బిడ్డ తల్లిని చేసి నడిరోడ్డున ఒదిలి వుంటాడు.

దిక్కు లేక చంటి బిడ్డతో చావ లేక తన గుమ్మంలోకి యాచనకి వచ్చింది.

ఆలోచిస్తున్న కొద్ది విశ్వనాధ శాస్త్రి మనసు రెండు ముక్కలు అవుతూంది.

ఒక భాగంలో కన్న బిడ్డ పట్ల మమకారం-

మరొక భాగంలో అమె తన కడుపులో రగిల్చిన చిచ్చు......

ఆ రోజు విశ్వనాధశాస్త్రికి అన్నం సయించలేదు.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు.

★ ★ ★ ★ ★

ఆ మర్నాడు కూడా అలవాటు ప్రకారం తెల్లవారు ఝామున లేచి పూజ మీద కూర్చున్నాడు.

యాంత్రికంగా పూజా కార్యక్రమం నడుస్తూంది.

జపమాల తిప్పుతున్నాడే గాని ధ్యానం కుదరటం లేదు.

జీర్ణవస్త్రాలతో ఆకలికి ఏడుస్తున్న చంటిబిడ్డని సముదాయిస్తు యాచకురాలిగా తన ఇంటి ముందుకి వచ్చిన కూతురి దీనమైన వదనమే మాటి మాటికి కళ్ళ ముందుకి వస్తూంది.

నిన్నటి లాగే ఈ రోజు కూడా పట్టెడు మెతుకుల కోసం త్రిపుర తన ఇంటికి యాచనకి వస్తుందా?

లేక వెళ్ళి పోతుందా?

ఊహుఁ......

వస్తుంది.

తనకిగా తాను ఇల్లు వదిలి వెళ్ళిన పిల్ల తిరిగి తన గుమ్మంలోకి వచ్చిందంటే చేసిన తప్పు ఏమిటో

ఎటువంటిదో తెల్సుకుని వుంటుంది.

పశ్చాత్తాపంతోనే అది తిరిగి తన గడపలోకి వచ్చింది

పశ్చాత్తాపాన్ని మించిన ప్రాయశ్చిత్తం లేదు

కాని–

ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి?

దాన్ని ఆదరించాలా?

లేక ఘొమ్మని శాసించాలా?

విశ్వనాధ శాస్త్రి గట్టిగా కళ్ళు మూసుకున్నాడు

'మనసు' అనే 'తరాజు'లో ప్రేమ –ద్వేషం పోటీ పడుతున్నాయి

ప్రతీకార జ్వాలతో గుండె భుగభుగ మంటుంది

కాని మమకారం అనే పన్నీరు ఆ జ్వాలల్ని చల్లార్చుతోంది

సకల శాస్త్ర పారంగతుడు విశ్వనాధ శాస్త్రి

పఠించని గ్రంథం లేదు

చేయని తర్కం లేదు

అందుకు ఆయన మనసు ప్రేమ వైపే మొగ్గుతూంది క్రీస్తు, బుద్ధుడు, వివేకానంద, మదర్ థెరిసా, గాంధీ వీళ్ళంత పాపుల్ని క్షమించారు అనాధల్ని ఆదుకున్నారు

తను వాళ్ళందరి కంటి గొప్పవాడు కాదుకదా?

తను వాళ్ళల్లా నడుం కట్టి లోకాన్ని ఉద్ధరించలేక పోవచ్చు

కాని పరాజిత అయి తన ఇంటిముందుకి వచ్చి చేతులు చాచిన తన కన్నబిడ్డని అందునా నిస్పృహాయురాలైన స్త్రీని ఆదరించటం తండ్రిగా తన కర్తవ్యం కాదా?

చెడిపోయిన కూతుర్ని తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాడని లోకం తనని చూసి నవ్వుతుందా?

అయినా ఇప్పుడు కొత్తగా నవ్వటానికి మాత్రం ఏముంది?

లోకానికి భయపడి దాన్ని కఠినంగా శాసించి దాన్ని వెళ్ళగొట్టినా తన మనసుకి శాంతి వుండదు

తను చచ్చి శరీరం బూడిద అయినా తన ఆత్మ అశాంతితో కాలుతూనే వుంటుంది

నిజానికి దాన్ని కన్నందుకు తండ్రిగా అసలైన బాధ్యత తనకి ఇప్పుడే మొదలయ్యింది

ఊబిలో పడ్డ మనిషికి కాస్త చేయి అందిస్తే ఆ ఊబినుంచి బయట పడతాడు లేకపోతే అందులో నే కూరుకుని పోతాడు

గతం నాస్తి:

కాని భవిష్యత్తు తన చేతుల్లోనే వుంది కదా?

బురదలో పడ్డ తన కూతురికి కాస్త చేయూత నిచ్చి పైకి లాగటంలో అనౌచిత్యం ఏముంది?

తనకి డబ్బుంది

ఒంట్లో శక్తి వుంది

భగవంతుడి మీద విశ్వాసం వుంది

చీకట్లో మగ్గుతున్న ఒక ఆడకూతురి బ్రతుక్కి వెలుగుబాట వెయ్యలేడా?

తండ్రిగా అది తన కర్తవ్యం కాదా?

మంచి – చెడు, ఉచ్చం – నీచం, పాపం – పుణ్యం శరీరానికి గాని మనసుకి కాదు

పులు కడిగిన ముత్యంలా మనసు మాలిన్యం లేనిది

తల్లి, తండ్రి, అన్నలు బ్రతికుండగ తన బిడ్డ అనాధ ఎందుకవుతుంది?

"అ మ్మా '

శాస్త్రి తృళ్ళిపడ్డాడు.

చేతిలో జపమాల జారి పళ్ళెంలో పడింది.

వెన్నుపూసలో విద్యుత్ పాకినట్లు ఆ పిలుపు శరీరంలో నరనరాన్ని మీటింది

గభాల్న పీటమీంచి లేచి వీధిలోకి వచ్చాడు

'అమ్మా' అనబోతున్న బిచ్చగత్తె వేగంగా తన వైపు వస్తున్న శాస్త్రిని చూసి భయంతో బిడ్డని గుండెకి అదుముకొని అడుగు వెనక్కి వేసింది

శాస్త్రి చిరునవ్వు నవ్వాడు

'అమ్మా! త్రిపురా! లోపలికి రా తల్లి' అంటూ చేతిలోని పంచ పాత్రలో నీళ్ళు తీసి కూతురి మీద చిలకరించాడు

ఉప్పొంగే వరద గోదారిలా కన్నీటితో త్రిపుర గభాల్న వచ్చి బిడ్డతో సహా తండ్రి కాళ్ళ మీద పడింది

విశ్వనాధ శాస్త్రి ప్రేమగా కూతురి తల మీద చెయ్యి వేశాడు

"నా న్నా నే ను న న్ను క్షమి " త్రిపుర ఏదో చెప్ప బోయింది కాని కన్నీటి తెర ఆమె మాటల్ని మింగేస్తోంది

మళ్ళీ శాస్త్రి చిరునవ్వు నవ్వాడు

"ఒద్దు తల్లి! నా కేమి చెప్పవద్దు అంతా వూహించుకోగలను ఈ ఇల్లు నీది నీ యింటి తలుపులు నీ కోసం ఎప్పుడూ తెరిచే వుంటాయి తల్లి?' అన్నాడు ఆదరంగా

నాన్నా అంది ఉద్వేగంగా త్రిపుర

దుఃఖమో, ఆనందమో తెలియని ఒక ఉప్పెన ఆమె కళ్ళనుంచి పొంగి విశ్వనాధ శాస్త్రి పాదాల్ని ప్రక్షాళితం చేసింది □





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## కోల్గేట్ రక్షణ చక్రాన్ని పొందండి!

నోటి దుర్వాసన మిమ్మల్ని నలుగురిలో ఇబ్బంది పెట్టేస్తుంది. మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా, మీ పళ్లు దృఢంగా, ఆరోగ్యంగా వుంచుకోడానికై క్రమం తప్పక కోల్గేట్‌తో బ్రష్ చేసుకోండి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే మరి!



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకొనిపోయి, దుర్వాసన కల్గించే ఆహారకణాలను, దంతక్షయాన్ని కల్గించే సూక్ష్మక్రిములను తొలగిస్తుంది.



మీ పళ్ల సందుల్లో ఇరుక్కుపోయిన ఆహారకణాల్లో దుర్వాసన, దంతక్షయం కల్గించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



క్రమం తప్పకుండా కోల్గేట్‌తో పళ్లు బ్రష్ చేసుకోవడంతో మీరు శుభ్రమైన తాజా శ్వాస, దృఢమైన, ఆరోగ్యమైన పళ్లు పొందగలరు.

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

Rediffusion/CP/5707 e TL

సుమలత సమాధానాలు

వి. ఎస్. ప్రసాదరావు, శ్రీకాళహస్తి

ప్ర: స్టంట్ సీనులలో హీరో మరియు విలన్‌లు కాస్త ఎడం ఎడంగా ఉండి పోట్లాడుకుందురని నా మిత్రుడు, దగ్గర దగ్గరుండే నిజముగా పోట్లాడుకుందురని నేను- ఘర్షణ పడుచున్నారము. మా ఇద్దరిలో ఎవరు రైటు?

జ: ఆ విషయం గురించి మీరూ, మీ మిత్రుడూ దగ్గరగా ఉండి ఘర్షణ పడుచున్నారా, లేక సినిమాల్లోకి మల్లే కాస్త దూరంలో నిలుచొని ఘర్షణ పడుతున్నారా?

టి. నారాయణరావు, సైనికపురి

ప్ర: ఆంగ్లమునకు బదులు తెలుగులోనే విజ్ఞానశాస్త్రము బోధించిన యెడల మనమూ త్వరలోనే 'ఆటంబాంబ్'లాంటిది కనిపెట్టగలమనుకుంటా, ఏమంటారు!

జ: ఆటంబాంబ్‌కు తగిన చక్కని తెలుగు పదాన్ని కనిపెట్టగలం.

జ్యోతి హేమలత, తెనాలి

ప్ర: సుమగారూ! ప్రేమ అనేది బస్సు అయితే, మరి... వివాహం-?

జ: ఆక్సిడెంటే!

ఎల్. రాజన్న, తాడిపత్రి

ప్ర : చక్కని చిత్రాలు కావాలంటూ ఘోష పెడతారు కొందరు. కాని, చక్కని చిత్రాలు వస్తే, ఆదరించరు. దీన్నిబట్టి ఏమనుకోవాలి?

జ : ఆశయం వేరు. ఆచరణ వేరు. ఆదరణ వేరు.

వి. ఎం. సుబ్బారావు, కడప

ప్ర: సినిమాలలో వివాహ సన్నివేశములందు పీటల మీది వధూ వరులు ఒకరినొకరు చూచుకుని, నవ్వుకొనడం జరుగును. కాని, వైయక్తిక జీవితమున అలా జరుగదు. ఎందులకు!

జ: ఎదురుగా మూవీ కెమేరా ఉండదు గనుక.

బి. రూపవతి, కుర్నూలు రోడ్

ప్ర : ఈ కల్తీ ఆహార పదార్థాలు కొని తినడం కన్నా – ఏ విషమో కొనితిని చస్తే మంచిదనిపిస్తోంది ఈ రోజుల్లో. మీరేమంటారు?

జ : మరి, ఆ విషం కూడా కల్తీదే అయితే?



ఎస్. లక్ష్మణ రెడ్డి, మధిర

ప్ర : రాత్రిళ్ళు అన్నం మానేసి, బియ్యం వాడకం తగ్గిస్తే, దేశసేవ చేసినట్లవుతుందా?

జ : అంతే కాదు. మీ దేహసేవ చేసినట్లు కూడా అవుతుంది.

క(రి అనూరాధ, అనంతపూర్

ప్ర : మొక్కకు వికసించిన పువ్వు ప్రకృతికి అందం. సిగలో పువ్వు స్త్రీకి అందం. దండలోని పూవు దేవుడికి అందం. మరి, రాజకీయవేత్తల మెడలో వేసే పూలమాల.....?

జ : వాళ్ల కార్లకు అందం.

ఎస్. స్వర్ణకుమారి, ద్వారపూడి

ప్ర : నాకు సినిమాలలో నటించాలని చిరకాల వాంఛ. కాని, నేను నలుగురి ఎదట తల ఎత్తుకు మాట్లాడాలంటే వల్లమాలిన సిగ్గుగా ఉంటుంది. అందువల్ల నేను సినిమాలలో నటించే యోగం లేదా?

జ : అలా నలుగురి ఎదుట సిగ్గుపడే పాత్ర ఏ చిత్రంలోనైనా ఉంటే, మీరు కరెక్ట్‌గా సరిపోతారు. □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న.........................................................................

...............................................................................

...............................................................................

పంపినవారి పేరు..........................................................

పూర్తి చిరునామా..........................................................








ఇటీవల విశాఖలో 108 కల్చరల్ ఆర్గనైజేషన్ కళాబంధు శ్రీ టి. సుబ్బరామిరెడ్డిని అభినందిస్తున్నపుడు సినీనటి శారద, శోభన్‌బాబు, క్రికెట్ కళాకారుడు అజారుద్దీన్.

## "మురళీ కృష్ణుడు"లో పరశురాం

ఆ భవంతి నలువైపులా కన్యాకుమారి (వై. విజయ) పరికించింది. "ఓహో! ఓహోహో! సముద్రం ఒడ్డున అతిథి భవనం అంటే ఇదా? అచ్చం సినిమాల్లో సారంగ మార్గంలాగా ఉంది. మనకి తగిన స్థలం ఇదే, మహాప్రభూ!" అంది.

పరశురాం (మోహన్‌బాబు) గంభీరంగా, "ఊఁ!.... నీకీ సారంగ మార్గం నచ్చుడంలో ఆశ్చర్యం లేదు, కన్యా! నువ్వే ఒక సారంగానివి కదా?" అన్నాడు.

"ఈ సారంగ మార్తాండానివి నువ్వేకదా? అవునూ– ఎందుకు అనవసరంగా ఆ పిల్ల మీద దిగులు పెట్టుకుని, సిక్కి పోతావు? అష్ట దిక్కులకు అందగాడివి. ఆడవాళ్ళు నీ కోసం బెంగపెట్టుకోవాలి గాని, నీ కెందుకు ఆ బెంగ?"

"కన్యా! దాని ఒంపులూ సొంపులూ చూసి కాదు నా బెంగ. దాని బాబు చచ్చాక గొడవల్లో పడ్డ దాని ఆస్తి దానికి తిరిగి రాబోతుంది. అది నా చెయ్యి దాటకూడదు. అదే నా బెంగ."

"ఎక్కడికని దాటి పోతుంది? అదీ దాటి పోదు. దాని ఆస్తీ దాటి పోదు. నవరాత్రులు పూర్తయ్యే నాటి రాత్రి శుభరాత్రి. ఆ రాత్రే నీకు ముహూర్తం పెట్టిస్తాను, మహాప్రభో! అదే– నీకూ, కృష్ణవేణికీ శోభనానికి ముహూర్తాలు. అలా జరిగితే, ఏ గొడవా ఉండదు. కాని, నువ్వు ఎటూ కదలకుండా ఇక్కడే ఉండి మధుపానం సేవిస్తూ, కాలక్షేపం చెయ్యాలి. బయటికి వెళ్ళ కూడదు. అంతవరకూ నీ జాతకం ప్రకారం రాహువు అయిదో ఇంటికీ– ఆరో ఇంటికీ మధ్య వున్నాడు. కేతువు ఏడో ఇంటికి ఇవతల లున్నాడు. కాబట్టి ఈ దుష్టకాలం పోయేవరకు నువ్వు ఈ ఇంట్లోనే ఉండాలి."

"అలాగలాగే. అటు రాహువు, ఇటు కేతువు– మధ్యలో నువ్వు తీతువు. నువ్వు నాకు బంగారు గుడ్లు పెట్టే బాతువు. నాకూ, నా ఇల్లాలికీ మధ్య సేతువు. నాకు పనికొచ్చే పనులు నువ్వు సేతువు. నువ్వు చెప్పినట్టే నేను చేతును," అన్నాడు పరశురాం.

ఎస్. గోపాల్‌రెడ్డి నిర్మించిన భార్గవ ఆర్ట్ ప్రొడక్షన్స్ "మురళీకృష్ణుడు" చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకుడు.

## 'పెళ్ళి చేసి చూడు''లో కమిషనర్ కాంతయ్య

హాల్లో టేబుల్‌మీద రకరకాల వయసుల అమ్మాయిల ఫోటోలున్నాయి. కమిషనర్ కాంతయ్య (వీరభద్రరావు) ఒక ఫోటోను తీసి, సుందరమ్మ (అన్నపూర్ణ), సీత (తార) రాజా (అలీ)లకు చూపిస్తూ "అహా! ఈ ఫోటో చూడండి" అన్నాడు.

"అమ్మాయి కొంచెం పెద్దదిలా అనిపిస్తోందే!" అంది సుందరమ్మ.

"అక్కడే దెబ్బ తిన్నారు. అమ్మాయి వీధి గుమ్మంలో నిలబడి– ఎండకు ఎండి, వానకు నాని, చలికి వణికి, పెళ్ళికొడుక్కోసం ఎదురు చూసి చూసి అట్లా కనిపిస్తూందే తప్ప– వయసు తక్కువే, ఇదిగో ఈ ఫోటో చూడండి," అంటూ మరో ఫోటోను చూపాడు కాంతయ్య.

"అదేమిటి, అమ్మాయి నల్ల కళ్ళజోడు పెట్టుకుంది?" అడిగింది సుందరి

"అమ్మాయికి ఒక కన్ను మెల్ల."

"ఆ రెండో కన్నన్నా సరిగా ఉందా?"

"అసలు రెండో కన్నే లేదు. మెల్ల కన్నుకి యాభై వేలు, గుడ్డి కన్నుకి లక్ష వెరసి లక్షా యాభైవేలు కట్నం... ఇంకో ఫోటో చూడండి."

"ఇదేమిటి ఈ అమ్మాయిని కూర్చోబెట్టి ఫోటో తీశారు?"

"ఈ అమ్మాయికి ఒక కాలు పొట్టి. అందుకే తీశారు కూర్చోబెట్టి."

"ఇవన్నీ కాదుగాని, కొంచెం అందంగా ఉండే అమ్మాయిలు– కట్నం ఎక్కువగా ఇచ్చే సంబంధాలు చెప్పండి."

"కట్నం రేటు పెరుగుతున్నకొద్దీ అమ్మాయిల నాణ్యం తగ్గుతూ పోతుంది," అన్నాడు కమీషనర్ కాంతయ్య.

రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో భీమవరపు బుచ్చిరెడ్డి సమర్పించే కౌసల్యా పిక్చర్స్ "పెళ్ళిచేసి చూడు" చిత్రానికి బి. కౌసల్య నిర్మాత. ☐

"స్వర్ణ కమలం"లో శ్రీలక్ష్మి, సాక్షి రంగారావు



# ను సింథాల్ వాడతాను




**శరీరం గురించిన ఆత్మవిశ్వాసం వినోద్ కైవసం - సింథాల్‌తో!**

# బదిలీ అయిన శ్రీమతి కిరణ్ బేడీ

దేశంలోనే మొట్ట మొదటి మహిళా ఐ. పి. ఎస్. అధికారి శ్రీమతి కిరణ్ బేడి తరచుగా వార్తలలో కనిపించే వ్యక్తి. ఢిల్లీలో డి. సి. పి. (ఉత్తరం)గా ఉన్న ఆమె ఒక న్యాయవాదిని అరెస్టు చేసి చేతులకి బేడీలు వేశారన్న సంఘటనపై ఆందోళన జరుపుతున్న న్యాయ



వాదులపై తీస్ హజారి కోర్టుల ఆవరణలో ఉన్న ఆమె కార్యాలయం బయట లాఠీఛార్జి జరిపించారన్న ఆరోపణపై న్యాయవాదులు చేసిన సమ్మె ఫలితంగా రెండు వారాలపాటు సుప్రీం కోర్టులో కూడా పని స్తంభించి పోయింది. అనంతరం ఫిబ్రవరి 17న తీస్ హజారీకోర్టుల ఆవరణలో పల నిరాహార దీక్ష చేస్తున్న లాయర్లపై దాదాపు 2, 3 వేల మంది నుండి జనం విరుచుకుపడి విధ్వంసకాండ జరిపారు. దీని పట్ల మరీ ఆగ్రహం చెందిన న్యాయవాదులు ఒక విచారణ సంఘాన్ని నియమించాలని, బాధ్యులైన పోలీసు అధికారులపై చర్య తీసుకోవాలని పట్టు పట్టారు. ఫలితంగా ఫిబ్రవరి 23న ఢిల్లీ పాలక వ్యవస్థ ఢిల్లీ హైకోర్టుకి చెందిన ఇద్దరు న్యాయమూర్తులు శ్రీ ఎన్. ఎన్. గోస్వామి, శ్రీ డి. పి. వాధ్వాల నాయకత్వాన ఒక విచారణ సంఘాన్ని ఏర్పాటు చేసి న్యాయ వాదుల సమ్మెకి దారి తీసిన పరిస్థితులని కూలంకషంగా పరిశీలించి నివేదికని సమర్పించటానికి అధికారాల నిచ్చింది. గోస్వామి – వాధ్వా సంఘం సమర్పించిన మధ్యంతర నివేదిక ఫలితంగా దేశీయాంగ శాఖ శ్రీమతి కిరణ్ బేడిని బదిలీ చేస్తూ ఉత్తర్వులని జారీ చేసింది. తమ 16 ఏళ్ల సర్వీసులో ఇటువంటి అనుభవాన్ని చవిచూడటం ఇదే మొదటి సారి. 1972లో ఐ. పి. ఎస్. అధికారిగా చేరిన శ్రీమతి కిరణ్ బేడి 1981 అక్టోబర్‌లో ఢిల్లీ ట్రాఫిక్ డి. సి. పి. గా నియమింప బడ్డారు. అప్పటి నుంచే ఆమె వార్తల్లో చోటు చేసుకోవటం ప్రారంభించారు. ట్రాఫిక్ నిబంధనలు పాటించని వారి పట్ల నిష్పక్షపాతంగా సంచలనం సృష్టించారు. ఆ తర్వాత కొద్దికాలానికే ఆమె గోవా పోలీసు సూపరింటెండెంట్‌గా బదిలీ అయినారు. 1985లో తిరిగి డి. సి. పి. (హెడ్ క్వార్టర్స్) గా ఢిల్లీ వచ్చారు. కొన్ని నెలలోనే చివరిదిగా డి. సి. పి. (ఉత్తరం) గా నియమింప బడ్డారు......

# చచ్చి బతికిన మనిషి

భోపాల్ విషవాయు దుర్ఘటనలో గ్యార్సీలాల్ పునర్జన్మని ఎత్తాడంటే అందులో అతిశయోక్తి లేదనే చెప్పాల్సి ఉంటుంది. ఆ నాడు ఆ విషవాయువు తాకిడికి తీవ్రంగా గురైన రైచీభోలా ప్రాంతంలోనే అతని నివాసం. ఆ ప్రమాదం నుండి తప్పించుకోవటానికి ప్రాణాలు అరచేత పట్టుకుని అతను రైలు పట్టాల వెంబడి పరిగెత్తడం ప్రారంభించాడట. అలా పరిగెత్తటంతో వచ్చిన అలసట వల్ల కొంత దూరం వెళ్లిన తర్వాత అతను కుప్పకూలి పోయాడు. ఆ మర్నాడు సహాయ కార్యక్రమాల కోసం నియమింపబడిన సైనికులు అతని 'శరీరాన్ని' ఆస్పత్రి శవాల గదికి



తరలించారు. ఆ తర్వాత 6 రోజులకి స్పృహలోకి వచ్చిన గ్యార్సీలాల్ అనాథ శవాల మధ్య పడి ఉన్నట్లు తెలుసుకున్నాడు. దురదృష్టవశాత్తు ఆ గది ఆస్పత్రి మూడో అంతస్తులో ఒక మూల ఉండటం వల్ల అతని ఆక్రందనలు ఎవరికీ వినిపించలేదు. అతని అదృష్టవశాన 10 వ రోజున ఒక కాపలాదారు ఆ గది తలుపు తెరవటంతో అతనికి బయటపడే అవకాశం లభించింది. ఆ నాలుగు రోజులూ గ్యార్సీలాల్ కేవలం నీళ్లు తాగుతూనే బ్రతికి ఉన్నాడట. హఠాత్తుగా అక్కడి నుంచి బయట పడిన అతను తన ఇంటికి వెళితే దయ్యాన్ని చూసినట్లు భయపడ్డారట అతని కుటుంబం ఎందుకంటే వారప్పటికే అతనికి నిర్వర్తించవలసిన అంతిమ సంస్కారాలన్నిటినీ పూర్తి చేసారట. తాను చచ్చి బతికిన వైనాన్ని అతనే వివరించాడట...

# ఆరోపణలెన్ని ఉన్నా పదవిపదిలం!

ఒరిస్సా ముఖ్యమంత్రి జె. బి. పట్నాయక్ ఎన్నో అవినీతి ఆరోపణలు, అసహజమైన సెక్స్ కార్యకలాపాలలో పాల్గొన్నారన్న ఆరోపణలు, ముఖ్యమైన పదవులలో బంధువులని నియమించి కుటుంబ పాలన సాగిస్తున్నారన్న ఆరోపణలు ఎన్ని ఉన్నప్పటికీ ఆయన ఇంకా పదవిలో కొనసాగటం అందరికీ ఆశ్చర్యం కలిగిస్తున్న విషయం. ఇంతవరకూ, గత 28 ఏళ్లుగా ఒరిస్సాని పరిపాలించిన 13 మంది ముఖ్యమంత్రులలో ఏడేళ్లపాటు ఆ పదవిలో ఉండి రికార్డు సృష్టించారు. ఆ రాష్ట్రం ఘోరమైన కరువుకి గురైంది. అసమ్మతివర్గం బెడద సంగతి చెప్ప నక్కర్లేదు. ఒకసారైతే 117 మంది కాంగ్రెసు (ఐ) శాసన సభ్యులలో 71 మంది ఆయనకి ఎదురు తిరిగారు. అయితే వారిలో కొందరికి పారిశ్రామిక వాడలో స్థలాలు, లైసెన్సులు, కార్లు కూడా ఇచ్చి మళ్లీ తమ వైపు తిప్పుకున్నారు. ఫలితంగా ఆ రాష్ట్రంలో ముఖ్యమంత్రిగా ఎక్కువకాలం అధికారంలో ఉన్న ఘనత ఆయనకే దక్కింది.....



సీరియల్

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## తల్లి అనుమానం- పిల్లకు కోపం:-

**ఆ** రోజున తన సేవింగ్స్ ఎకౌంట్‌లో పాతికవేలూ ఎవరో జమకట్టిన సంఘటన తరవాత శ్రీవిద్య మనస్సు పరి పరి విధాలుగా ఆలోచనలో మునిగిపోయింది అంత డబ్బు ఎవరు ఎందుకు తన ఎకౌంట్‌లో జమకట్టారో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు ఆ సంగతి తల్లికి కూడా చెప్పనే లేదు ఆ రాత్రి తన ఆలోచనలకు, తన మనస్సుకు తనే సమాధానం చెప్పుకున్నది

ఆత్మ, అంతరాత్మల వాగ్యుద్ధం ఎట్లా ఉంటుందోననే నిర్ణయానికి వచ్చి కొన్ని ప్రశ్నల్ని తనే వేసుకున్నది

ప్రశ్న:- పాతిక వేలూ జమకట్టింది ఆడా, మగా?

సమాధానం-- ఒక పరాయి ఆడపిల్లకు అన్ని వేలు ఏ స్త్రీ కూడా చెప్పకుండా ఇవ్వదు. మగవాడే కావచ్చు

ప్రశ్న:- అంతటి అభిమానం ఎందుకో?

సమాధానం.- నన్నింత వరకూ ప్రేమించిన వారెవరూ లేరు ఈ బీద పిల్లని ఎవరు ప్రేమిస్తారు ఒకవేళ ప్రేమించినా గాంధర్వ వివాహం అన్నారు గానీ, గాంధర్వ ప్రేమ అనలేదే ప్రేమ కాక టీజింగ్ అయితే రోడ్ సైడ్ రోమియోలకు అంత డబ్బు ఉండదు నన్ను వంచించి అనుభవించటానికి ఎవరో డబ్బుకు కేర్ చెయ్యనివాడు వేసిన ఎర

ప్రశ్న - ఒక వేళ విరాళాలు వసూలు చేస్తున్నాడు కనుక అన్నయ్య జగదీష్ జమచేసి ఉంటాడా?

సమాధానం - మాట పట్టింపు, అభిమానం వల్ల దూరమైన అన్నయ్య ప్రయోజకుడయితే, ఇంటికి వచ్చి సహాయం చేస్తాడు గాని ఇట్లా డొంక తిరుగుడుగా ప్రవర్తించడు అయినా ఒక లక్ష్యంతో ఒక సంస్థనూ, పార్టీనీ స్థాపించిన అన్నయ్య డబ్బును ఇట్లా కాజేసేటంత నీచానికి దిగడు నన్ను కాంక్షించిన వాడే ఈ పని చేశాడు

ప్రశ్న - ఆ డబ్బును వాడుకుంటావా?

సమాధానం - ఎవరో తేలేటంత వరకూ ఆ డబ్బు వాడుకోను

ప్రశ్న - అజ్ఞాత ప్రేమికుడో, నిన్ను అనుభవించదల్చుకున్నవాడో ఎదురయితే ఏం చేస్తావు?

సమాధానం - (మనస్సులో నవ్వుకున్నది కళ్ళు మూసుకున్నది స్పష్టమయిన భావం కలుగలేదు)

ప్రశ్న - ప్రేమ అనంగానే కళ్ళు మూసుకుని నవ్వుకున్నావ్. ప్రేమ అనే మాటే నీకు అంత తియ్యగా ఉంటే, ప్రేమించినవాడు ఎదురయితే ఇక ఈ ఆత్మ మాట వినవేమో?

సమాధానం ప్రేమ అనేది నిజమయితే నన్ను ప్రేమిస్తున్నవాడు ఎట్లా ఉంటే బావుంటుందో నేనే రూపకల్పన చేసుకుంటున్నాను పంచదార మాదిరే ప్రేమ కూడా స్వీట్‌గా ఉంటుంది కాని రెండు మూడు చెంచాలకన్నా ఎక్కువ తినలేం రూపాంతరం చెంది లడ్డూ, మైసూర్‌పాక్, జిలేబీ, బాదుషా ఇట్లా ఈ రూపాల్లో అయితే ఆ పంచదార తీపిని తిని ఇంకా ఆనందిస్తాం ఈ ప్రేమ తీపి కూడా అంతే-

ప్రశ్న - ఈ స్వీట్ లౌకు రూపాంతరం?

సమాధానం.- పెళ్ళి కన్నెపిల్ల జీవితంలో ప్రప్రథమ కోరిక అదే కద. అంతకన్న మరేముంటుంది-

ప్రశ్న - వాడు నిన్ను అనుభవించటానికి కోరుకున్న వాడేగాని, ప్రేమించిన వాడు కాకపోతే?

సమాధానం:- ఎటువంటి పరిస్థితుల్లోనూ లొంగేది లేదు ఆ డబ్బు విత్‌డ్రా చేసి అతని ముఖాన విసిరికొడతాను

ప్రశ్న - తనతో నీకు సంబంధం ఉన్నది ఆసమయంలో తనకు డబ్బు కావాలని అడిగింది ఇల్లు కట్టుకోటానికి సవ యంగా పాతికవేలు అడిగింది తన

**జరిగిన కథ–14:** విమల వింత ప్రవర్తనకు షాక్ తింటుంది శ్రీవిద్య జగదీష్‌ను గురించి హేళనగా మాట్లాడిన అభిలాష్‌కు ఆమె సరైన సమాధానం చెపుతుంది శ్రీవిద్య తల్లితో కూడా విమల వాళ్ల ఇల్లు విడిచి వచ్చి వాసు, రుక్మిణిల ఇంట్లో ఒక గదిలో చేరింది శ్రీవిద్య తన ఎకౌంట్‌లో ఎ. ఎ. బి బి స స డి డి హేమంత్ అనే ఆయన పాతిక వేల రూపాయలు జమ కట్టబడి ఉండటం గమనించి అతను తమ వాలేరని బ్యాంక్ వారికి చెప్పింది సావిత్రి జగదీష్ పర్ణశాలకి వచ్చి వెళ్ళింది అభిలాష్ జీవితాన్ని పూలబాటగా చేయాలని కంకణం కట్టుకొంది సత్యభామ

యౌవ్వనాన్ని నాకు అర్పించింది కనక మోజుకొద్దీ ఇచ్చాను. చేతికి డబ్బు ఇవ్వక్కర్లేదు. ఎకౌంట్‌లో జమకట్టమంటే జమకట్టాను, అంటాడు అప్పుడు?

సమాధానం:- పోలీస్ రిపోర్ట్ ఇచ్చి దర్యాప్తు చెయ్యమంటాను.

ప్రశ్న:- ఏ సంబంధం లేని వాడు అనవసరంగా, పాతిక వేలు ఎందుకు జమ చేస్తాడు అనేదే పోలీసుల ప్రశ్న. ఏం సమాధానం చెప్తావ్, ఏ ఆడపిల్ల బ్యాంక్ ఎకౌంట్‌లోనూ ఏ మగవాడూ ఇట్లా ఇంత డబ్బు జమ చెయ్యడు. నువ్వీ పరిస్థితిలో చిక్కుకున్నావ్ గనక, అతనికీ నీకూ సంబంధం ఉన్నది, నీ సమాధానం?

సమాధానం:- నీ ప్రశ్నలకు నాకు పిచ్చెక్కుతున్నది. ఆ ఉపాయం నువ్వే చెప్పాలి.

ప్రశ్న:- ఈ పరిస్థితిని బట్టి నువ్వా అజ్ఞాత వ్యక్తిని ప్రేమించక తప్పదు. మర్యాదస్తుడే అయితే అతని కామాగ్నికి ఆహుతి కాక తప్పదు. నీ జీవితానికి ఇదొక పరీక్ష, ఏం చేస్తావ్?

సమాధానం:- చదువూ, సంస్కారమూ, అందమూ, మంచి ఉద్యోగమూ, పరస్పర ఆకర్షణ, అవగాహన, సద్గుణ సంపన్నుడూ అయితే ప్రేమిస్తాను. దుష్టుడే అయితే అతని కామాగ్నికి ఆహుతి కాను. ఆత్మహత్య చేసుకొని ఒక కన్యగా, శీలానికి విలువ ఇచ్చే యువతిగా పేరు తెచ్చుకుంటాను.

ప్రశ్న:- అనుకోని డబ్బు అకస్మాత్తుగా నీకు చేరేసరికి ఇంటర్మీడియెట్ చదివే వయస్సులోనే నువ్వు ప్రేమ వైపు మొగ్గు చూపి ప్రయాణం చేస్తున్నావ్. అంటే నీలో సెక్సు భావాలు ఉత్పన్నమయినట్లేనని నువ్వే అంటున్నావ్. ప్రేమించి మనస్సు దోచుకున్నవాడు కాక, కామించి శీలాన్ని దోచుకొనేవాడయితే ఆత్మహత్య చేసుకుంటానన్నావ్. ఆత్మహత్య వల్ల ఇంకా అల్లరిపాలవుతావ్. డబ్బుకి ఆశపడి శరీరాన్ని అమ్ముకున్నది. తీరా కడుపు అయ్యేసరికి భరించలేక ఆత్మహత్య చేసుకున్నదని చాలా పెద్ద అపవాదు వేస్తారు. ఈ అవమానం భరించలేక మీ అమ్మ కూడా గుండె పగిలి చనిపోవడమో, ఆత్మహత్య చేసుకోవటమో జరుగుతుంది, అప్పుడు?

సమాధానం: నీ ఆర్గ్యుమెంట్సుకు మతిపోతున్నది. నేనేం చెయ్యాలి.

ప్రశ్న:- ప్రేమిస్తే ప్రేమించు. పెళ్ళి చేసుకుంటానంటే అంతకన్న కావాల్సింది లేదు. కామిస్తే అతని కోరిక తీర్చు: నీ ఆర్థిక పరిస్థితికి పాతిక వేలు వదులుకోవటం మూర్ఖత్వమే అవుతుంది. అతను కోరింది ఇవ్వు. కాదనకు, ప్లీజ్, ప్రేమకు మనస్సు, వయస్సు, శరీరం కావాలి. కామానికి శరీరం చాలు. మనస్సుకూ, వయస్సుకూ పవిత్రతనూ, గౌరవాన్నీ ఇచ్చి శరీరాన్ని అర్పించు. అనుభవం కొంతసేపేగా. ఆలోచించు. ఒప్పుకున్నట్లేనా?

సమాధానం:- సరే. ఇంతకీ ఎవరతను?

ప్రశ్న:- మగాడు. మనిద్దరం వెతికితే దొరక్కపోడు. ఇక నిద్రపో.

కళ్ళు మూసుకున్నది శ్రీవిద్య. నిద్రపట్టలేదు.

భళ్ళున తెల్లవారింది. నిద్ర లేకపోవటంతో కళ్ళు ఎర్రబడినయ్యి. ముఖంలో అలసట, బద్ధకం వళ్ళు విరుపులు. కూతురు పరిస్థితి చూసి తల్లి బాధ పడింది. ఎంత అడిగినా చెప్పనేలేదు.

"కన్నతల్లి దగ్గర కూడా అంత రహస్యంగా దాచవలసిన ఆ విషయం ఏమిటే" కోపంతో, నిస్సహాయతతో అడిగింది.

"రహస్యం కాదు. డబ్బు లేదు. డబ్బు సంపాదించే మార్గం ఆలోచిస్తున్నాను. ప్రేమిస్తే బావుంటుందేమోనని ఆలోచిస్తున్నాను."

"కొంప ముంచావుకదుటే దౌర్భాగ్యురాలా" దవడ వాయించబోయి ఆ పని చెయ్యలేదు.

"ఏం ప్రేమిస్తే? నేను కొంప ముంచేటంత దౌర్భాగ్యురాల్ని అయినప్పుడు.



నాకు మంచి సంబంధం చూసి పెళ్ళిందుకు చెయ్యవు పవిత్రత, శీలం అంటూ ఇంట్లో కూర్చుంటే నాకు పెళ్ళెట్లా అవుతుంది ఎదిగిన కూతురు ప్రేమించటమే నేరం అయితే, తప్పు, అగౌరవం అనే ముసుగులో కూర్చుని అసమర్థురాలుగా, నిస్సహాయురాలిగా నువ్వు మాట్లాట్టం అంతకన్న నేరం"

తెచ్చిపెట్టుకున్న కోపంతో అన్నది శ్రీవిద్య ఈసారి జగదాంబ సహనాన్ని పోగొట్టుకున్నది జుట్టు పుచ్చుకుని వంగదీసి వీపుమీద నాలుగు దెబ్బలు వేసింది దవడలు వాయించింది 'చేసిన తప్పుని ఒప్పుకోకపోగా, నువ్వు కాలు జారటం నా తప్పంటావే, నా కడుపున మీ రిద్దరూ చెడబుట్టారే, బ్రష్టురాలా, వాడు సంఘాన్ని ఉద్ధరిస్తానని అట్లా కొంప ముంచాడు, నువ్వు వయస్సు మదంతో నా కడుపులో చిచ్చుపెట్టావ్, నాకు చావు రాకుండా ఉన్నది" ఆవిడ తల బాదుకుని ఏడవసాగింది

ఈ మాన మర్యాదల యుద్ధంలో ఆ తల్లీ, కూతురూ అలిసి పోయారు అరగంటసేపు గాలి వాన పూర్తిగా తగ్గినంత ప్రశాంతత ఈ గాలివాన ప్రారంభాన్నీ, ప్రశాంతతనీ చూస్తూనే ఉన్నది రుక్మిణి

కాసేపయాక వచ్చింది

జగదాంబగారూ

కళ్ళు తుడ్చుకుని లేచి కూర్చున్నదావిడ

"వయసొచ్చిన కన్నకూతురు తన కనుసన్నలలో గౌరవప్రదంగా, ఏ అవాంతరం, అపనిందా రాకుండా జీవించాలని ప్రతి తల్లీ కోరుకోవటం సహజం అట్లాగే కన్నెపిల్ల తన భవిష్యత్తుని గురించి బంగారు కలలు కనటం అంతకన్న సహజం, అవసరం ఇంతవరకూ మీ ఇద్దరిలో తప్పులేదు కాని అభిప్రాయబేధాలే మీ మనస్సులో అనుమానపు భావాల్ని అకారణంగా ప్రవేశపెట్టాయి. శ్రీవిద్య ప్రేమ విషయం నేను తెల్సుకుంటాను" అన్నది రుక్మిణి

ఆ మధ్యాహ్నం భోజనాలయాక శ్రీవిద్యను పిల్చింది రుక్మిణి వాసు వ్యాపారం పనిమీద రాజమండ్రి వెళ్ళాడు రెండు రోజుల వరకూ రాడు శ్రీవిద్య ముఖం జేవురించింది నిరాశాభావాన్ని ముఖానికి రాచుకున్నది

"మై డియర్ శ్రీవిద్య, మీ అమ్మగారి అనుమానం నిజం కాదని నాకు తెల్సు, అసలు విషయం?" ప్రశ్నార్థకంగా చూసింది మూడేళ్ళ పసివాడు బిస్కట్లు తింటూ ఆడుకొంటున్నాడు పేపర్ పనివాళ్ళు నాలుగ్గంటల వరకూ రారు ఎకౌంట్స్ సాయంత్రం రద్దామనుకున్నది

"నా పాస్ బుక్‌లో " అన్నది శ్రీవిద్య.

"డబ్బు లేదా, ట్యూషన్ ఫీజులు రాగానే క్రెడిట్ చెయ్యి కావాలంటే ఒక వంద నేనిస్తాను" అన్నది రుక్మిణి ఆ డబ్బు సంగతి ఈవిడకు తెలియదనే నిర్ణయానికి వచ్చింది శ్రీవిద్య




"నా వయస్సు పద్దెనిమిది, ఈ సంవత్సరంతో ఇంటర్ అయిపోతుంది మహారాణిగారయినా, మాతంగ కన్య పూరి గుడిసెలో కాపరం చేసినా రెండు వందల ఎనభై రోజులూ పిండాన్ని కడుపులో దాచుకోవటం తప్పదు సుఖప్రసూతో, సూచన్‌తో సరిపోతుందో, సిజేరియనో పురిటి బల్ల ఎక్కితేనేగాని ఆ కడుపుతో ఉన్న భాగ్యశాలికీ తెలీదు పెద్దవాళ్ళు చూసి చేసిన సంబంధం సుఖప్రసవం లాంటిదయితే, ప్రేమ పెళ్ళిళ్ళు సిజేరియన్‌లాంటివి" ఏదో చెప్పాలనుకొని తల వంచుకున్నది గడ్డం పుచ్చుకుని తల ఎత్తింది రుక్మిణి

"పెళ్ళికాని పిల్ల సూచెన్, సిజేరియన్‌ని గురించి మాట్లాడుతుంటే అనుమానపడుతున్నారా, ఆశ్చర్యపడుతున్నారా" మనస్సులో ఏదో చెప్పాలనే తహతహ

"ఏ భావంలేదు ప్రతి విషయం అనుభవపూర్వకంగానే చెప్పాలంటే మనిషి జీవితం పాతికేళ్ళకే అంతమైపోతుంది. ఊహామాత్రపు అభిప్రాయాలే మనిషికి ఊపిరి"

"సినిమాకు వెడతాం. పిక్చరంతా ఒకటే, కాని మన ఆర్థిక పరిస్థితిని బట్టి టికెట్ కొంటాం ఎక్కువ టికెట్‌కి ఎక్కువ సినిమా, తక్కువ టికెట్‌కి ఇంటర్వెల్‌తో నే పంపించటం జరగదు"

నవ్వింది రుక్మిణి స్లీవ్‌లెస్ మీద పైట పంకాగాలికి జారిపోతుంటే మరోసారి సర్దుకున్నది బాయి తాగుతానంటూ గొడవ చెయ్యసాగాడు వళ్ళో కూర్చుని ఆనంద్

"బాయి ఎక్కడ తాగాలి" కోపంతో చూస్తూ అన్నది రుక్మిణి

"ఇక్కడా" అన్నాడు అక్కడ చూపిస్తూ.

"రోజూ అక్కడే తాగుతున్నావా" ఉరిమి చూచి పైట సవరించుకున్నది

తల్లి వళ్ళో నుంచి దిగి పాలసీసా టేబుల్ మీద ఉన్నది మెల్లిగా తెచ్చి ఇచ్చాడు "కలిపి ఇస్తాను ఉండు" పాలు కలిపి సీసాలో పోసి పీక సరిచేసి ఇచ్చింది, వాడు తాగుతూ కూర్చున్నాడు

"శ్రీవిద్యా, సినిమా ఒకటే అయినా కొనే టికెట్‌ని బట్టి, ఆ క్లాసుని బట్టి మనకూ, సినిమా తెరకూ ఉన్న దూరంలో తేడా ఉంటుంది అట్లాగే కూర్చునే సీట్లలో కూడా తేడా కనిపిస్తుంది సినిమాలో చూస్తున్న సీన్లు ఒకటే అయినా, ఎవరి ఆలోచనాసరళి, అభిప్రాయసరళి వాళ్ళది వాడు ఆర్నెల్ల వరకూ నా దగ్గర పాలు తాగాడు ఆ తర్వాత పోతపాలు వాడు తాగుతున్నాడు కదా అని నేను పాలిస్తూ కూర్చుంటే నా శరీర తత్వంలోనూ మార్పు రావచ్చు నేను పసివాడికి నా దగ్గర పాలు మాన్పించినంత మాత్రాన నాలో మాతృప్రేమ నశించిపోయిందని వ్యాఖ్యానించటం తప్పు నేనే కాదు, ఏ తల్లి విషయంలోనయినా అంతే నీ భావాలకు నేను దగ్గరగానే వస్తున్నాను. విషయం చెప్తే మంచిది"

అది చెయ్యి చూసుకుంటూ కూర్చున్నది శ్రీవిద్య

"నేను సినిమా ఉపమానం, ప్రసవం ఉపమానం ఎందుకు చెప్పానంటే మనిషి అవసరాలూ, జీవితం, ఆర్థిక పరిస్థితిని బట్టి ఉన్నా, కోరిక, అభిరుచీ ఈ రెండూ కూడా ఆర్థిక పరిస్థితిని అర్థం చేసుకోవు నా కొక క్లాస్ వన్ గజిటెడ్ ఆఫీసర్ భర్తగా లభిస్తే బాగుండుననే కోరిక ఉన్నది కోరటానికి డబ్బు అక్కర్లేదు తీరటానికి డబ్బు కావాలి కన్నవాళ్ళు గొప్ప సంబంధం తీసుకు రాలేదని ప్రతి బీద ఇంటి ఆడపిల్ల కోరికను చంపుకుని మాచకమ్మలా జీవించలేదు కద, ఈ రోజుల్లో పుట్టించకూడదు అని చెప్పే హక్కున్నది గాని పుట్టిన వారిని చంపమని చెప్పేహక్కులేదు. సహజంగా మరణం ఆసన్నమయ్యేవరకూ జీవించవలసిన హక్కు అందరికీ ఉన్నది. వయసొచ్చిన ఆడపిల్ల గమ్యం పెళ్ళి కోరుకున్న సంబంధం కోసం సవ్యమయిన దారిలో నడవడం తప్పుకాదు"

"కరెక్ట్"



# రచయిత జవాబులు

ఎ. సురేష్‌కుమార్, ఎల్.బి. నగర్, హైదరాబాద్

ప్ర :మీ రచనల్లో సహజత్వం ఎక్కువగా ఉంటుంది. ఈ రాసే టెక్నిక్ ఎక్కడ నేర్చుకున్నారు?

(2) బంధాలూ, అనుబంధాలూ పోయి ఉన్నదాంట్లో తృప్తిపడే రోజులు వస్తాయా?

జ : (1) జీవితం నేర్పిన పాఠాలు, కొంత వయస్సు వచ్చాక కలిగే మానసిక పరిణితీ నా రచనల్లోని సహజత్వానికి కారణం.

(2) ఉన్నదాంట్లో తృప్తిపడే రోజులు ఇకరావు. ఈ రోజుల్లో నెసిసిటీస్‌కన్న, లగ్జరీస్‌కి ఎక్కువ కర్చు చేస్తున్నాం.

ఎ. స్వప్న, అయిజ (మహబూబ్‌నగర్)

ప్ర :తోటి రచయితలు ఎదగటాన్ని ఓర్వలేక, వారిని మించి పోవాలని, అనుభవం లేనివి వ్రాసి, ఉన్న ఇమేజ్‌ని పోగొట్టుకుంటున్న కొందరు రచయితలున్న ఈ రాష్ట్రంలో ఒక రచయితగా 'ఆడపిల్లలు- అమభవాలు' కళ్ళకు కట్టినట్టు రాశానని మీరు అనుకుంటున్నారా?

జ : ఈ నవల సాంతం చదివేక నేను ఎంత వరకూ కృతకృత్యుణ్ణి అయానో పాఠకులు చెప్పాలి.

షేక్ సుభాని, బాపట్ల

ప్ర : (1) నాతిని రాతిగా చూసే వాళ్ళమీద మీ అభిప్రాయం?

(2) మీరు ఈ నవల ద్వారా సమాజానికి ఏం ఇవ్వాలనుకుంటున్నారు?

జ : (1) ఈ రోజుల్లో రాతులుగా ఉంటే నాతులు ఎవరూలేరు. ఏ మగవాడయినా అట్లా చూసేవాడుంటే వాడు రాతికన్న హీనుడు.

(2) నవల పూర్తిగా చదివేక ఏం పుచ్చుకుంటారో మీరే చెప్తారు.

## ఉత్తమ ప్రశ్న

సి. హెచ్. కృష్ణమోహన్, కొత్తగూడెం

ప్ర : కత్తికన్న కలం గొప్పదంటారు. కలంపోటుతో సమాజాన్ని మార్చవచ్చా? దానికి కలం ఎంత వరకూ దోహద పడుతుంది?

జ: కత్తికన్న కలం గొప్పదనే మాట వాస్తవం, ఎటొచ్చీ ఆ కలంపోటు సామాజిక పరిస్థితుల్ని గమనించి, సమాజాన్ని కుళ్ళు సంస్కారపు ఊబిలో నుంచీ, పైకితీసి, సన్మార్గంవైపు నడిపించే తీరులో ఉండాలి. కుయుక్తులూ, ప్రజల్ని రెచ్చగొట్టడం, వారి మనోభావాల్ని మరోదారి మళ్ళించటం లాంటి కలం పోట్లయితే, అవి బుర్రకు పట్టించుకున్న వారికి పాట్లుతప్పవు.

---

పవిత్ర, కొత్తగూడెం

ప్ర : అసలు మీకు ఈ రంగంలో ప్రోత్సాహం ఇచ్చింది ఎవరు?

జ : కీ. శే. శ్రీ భాసా సుబ్బారావుగారు, ఆనాటి 'స్వతంత్ర' వారపత్రిక సంపాదకులు.

'లవర్', కొత్తగూడెం

ప్ర :(1) సామాజిక స్పృహ రచయితలకు మాత్రమే ఉంటుందా? అసలు సామాజిక స్పృహ అంటే ఏమిటి?

(2) చాలామంది రచయితలు మొదటి స్థానం కోసం పోట్లాడుకుంటారెందుకు?

జ : సామాజిక స్పృహ రచయితకూ, పాఠకులకూ ఇద్దరికీ ఉండాలి, ఈ సామాజిక స్పృహకు నిర్వచనాన్ని ఒక్కో రచయిత తన అభిప్రాయాల్నిబట్టి ఒక్కో విధంగా అన్వయించుకుంటున్నారు.

సమాజంలోని స్థితిగతుల్నీ, వ్యక్తుల జీవితాల్లో ఎదుర్కొంటున్న పరిస్థితుల్నీ ఆకళింపు చేసుకుని, బాధ్యతాయుతంగా, ఆయా సమస్యల్ని తమతమ రచనల్లో ప్రతిబింబింప చేసి, ఆ రచనల ద్వారా సరయిన పరిష్కారాన్ని సూచించటం అనేది, సాహితీ పరమైన సామాజిక స్పృహ.

(2)అదొక నవలా సాహిత్య బల ప్రదర్శన.

---

ఈ వారం ఉత్తమ ప్రశ్నని పంపిన శ్రీ సి. హెచ్. కృష్ణమోహన్ (కొత్తగూడెం) గారికి రచయిత హరికిషన్ రాసిన 'రాయిలాంటి ఆడది' నవలని బహుమతిగా పంపటం జరిగింది.

---

"నేను ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. ఇందులో తప్పులేదు కదా".

"లేదు, నేనూ ప్రేమించే పెళ్ళి చేసుకున్నాను".

శ్రీవిద్య మనస్సు ఆనందంతో కేరింతలాడింది.

"మై గాడ్ మీది ప్రేమ వివాహమా, చెప్పరేం. సగం భయం పోయింది. ఇక నిర్భయంగా చెప్పేస్తాను. నేను ప్రేమించటం నిన్నట్నుంచే మొదలుపెట్టాను. మీ సహాయం కావాలి".

"అతని అడ్రసు, బయోడేటా" ఉత్సాహంగా అడిగింది.

"మనిషిని చూడలేదు. పాస్ పుస్తకాన్ని చూసేను. చదువూ, సంస్కారం, ఉద్యోగం తెలీదు. క్రెడిట్ బాలెన్స్‌ని చూసేను. మనస్సుని అర్పించలేదు. పాస్ బుక్‌లో కోరికను క్రెడిట్ చేశాడు. ఆ డబ్బుని విత్ డ్రా చేసి వాడుకుంటే, అతను పడుకోమంటే పడుకోవాలి. పెళ్ళి సంగతి చెపుతామంటే వయస్సు ఎంతో తెలీదు. ప్రేమా, కోరికా, అనుభవించటమా ఏదీ తెలీదు".

రుక్మిణికి అర్థం కాలేదు.

"ఎవరా మూర్ఖుడు".

"నా ఎస్. బి. అకౌంట్ నెం. 1234, చూడండి" అని పాస్ పుస్తకం చేతికి ఇచ్చింది. అంతకన్న తనకు ఏం తెలీదన్నది. ఏం చెయ్యాలో చెప్పమన్నది శ్రీవిద్య.

"చాలా ఆశ్చర్యంగా ఉన్నది. నిన్ను ప్రేమించి నీ ఆర్థిక పరిస్థితి తెలిసి నీకు సహాయం చేసిన వాడయినా అయి ఉండాలి. నిన్ను పాడు చేసి, భయపెట్టి నిన్ను ఉంచుకున్నాను అనే స్థితికి తీసుకొచ్చి నీ జీవితాన్ని నాశనం చెయ్యటానికి పూనుకున్న దుర్మార్గుడయినా అయి ఉండాలి, ఈ విషయాన్ని దాచి, మీ అమ్మగారి మనస్సు బాధ పెట్టకు, అన్ని విషయాలూ చెప్పెయ్యి". అన్నది రుక్మిణి.

"మీ సలహా ప్రకారం అమ్మకు చెప్పేస్తాను. కాని ఆ డబ్బు వాడుకుంటే ఆ

# నోములు - వ్రతాలు

నువ్ నోస్తావ్ సరే ఆఫీస్ మాని నన్నుకూడా నోములు నోయ్యమనడం ఏం బాలేదు కల్పనా!



మన ప్రాచీనులు యజ్ఞయాగాదులు జరిపినట్లే ఇప్పటి ఆస్తికులలో చాలా మంది నోములనూ, వ్రతాలనూ జరుపుతూ ఉంటారు. ఆ కాలంలో వనాల్లో నివసించే మహర్షులూ రాజ్యాలు పాలించే ప్రభువులు యాగాలు చేసేవారు. ఇప్పటి వారిలో పురుషుల కంటె స్త్రీలే ఎక్కువగా వ్రతాలు చేస్తారు. నోములు పట్టే వారు కేవలం స్త్రీలే కనబడుతున్నారు. కుటుంబ పోషణకు ధనం సంపాదించుటలోను, వ్యవసాయాదుల్లోనూ నిమగ్నులైన పురుషులకు – వీటిని ఆచరించుటకు సమయం దొరకకపోవడం కూడా దీనికి కారణం కావచ్చును.

ప్రాచీన కాలంలో రాజ్యాలు పాలించే క్షత్రియులు యజ్ఞయాగాదులు చేసేవారు. శత్రు రాజులను జయించవలెనని కోరేవారు స్వర్గాన్ని కోరేవారు రాజసూయ యాగాన్నీ, మహా పాపాలు పోవుటకు అశ్వమేధ యాగాన్నీ వారు చేసేవారు. ఇందులో వారికి స్వార్థం ఉన్నా, పరార్థం లేకపోలేదు. యాగం జరిగినంత కాలం రాత్రింబగళ్ళు, యాగం చూడడానికి వచ్చిన వారికందరికీ అన్నదానం చేసి తీరాలి. ఈ విధంగా జనసామాన్యానికి కొన్ని దినాలు ఆహారానికి వెతుక్కోకుండా సుఖంగా గడిచిపోయేవి. యాగం ముగిసిన పిదప యాగం చేయించిన వారికి సంతృప్తికరంగా దక్షిణలు ఇవ్వబడేవి. యాచకుల కోరికలు తీర్చబడేవి.

ప్రాచీన కాలంలో వనాలలో నివసిస్తున్న మహామునులు యాగాలు చేసేవారు. నిష్కాములై అడవిలోని కాయకసురులు తిని పరమాత్మ సాక్షాత్కారం కోసం తపస్సు చేసే మహర్షులు వీటిని ఆచరించడానికి లోక కల్యాణం, ప్రజా క్షేమం మాత్రమే కారణం. కొన్ని యాగాలు ఏళ్ళ తరబడి జరిగేవి. వాటికి ఖర్చయే ధనాన్నీ, కావలసిన వస్తు సామగ్రినీ దేశ పాలకులైన మహారాజులే సంతోషంతో అందజేసేవారు.

ఈ కాలంలో యజ్ఞ యాగాదులు జరిపే ఓపికగాని, శక్తిగాని, సంకల్పంగాని కానరాదు. వీటికి ప్రత్యామ్నాయంగానే నోములు, వ్రతాలు ఏర్పడ్డాయి. వసంత నవరాత్రులు, శరన్నవరాత్రులు, వినాయక నవరాత్రులు, సత్యనారాయణ, వరలక్ష్మి, సరస్వతీ, గౌరీవ్రతాలు, శ్రావణ మంగళవారం, శుక్రవారం, మార్గశిర లక్ష్మీ వారాల నోములు, నందికేశ్వర, ద్వాదశ ఫలాల నోములు ఎన్నో ఉన్నవి. వీటన్నింటిలోనూ ఇతరులకు భోజనాలూ సత్కారాలు ఉంటాయి. కొన్నిటిని ముగించిన తరువాత తప్పకుండా ఉద్యాపన చేయవలసి ఉన్నది. అది మిక్కిలి వ్యయ మూలమై ఉంటుంది. దానిలో అర్హులను తగిన విధంగా సత్కరించాలి.

ఈ విధంగా మన నోములకూ, వ్రతాలకూ ప్రధానమైన ప్రజా సంతోష సుఖాలే ప్రధాన ధ్యేయమని గ్రహించాలి.

–బులుసు వేంకటరమణయ్య

## ఆడపిల్లలు - అనుభవాలు

వ్యక్తి అభిప్రాయానికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చినట్లే **అవుతుందేమో**" అని తన అనుమానాన్ని వ్యక్తపరిచింది.

"ఒక చిన్న పడపోత, చాలా సీక్రెట్‌గా నిర్వహించాలి" అని ఏం చెయ్యవలసిందీ చెప్పింది రుక్మిణి. సరే అన్నది శ్రీవిద్య.

మర్నాడు సాయంత్రం జగదీష్ పర్ణశాలకు వెళ్ళింది శ్రీవిద్య. ఎన్నడూ రాని, తన సంగతే పట్టించుకోని చెల్లెల్ని చూసేసరికి ఏదో ప్రమాదం జరిగిందనుకున్నాడు జగదీష్. అతని ప్రశ్నలకు జవాబు చెప్పింది. అక్కడ శర్వాణీ కూడ ఉన్నది.

"మాట నిలబెట్టుకున్నావ్, చాలా థాంక్స్ అన్నయ్యా".

అర్థం కాక చూసేడు జగదీష్.

"పాతిక వేల రూపాయలూ పంపించావ్. మాతృ ఋణం, చెల్లెలి పెళ్ళికి డబ్బు కూడబెట్టటం, ఒక్కసారి పాతికవేలు" చేతులు జోడించి నమస్కరించింది శ్రీవిద్య.

"నేను పాతికవేలు పంపించానా, చాలా ఆశ్చర్యంగా ఉన్నది. ఆరోజు రాత్రి ఆ పాత ఇంట్లో అమ్మా, నువ్వూ ఉన్నప్పుడూ ఇట్లాగే జరిగింది. శ్రీవిద్యా, సేవా కార్యక్రమాలకోసం నేను వసూలు చేసే డబ్బు అందుకోసమే వినియోగిస్తాను గాని, నా స్వార్థానికీ, మీకు సహాయం చెయ్యటానికీ కాదమ్మా. పాతిక వేలు ఎవరో పంపారంటే నిన్ను ఎవరో కిరాతకుడు నీడలా వెంటాడుతున్నాడనేది గమనించాల్సిన విషయం. ఆడపిల్లని పరాభవించటానికి డబ్బు విలువ తెలియని కామాంధుడు చేసే ఆర్థిక హిప్నాటిజమ్. నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి. ఈ విద్యను అమలుపరిచేది నాకు తెల్సినంతవరకూ ఒక్కడే, అతను...." పేరు చెప్పకుండా శర్వాణి వైపు చూసేడు.

"నన్ను చెప్పమంటావా జగదీష్" అన్నది శర్వాణి.

"మీకు తెలుసా" అన్నది శ్రీవిద్య.

"తెలీదు, కాని అనుమానం. ఆ వ్యక్తి గుణాన్నిబట్టి మా అంచనా అది నిజం కాకుండా ఉండాలనే నా కోరిక. నిజమే అయితే నువ్వు భరించలేవు"

"ఎవరా వ్యక్తి? ఎవరా వ్యక్తి? ఎవరా వ్యక్తి?

శ్రీవిద్య మనస్సు తల్లడిల్లిపోయింది.

"ఎవరా వ్యక్తి".

"అభిలాష్, అభిలాష్, అభిలాష్" అన్నది శర్వాణి.

నిర్ఘాంతపోయింది శ్రీవిద్య.

(ఇంకా ఉంది)

సన్నీ. అందమైన శిరోజాలకు ప్రకృతి కానుకని అదిమీకు అందజేస్తుంది.

ఆర్నికా : హోమియోపతీలో ఒక ప్రధానమైన మూలిక. ఇది మీ శిరోజాలను శుభ్రపరచడమే కాక, టానిక్‌గా కూడా పనిచేస్తుంది. జుట్టు రాలిపోవడాన్ని, చుండ్రుని అదుపు చేస్తుంది — మృదువుగా, సహజంగా.

వీటన్నింటికి మించినది ఏమిటంటే, సన్నీయొక్క కండిషనర్, వెంట్రుకలు చిక్కుబడటాన్ని తొలగిస్తుంది. మీ జుట్టుని సిల్కులాచేసి, మంచి అదుపులో ఉంచుతుంది. సన్నీకిగల ప్రత్యేకమైన ఫ్రెంచి సువాసననికూడా మీరు మెచ్చుకుంటారు!

ఉత్తమఫలితాలు ఉండేందుకు,

**సన్నీ ఆర్నికా హెయిర్ ఆయిల్‌ని**

బాగా తలకు అంటేలా రాయండి. 1-2 గంటలు ఆగండి.

ఆ తరువాత

**సన్నీ ఆర్నికా షాంపూని**

తడి జుట్టుకి పట్టించండి. నురగవచ్చేలా రుద్దుకోండి. నీళ్ళతో బాగా కడగండి.

---

ఉత్పత్తి చేసినవారు

బాక్సన్ హోమియో ఫార్మసీ ప్రయివేట్.లి.

*121, ఓఖ్లా ఇండస్ట్రియల్ ఏరియా, ఫేజ్-1*

*న్యూఢిల్లీ-110 020.*

తెలుసుకోండి

# సన్నీ

## ఆర్నికా షాంపూ

తద్వారా మీ శిరోజాల అందాన్ని తిరిగి మెచ్చుకోండి

అన్ని ప్రధాన షాపులలో దొరుకుతుంది



# సన్నీ ఆర్నికా షాంపూ కండిషనర్‌తోబాటు

మృదువుగా, సహజంగా — హోమియోపతి మూలికలకు మాత్రమే సాధ్యమైన రీతిలో!





# ఈకాలం పిల్లలు....

కె.నాగేశ్వరి

మూడు నెలల వయసు నుండే తల్లి ఫారెక్సు మొదలైన ఆహారం చంటి బిడ్డకు పెట్టడం ప్రారంభిస్తుంది తల్లి స్తన్యం గ్రోలుతూ ఇలాతల్లి పెట్టే ప్రాథమిక ఆహారం అలవాటు చేసుకొంటారు బిడ్డలు అక్కడ్నుంచీ ఆ బిడ్డలకు ఒక రకమైన పద్ధతిలో ఆహార నియమాలు అలవాటవుతాయి బిడ్డ ఆకలి వివాహం జరిగే వరకూ తల్లికే తెలుస్తుంది లేదా కొంత వయసొచ్చాక సన్నిహితులకు, ప్రియమైన వారికే తెలుస్తుంది

కొందరికి వయసు రాగానే ఇంట్లో ఆహారం సహించదు ఒకమ్మాయికి ఇంట్లో చేగోడీలు జంతికలూ చక్కీ చెడీ చేస్తుంటే హొటల్లో మసాలాదోసె తినాలనుంట్నుంది ఒకబ్బాయికి నాలుగు రకాల ఆధరువులున్నా తమ ఫ్రెండింట్లోలాగ ఆమ్లెట్ తినాలనుంటుంది

ఇంక కాలేజీలకి వెళ్ళాక వయసు వస్తుంది కద' అప్పటికే తామేదో పెద్దలకంటే తెలివైన వాళ్ళన్న భావన ఆటోమేటిక్‌గా వస్తుంది అయితే ఇలాంటి డంబాలు కొట్టుకున్నవారు కులాంతర వివాహాలకు అతి దూరంగా ఉంటారు తెగించి శాకాహారి మాంసాహారిని చేసుకోడు ఆ అమ్మాయి సరదాగా తమింట్లో చికెన్ ఫ్రై పెడితే తింటాడు అదే అమ్మాయిని భార్యగా తీసుకొచ్చి తన తల్లి వండే వంట పొయ్యి గిన్నెల మీద ఆ వంటను వండనిస్తే అతడు ఆంధ్రా మగాడు కానేకాదు

అలాగే ఒకమ్మాయి తన స్నేహితురాలిని తన అన్నయ్యకు ఇతర కులమైనా, కనీసం ఆహారపు అలవాట్లలో తేడా ఉన్నా చేసుకోనివ్వదు వారి స్నేహం ఆడపిల్లలిద్దరూ ఏ హొటలుకో పిక్నిక్‌కో వెళ్ళి ఒకరు తినే ఆహారంలో ఇంకొకరు భాగం పంచుకొనే వరకే

దీనిని బట్టి చూస్తే కేవలం ఒకరి ఆహారం



ఎలాగుంటుందో ఇంకొకరు రుచి చూడాలని ఉత్సుకత మాత్రం వయసు ఉద్రేకంలో ఉందని తోస్తుంది శాకాహారులు కేవలం తమ ఆహార అలవాట్ల నుండే బుద్ధిబలం పెంచుకోగలుగుతున్నామని తెలుసుకోలేకపోవడమే మాంసాహారం వైపు పరుగు పెట్టేటట్లు చేస్తోంది

ఇంక మాంసాహర్ధుల సంగతి నిష్పక్షపాతంగా చెప్పాలి మొదటిది మాంసాహారం ఖరీదు ఎక్కువ రెండవది అది తింటే శరీర ధారుఢ్యం పెరుగుతుందనే నమ్మకం శారీరకమైన శ్రమను తట్టుకోడానికి ఇదొక విధంగా ఉపయోగపడటం నిజమే'నిజానికి యవ్వనంలో వేడి, ఉద్రేకం మాంసాహారం కంటే బలమైన ఉత్తేజాన్ని శక్తినీ ఇస్తాయి

పాలు, గ్రుడ్లు, చేపలు, మాంసం కేవలం ఇవే యువతీ యువకులకి పుష్టినివ్వవు మంచి ఆలోచన, మంచి స్నేహం, క్రమబద్ధమైన ఆహార నియామాలు కూడా వారికి పుష్టినిచ్చేవే

మొదటిది ఆలోచన మంచిదిగా ఉండాలి అమ్మ ఎలా కష్టపడుతోంది? నాన్న పొట్టకి తిండి పెట్టడానికి ఎలా పాట్లు పడుతున్నాడు? వారికున్నదాన్లో వారెలా ఖర్చులు తగ్గించుకొని మనకి పెడుతున్నారు? అని కోటి కొకరు ఆలోచించినా అదే మంచి ఆలోచన అటువంటి పిల్లలు వో రెండు రోజులు ఇంటి కంటే పొరుగు తిండికి కొట్టాడినా మూడవ రోజుకి చచ్చినట్లు అమ్మ పెట్టే పచ్చడి మెతుకులనే తింటారు వారు తమ ఇల్లు తమ తిండి, తమ తల్లితండ్రులనీ విడిచి ఉండలేరు అమ్మా నాన్నల మమకారం కావాలన్న మంచి యోచన కలిగి ఉంటారు

తరువాతది మంచి స్నేహం మంచి స్నేహితుడు లేదా స్నేహితురాలు కనీస సంస్కారం కలిగి ఉంటుంది "ఎప్పే! మీ ఇంట్లో వంకాయ కూర ఎప్పుడూ అలాగేనా చేయడం? మా ఇంట్లో చూడు" అనేవారు కనీసం వాళ్ళింట్లో మంచినీళ్ళు కూడా ఇవ్వరు ఇక్కడ ఎవరిది తప్పు చెప్పేవారికి వినేవారు లోకువన్నట్లు విన్న వాళ్ళే కదా! కొంచెం గడుగ్గాయిలైతే "ముందు రుచి చూపెట్టవోయ్! తర్వాత చెప్పు కబుర్లు!" అంటారు నిజానికి అంత గడసరివారు ఇలాంటి స్నేహాలకి కాలం వృధా చెయ్యరు హస్కు కబుర్లు చెప్పేవారిని ఆమడ దూరంలో ఉంచుతారు దీనిని బట్టి చూస్తే, కబుర్లు, తిరగడాలు, అతిగా ఒకరింటి గొడవలలో తలదూర్చడం ఇవన్నీ మంచి స్నేహం యొక్క లక్షణం కావన్నది నిజం కదా! మంచి స్నేహితుడు తొందరగా డ్రాయింగు రూము పరిధి దాటడు. మంచి స్నేహితురాలు గభాలున వంటింట్లో, పడక గదిలో జొరబడదు.

ఇంక క్రమబద్ధమైన ఆహారం. మొలగొలుకులు బియ్యం అన్నమైనా కార్డు మీద బియ్యమైనా యవ్వనంలో ఇట్టే అరుగుతుంది. చాలినంత తిండి, బలం చేకూరుతుంది. తిండికి తగ్గ పని. పనికి తగ్గ ఆలోచన. ఇవీ వయసులో చేయాల్సినవి. ఎంతటి అలసటలోనూ ఉత్తేజకరంగా, ఉత్సాహంగా ఉండేది యవ్వనం. ఏది తిన్నా ఉత్సాహపరిచే యవ్వనపు బిగి శరీరంలో ఉండగా ఆ వయసులో తిండికి పేచీలు అలకలు ఇవి లేవనీ అవి లేవనీ అనే పిల్లలు అవివేకులనే చెప్పాలి. పుట్టిన రోజున, పండగ రోజున ఆక్షేపణ లేకుండా ఫ్రెండ్సుతో వారింట్లో ఆహారం తినడం తప్పుకాదు. □



# నెస్టమ్ బేబి సిరియల్
# ప్రారంభించేందుకు ఆదర్శప్రాయమైనది
# పెరుగుదలకు ఆదర్శప్రాయమైనది

**నెస్టమ్, పాలు-పూర్తి పోషక విలువలున్న ఆహారం.**

మీ బాబు సుమారు 4 నెల్లవాడయేసరికి, కావాలి పాలతోపాటు ఘనఆహారం. పాపాయికి తేలిగా జీర్ణమయేటు, ప్రత్యేక శ్రద్ధతో తయారయిన- నెస్టమ్ బేబి సిరియల్‌ని పెట్టడం ప్రారంభించండి. ముందుగా మరిగించి పెట్టిన గోరువెచ్చటి పాలతో కలపండి. ఇక, పూర్తి పోషక విలువలున్న ఆహారం సిద్ధమవుతుంది.

పాపాయి ఆరోగ్యంగా, చలాకీగా పెరిగేందుకు తోడ్పడుతుంది.

**నెస్టమ్‌తో విరావంటలు-పాపాయి ఆహారంలో బోలెడన్ని రకాలు**

మీ పాపాయి ఎదుగుతున్న కొద్దీ కొత్త రకాలు రుచి చూపించండి.

ఉడికించిన కూరముక్కలూ, పండ్ల ముక్కలూ, పప్పు-వీటిని నెస్టమ్‌తో కలిపి పెట్టండి. బాబు, కుటుంబంలో నిహారు తినే ఆహారాన్ని తీసుకోవడం నేర్చుకునేందుకు ఇది తోడ్పడుతుంది.

**నెస్టమ్®**
**రైస్**
**ఇనుము-విటమిన్లతో కూడినది**
**పాలలో కలపండి.**









**ఉచితం**
మీ బాబు, తన ఆహారంలో, కొత్త రుచులను కోరుతాడు అందుకని—మీ ఉచిత నెస్టమ్ వంటల పుస్తకం కోసం రాయండి.
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016,

# షేర్ మార్కెట్‌లో పెట్టుబడులు



-యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

మొన్న ఈ మధ్యనే కడప నుంచి వచ్చిన శ్రీ రాయుడుగారు అనే ఆయన ఢిల్లీ వచ్చి నన్ను కలిసి తను కూడా ఒక షేర్ కన్సల్టెన్సీ సర్వీసెస్ పెట్టదలుచుకున్నానని ఆ ప్రయత్నం మీదనే, నన్ను కలిసానని చెప్పాడు. నేను అన్నాను. అయ్యా సుఖంగా వున్న ప్రాణం మీదకు ఎందుకు కష్టాలు కొని తెచ్చుకొంటారు? కాబట్టి ఆ ప్రయత్నం మానండి అని చాలా నచ్చ చెప్పాను. కాని ఆయన కన్విన్స్ కాలేదు. తరువాత రెండు మూడు రోజులు నా కోసం ప్రయత్నం చేస్తే, నేను మనీ మాటర్స్ అనే టి. వి. కార్యక్రమంలో స్టాక్ మార్కెట్ రివ్యూ ఇవ్వటానికి వారానికి 3 రోజులు పి. టి. ఐ. వారి స్టూడియోలో నిమగ్నమయి వుంటాను కాబట్టి వీలులేకపోయింది. ఆయన విసుగు చెంది, చి... ప్రయత్నంగా మా ఇంటికి వచ్చి చాలా సేపు నా కోసం ఎదురు చూసి, నేను రాకపోవటం మూలంగా నిరాశ చెంది నిస్పృహతో ఒక అరగంట సేపు ఇష్టమొచ్చి నట్టు తిట్టిపోయాడట (గొప్పగా వేదికలు ఎక్కి వుపన్యాసాలు చెప్తారు, ఈ రంగం అంతా మార్వాడీల డామినేషన్‌లో వుంది, మన వారు కూడా ఈ రంగంలో ప్రవేశించి, ప్రగతి సాధించాలి అని తీరా వస్తే, తనకి ఎక్కడ పోటి వస్తానో అని నన్ను రానివ్వటం లేదు, అని).

ఈయన మాటలకు మా ఇంట్లో వారు బాధ పడిన మాట వాస్తవమే కాని, నాకు మాత్రం బాధ కలగలేదు. ఎందుకంటె జలుబుతో వున్న పసిపాప 'నాకు ఐస్‌క్రీం కావాలి' అని మారాం చేస్తే, మనం కొని ఇస్తామా? ఇవ్వం కదా! ఆంధ్రా వారిని ఈ రంగంలోకి రమ్మంది చక్కని ఇన్వెస్టర్‌లుగా. ఈ కన్సల్టెన్సీ సర్వీసులు ఎవరు పెట్టినా కూడా నాకు నష్టం ఏమాత్రం లేదు. ఎందుకంటే ఈ సర్వీస్‌లన్ని నదులు లాటివి, అవి వచ్చి సముద్రంలో కలవాలి కదా! ఆ సముద్రం నేను కాబట్టి. ఇన్‌వెస్టర్‌గా వున్నంత సేపు ఏ బాదరబందీ వుండదు. కాని ఏదో వుంది అనుకొని కన్సల్టెన్సీ సర్వీసులు పెడితే మేడిపండును చూసి మోసపోయినట్లే. ఎందుకంటే ...రందరు చూసే మా ఆర్భాటాలు వాస్తవ ...రాలు. మేము విమానాలలో ప్రయాణం చేస్తే, అది మా డబ్బుతో కాదు, ఎవరో కంపెనీ వారు, వారి కర్మాగారం చూపించటానికో లేక వారి అవసరం కోసమో మమ్మల్ని తీసుకుపోతుంటారు. మా డబ్బుతో అయితే మేము కూడా రెండవ తరగతిలో రైలులోనే ప్రయాణం చేస్తాము. అలాగే మేము దిగే అయిదు నక్షత్రాల హోటళ్ళు కూడా. మా డబ్బులుతో అయితే మేము 60-100 రూపాయిలలో వున్న వాటిలోనే దిగుతాము. దీపపు పురుగులు ఎలా దీపానికి ఆకర్షితమవుతాయో అలాగా ఈ ఆర్భాటాలకు ఆకర్షితులు కావద్దు. ఈ రాయుడు గారే కాదు, చాలా మంది వస్తున్నారు, ఉత్తరాలు రాస్తున్నారు. దీనిలో విపరీతమయిన రిస్క్ వుంది. రిస్క్‌కు తగ్గ ఫలితం చిన్న చిన్న పట్టణాలలో వుండదు. ఎందుకంటే మీరు లక్ష రూపాయలు రిస్క్ తీసుకుంటే మీకు వచ్చేది ఒక వెయ్యి రూపాయలు మాత్రమే. ఈ వెయ్యిలో ఖర్చులు 600 రూపాయిల వరకు వుంటాయి. ఇంక మిగిలేది 400 వందలు మాత్రమే. ఆంధ్రలో ఏ పట్టణంలో కూడా 5 లక్షలకు మించి వ్యాపారం చేసేవారు నా కింత వరకు కన్పించలేదు, ఒక్క హైదరాబాద్ మినహాయించి. అంటే నెలకు 5 లక్షలకు రిస్క్ తీసుకుంటే 2000 రూపాయిలు మాత్రం వస్తాయి. మీరు పెట్టే పెట్టుబడి మీద ఈ రెండు వేలు వడ్డీ గిట్టుబాటు కూడా కాదు. ఇంతవరకు ఆర్థికమైన వాటి మీద వివరించాను. ఇప్పుడు ఈ రంగంలో వుండే సమస్యలు గూర్చి వివరిస్తాను. మీ అందరికి తెలుసు కదా నా గురించి, దేశంలో నాకు కొద్దోగొప్పో పేరు ప్రతిష్ఠలు వున్నాయి అని, అటువంటి నాకే వున్న ఈ తల నెప్పులు, మామూలు వారికి ఇంక ఎంత తీవ్రంగా వుంటాయో మీరే వూహించండి. బయట వారి సమస్యలు చెప్పే కన్నా, నా సమస్యలు మీకు చెప్తే నమ్మకంగా వుంటుంది.

అనగనగా ఒక విశాఖపట్నం అనే వూరు, ఆ వూరిలో ఒక రాజు గారికి ఒక ఆఫీస్ వుంది. ఆయన ఒక రోజు ఫోన్ చేసి 'రామ్‌జీ గారూ! 300 రిలయన్స్ 'జి' డిబెంచర్‌లు కొనండి అన్నారు. పార్టీ మంచిది అయినా ముందు జాగ్రత్త కోసం ఒక 100 మాత్రం రు. 240 చొ.న కొని ఆయనకు తెలియచేసి, డబ్బు పంపవలసిందిగా కోరాను. ఆయన సరే అన్నారు. 20 రోజులు గడిచినాయి. సర్టిఫికేట్‌లు వచ్చాయి. కానీ డబ్బు రాలేదు. ఎన్నిసార్లు ఫోన్ చేసినా ఆయన దొరికే వారు కాదు. వారి సిబ్బంది ఆయన వస్తేనే కాని వీలు కాదు అన్నారు 24 వేలు 3 నెలలు వసూలు కాకుండా ఉండిపోయాయి. తరువాత ఆయన ఫోన్‌లో దొరికి, వాటిని అమ్మేయండి అన్నారు. సరే అమ్మేశాను. రేట్లు పడిపోవటం మూలంగా 6 వేలు నష్టం వచ్చింది. ఈ 6 వేలు పంపటానికి ఆయన 6 నెలలు చేసారు. ఈ లోపల ఎన్నో వుత్తరాలు, మరెన్నో టెలిగ్రాంలు పంపటం జరిగింది. వీటిని చూసి ఆయన ఆగ్రహించారు. ఎంతైనా రాజుగారు



కదా! 24 వేలు మీద 3 నెలల వడ్డీ నష్టపోయాను. 6 వేల మీద 6 నెలలు వడ్డీ నష్టపోయాను. అంతకు మించి మంచి మిత్రుడు అయిన మా రాజుగారి ఫ్రెండ్‌షిప్ కోల్పోయాను. ఈయన చెన్నవారు అంటే కాదు పాపం ఈయనకి కాకినాడ నుంచి రెండు లక్షల రూపాయిలు బాకీలు రావలసి వుంది. పోని ఈ కాకినాడ ఆయన చెన్నవాడా అంటే మీరు పప్పులో కాలు వేసినట్లే. పాపం ఈయన రాజమండ్రీలో చేతు లెత్తేసిన ఒక కన్సల్టెన్సీ సర్వీసెస్ నుంచి పెద్ద మొత్తాలలో బాకీలు రావాలి. ఆయన ఇప్పుడు అంతులేరు. మరి వందలాది రాజమండ్రి ఇన్వెస్టర్ల యొక్క దుఃఖంతో కూడిన శాపనార్థాలకు దూరంగా చాలా దూరంగా వున్నారు. ఆయన గూర్చి పేపర్లలో పడినట్టు గుర్తు. ఇలాగ ఎందుకు జరుగుతుంది అంటే ఈ కన్సల్టెన్సీ సర్వీసులు ఏవీ కూడా గుర్తింపబడిన సంస్థలు కావు. వీరి మీద ప్రభుత్వానికి ఏమాత్రం ఆధిపత్యం వుండదు. ఎవరైన డబ్బులు ఎగగొడ్తే మీరు సివిల్ కోర్టులని మాత్రమే ఆశ్రయించాలి తప్ప వేరే మార్గం లేదు. అందుకనే స్లీపింగ్ పార్ట్‌నర్ అయితే మరో ఆయన యాక్టివ్. మేము పెట్టిన కొద్ది కాలంలోనే ఆ సంస్థ చాలా అభివృద్ధి చెందింది కూడా. సాధారణంగా ఈ మార్కెట్లలో వేలకు వేలు పెట్టుబడి పెట్టే ఇన్వెస్టర్లు, కనీసం ఈ రంగానికి సంబంధించిన పుస్తకాలను కొనటానికి లోభిస్తూ వుంటారు. దాన్ని గమనించి నేను ఇన్వెస్టర్లకు కావలసిన పుస్తకాలను పెద్ద పెద్ద పట్నాలను నుంచి తెప్పించి, వారికి అందుబాటులో వుంచేవాడ్ని. ఇది ఒక రకంగా సేల్స్ టెక్నిక్. ఏమంటే 'అవసరాన్ని గుర్తించి అందించు' దాంతో రోజు రోజుకు అభివృద్ధి చెందింది మా వ్యాపారం. దానికి తోడు అప్పట్లో నా ఊహలు 80 శాతం నిజం కావటం కూడా దోహదకారి అయింది. ఇంతలో మా కంపెనీలో ముసలం పుట్టింది కూడా. సరే ఏప్రిల్ రెండవ వారంలో మా అమ్మగారికి సుస్తి చేయటం. దాని మూలంగా నేను హైదరాబాద్, ఢిల్లీల చుట్టూ ప్రదక్షిణం చేయటం జరిగింది. ఆవిడను ఢిల్లీలోనే వుంచాల్సిన పరిస్థితి వచ్చేటప్పటికి చివరికి నేను ఇవ్వవలసిన అవసరం లేకపోయినప్పటికీ, ఇవ్వటానికి ఒప్పుకోవటం జరిగింది. ఎందుకంటే నేను ఏప్రిల్ మొదటి వారం వరకే వున్నాను కాబట్టి, తరువాత వాటికి నా బాధ్యత కాదు. ఈ రకంగా తిరకాసు వేసారు మా రాజు గారు. అందరూ అనుకొనే మాట ఏమిటంటే పూర్వం ఆయన పని చేసిన ఫైనాన్స్ కంపెనీ తెలివితేటలని. ఇవేకాక నా వ్యక్తిగతమైన లోటుపాట్లు కొన్ని ఆయనకు తెలియటం కూడా చక్కగా తోడ్పడింది. రెండో ఆయన నా బాల్యమిత్రుడైనప్పటికి మొహమాటానికి లొంగిపోవలసి వచ్చింది. ఏమైతే నేమి ఒక 20 వేలు నాకు రావలసి వుండగా 20 వేలు నష్టపోవటం జరిగింది. అంతేకాక ఆ వూరిలో నే వున్న ఇంకొక ఆఫీస్ కల మరొకాయన మాకు ఇవ్వవలసిన బాకీల లెక్కలు పరిష్కారం చేసుకోగా సంవత్సరం తరవాత, మీరు మాకే 40 వేల బాకీ అంటూ తప్పుడు లెక్కలు పంపి, తెనాలి రామకృష్ణుని లాగా చిన్న గీత ప్రక్కన పెద్ద గీత గీసి మొదటి దాన్ని చిన్నది చేశారు.


ఎస్. పి. హిందూజ


పరాస్‌మల్ లోఢా


కంపానీ

మీకు ముందే చెప్పాను మీరు మీ వ్యాపార లావాదేవిలను అధికారికమైన బ్రోకర్ నుంచి గాని లేక వారి అనుమతి పొందిన రెమిసర్ నుంచి మాత్రం చేసుకోండి. లేకుంటే ఈ విధంగా చైన్ రియాక్షన్ కల్గిన ఈ రకం సంస్థలలో ఏ ఒక్క పెద్ద సంస్థ కాని లేక పెద్ద స్పెక్యులేటర్ గాని చేతు లెత్తేస్తే టపటప అంటు చాలా సంస్థలు చేతులు ఎత్తేస్తాయి.

ఇక్కడతో ఆగలేదండి సమస్యలు. ఇంకా చాలా వున్నాయి. సాధారణంగా ఈ కన్సల్టెన్సీ సంస్థలు ఒక్కరి మీద జరగవు ఎందుకంటే ఒకరు హెడ్ క్వార్టర్స్‌లో వుంటే మరొకరు మద్రాసు, బొంబాయి, ఢిల్లీ లాటి నగరాలలో వున్న బ్రోకర్ యొక్క ఎకౌంట్స్ సెటిల్ చెయ్యటం మరియు రావలసిన సర్టిఫికెట్లు తీసుకు రావటానికి తిరగవలసి వస్తుంది. కాబట్టి సాధారణంగా చాలా వరకు పార్ట్‌నర్‌షిప్‌ల మీద నడుస్తూ వుంటాయి కూడా.

ఈ భాగస్వామ్య ఫరమ్‌లలో వుండే సమస్యలు కూడా వివరిస్తాను. నాకు మా వూరులో ఒక పార్ట్‌నర్‌షిప్ ఫరమ్ వుండేది. దానిలో మిగతా వారు ఇద్దరు రాజుగార్లు వుండేవారు. ఒక ఆయన ఢిల్లీకి మకాం మార్చవలసి వచ్చింది మా అమ్మగారి కోసం. సరే ఎలాగూ అక్కడకు పోవాలి కాబట్టి నేను ఆ కంపెనీలో తెగతెంపులు చేసుకోవలసి వచ్చింది. ఇంతలో మా రాజుగారు మీరు నాకు ఆగస్టు వరకు లెక్క అప్పచెప్పాలి అని సుమారు ఒక 50 వేలకు నేను బాకీ పడినట్టుగా ప్రకటించారు. దీనిలో తిరకాసు ఏమంటే నేను ఏప్రిల్ మొదటి వారం నుంచి ఆగస్టు వరకు మహా అంటే ఒక పది రోజులు తప్ప నేను ఆఫీసులో లేను. డబ్బుకి సంబంధించిన వ్యవహారాలు అన్నీ కూడా ఆయనే చూసేవారు. అప్పటికే నేను ఢిల్లీలో అధికారిక రెమిసర్‌గా అప్లయి చేసి వుండటం మూలంగా నేను నా సమస్యను త్వరగా పరిష్కారం చేసుకోవటానికి తొందరలో వున్నాను. సరే ఆయన చూపిన వాటిలో ఒక 30 వేల వరకు తప్పుడు లెక్కలుగా నేను గుర్తించి, దానికి సంబంధించిన వారి వద్ద నిరూపించటం జరిగింది. మిగతా వాటికి నాకు సమయం లేకపోవటం మరియు అధికారిక రెమిసర్‌గా గుర్తింపు పొందే ముందు పత్రికలో ప్రకటించే "ఎనీ కంప్లైంట్స్ ఆఫ్ ది కాండిడేచర్" వుండటం మూలంగా మిగతా మొత్తానికి, నేను

ఇవేకాక మా సలహాలు 80 శాతం నిజం అయ్యి 20 శాతం తప్పు అయినా మా వలన లాభాలు పొందిన ఈ 80 శాతం మంది గమ్మున వూర్కుంటారు. కాని 20 శాతం నష్టపడిన వారు మాగురించి బ్రహ్మాండమైన దుష్ప్రచారం చేస్తారు– ఇదండీ బాబు ఈ లోకం రీతి.

ఇలా చెప్పుకుపోతూ వుంటే చాలా వుంటుంది. చూశారు కదాఎన్ని సమస్యలు వుంటాయో, లాభాలు వేలలో, నష్టాలు లక్షల మీద. కాబట్టి ఈ కన్సల్టెన్సీ సర్వీసులు పెడ్తామన్న వారు మీరు ఇప్పటికీ ఇంకా ఈ రంగానికి రావాలని వుత్సాహం వుంటే, నేను మిమ్మల్ని ఆపలేను. ఆ ప్రభువే మీకు శ్రీరామ రక్ష. నాకున్న సమస్యలు 10 శాతం మాత్రమే. అది గూడా గుర్తుంచుకోండి. వీటి అన్నిటికి మించి ఇంకొక భయంకరమైన సమస్య వుంది. అది కులగజ్జి. ప్రాణాలను కాపాడే డాక్టర్ వద్దకు పోవలసిన సమాజంలో కూడా "వాడు మనవాడేనా" అంటున్నారు ఈ రోజుల్లో. ఈ రంగంలో ఈ కులగజ్జి ఎంత ప్రబలంగా వుంటుందో గమనించండి. □

# మరోమలుపు

(గత సంచిక తరువాయి)

పెళ్ళికొడుకు మురళీకృష్ణ అందంగా ఉన్నాడు. కాబోయే ఐ. ఏ. ఎస్ పైగా. అతని అక్కా, తల్లీ అధునాతనంగా అలంకరించుకుని వచ్చారు అతని తండ్రి కూడా మంచి పలుకుబడి ఉన్న వ్యక్తి ఎమ్ ఎల్ ఏ పంచె కట్టి అతను కూడా ఘనంగా ఉన్నాడు

ప్రమీల వాళ్ళకు బాగా నచ్చింది సారథి హృదయం సంతోషంతో పొంగిపోయింది

మేం రేపు ఏ సంగతీ కబురు చేస్తాం అంటూ వారు వెళ్ళిపోయారు

ఇంట్లో వాళ్ళంతా పెళ్ళి వారి గురించి గొప్పగా చెప్పుకుంటూ స్వీట్స్ తీసుకున్నారు

ఆనంద్ ప్రమీల మొహంలో భావాలు చదవాలని ప్రయత్నించాడు ఆమె మొహంలో ఏ భావం లేదు

"సారథీ! అంతా నీ నిర్ణయమేనా? ప్రమీల ఇష్టం కనుక్కోవా?" ఆనంద్ అన్నాడు

"అంతే ఆనంద్! వాళ్ళ ఆరాటమే వాళ్ళది నా ఇష్టంతో వారికి పనిలేదు" ప్రమీల తమాషాగా అంది

"పోనీ ఇప్పుడు చెప్పవే నీకిష్టం లేదంటే పూరుకుంటాం" సారథి నవ్వుతూ చెల్లెలి తల మీద దెబ్బ వేసాడు

"అంతా అయిపోయాకా ఇంకా నా నిర్ణయం ఎందుకులే?" అంటూ చిన్నగా నవ్వేసింది ఆమెనవ్వులోనే ఆమె నిర్ణయం అందరికీ అర్థం అయిపోయింది సారథి చెల్లెలు మనసు తెలుసుకున్నాడు

★ ★ ★ ★ ★ ★

ఆ రాత్రి ఆనంద్‌కు నిద్రపట్టలేదు తను ఎంతగానో కోరుకున్న ప్రమీల తనకు దూరం అయిపోతోంది ప్రమీల అంటే తన మనస్సులో ఎప్పటినుండో ప్రేమ ఉంది. తన క్యారెక్టర్ ఎటువంటిదో సారథికి ఆ ఇంట్లోవారికీ బాగా తెలుసు. అందుకే తను ఆమె పట్ల తన మనసులో ఉన్న ప్రేమను ఇన్నేళ్ళూ గుప్తంగా దాచాడు అది అలా గుప్తంగా సమాధి అయిపోవాలి కాబోలు ఆ తాగుడు వ్యసనమే తన జీవితానికి మాయని మచ్చ తెచ్చిపెట్టింది

ఎలాగో తెల్లారింది ఆనంద్ పక్క మీద నుండి లేచిపోయాడు

ప్రమీల కోసం వచ్చిన పెళ్ళివారు ఏ సంగతీ ఈ రోజు చెప్తానన్నారు. ఈ రోజుతో ప్రమీల పరాధీన అయిపోతుంది ఆమె గురించి తలచే హక్కు తనకు లేదు అటువంటి పాపపు ఆలోచన మనసులోనికి కూడా రానివ్వకూడదు అని స్థిర నిర్ణయం చేసుకున్నాడు టిఫిన్ కూడా తినాలనిపించక ఆఫీసకు వచ్చాడు. సాయంత్రం వరకు సారథి నుండి ఫోన్ వస్తుందని ఎదురు చూచాడు ఫోన్ రాలేదు. కానీ ఐదు తరువాత సారథే వచ్చాడు

"ఏరా వాళ్ళు కబురు చేసారా?" ఆనంద్ ఆత్రుతగా అడిగాడు

సారథి మొహం వాడిపోయి ఉంది ఆనంద్ ప్రశ్నకు జవాబివ్వలేదు. స్నేహితుడిలో మార్పు కనిపెట్టాడు. ప్యూన్‌ని పిలిచి కాఫీ తెప్పించాడు

సారథి చాలా దిగులుగా ఉన్నాడు. ఆనంద్ బలవంతంతో బాత్‌రూమ్‌లోకి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చాడు ప్యూన్ తెచ్చిన కాఫీ ఇద్దరూ తాగారు

అప్పటికి సారథి మొహంలో కాస్త రిలీఫ్ వచ్చింది

"ఏం జరిగిందిరా? అలా ఉన్నావేం? ఆనంద్ సావకాశంగా కూర్చుని సారథిని ప్రశ్నించాడు

"నా బాధ ఏం చెప్పమంటావురా! మురళీకృష్ణ కట్నకానుకల విషయం అనవసరం అంటూ వచ్చి పిల్లను చూసి వెళ్ళారు కదా! ఇవ్వాళ ఉదయం కబురు చేసారు పిల్ల వాళ్ళకు నచ్చిందనీ, మిగిలిన విషయాలు మాట్లాడుకోవటానికి నాన్ననూ, నన్నూ వారింటికి ఆహ్వానించారు

"వెళ్ళారా?" ఆనంద్ ప్రశ్న

"సంతోషంగా వెళ్ళాం. మా తలలు తిరిగేంత మర్యాద చేసారు మేం పొంగిపోయాం"

"చావు కబురు చల్లగా చెప్పినట్టు తీరికగా అసలు విషయం చెప్పారు. దాంతో మా తలలు తిరిగిపోయి వచ్చేసాం"

"ఏం చెప్పారు?" ఆదుర్దాగా అడిగాడు ఆనంద్

"వారి అబ్బాయికి లక్ష దాకా కట్నం ఇస్తామని పెద్దమనుషులు వస్తున్నారట ఆ లక్షే కాక లాంఛనాలు అవీ ఇంకా దండిగా ముట్టజెప్తాం అంటున్నారట సరే మీ పిల్ల మా హోదాకీ, మాకూ బాగా నచ్చింది కాబట్టి లాంఛనాల మాట వదిలేసి లక్ష రూపాయల క్యాష్ అప్పజెప్తే నిరభ్యంతరంగా ప్రమీలను వాళ్ళింటి కోడలిగా చేసుకుంటారట"

ఆనంద్ పెద్దగా ఆశ్చర్యపోలేదు ప్రస్తుతం వరకట్నాల గాలి ఎంతుందో అతనికి బాగా తెలుసు కాబట్టి

"మరేం చేద్దాం? అంత కట్నం ఇవ్వగలవా? సూటిగా ప్రశ్నించాడు

**జరిగిన కథ– 6:** ఆనంద్ భీమిలిలో తాగిన మైకంలో ఒక పవిత్రమూర్తిని మలిన పరుస్తాడు కొన ఊపిరితో పడి ఉన్న ఫాదర్‌ని చూస్తాడు ఆనంద్ ఫాదర్ తప్పు తనపై వేసుకొని ఆనంద్‌ని రక్షిస్తాడు జరిగింది తెలుసుకొని సారథి హడలి పోతాడు ఈ సంఘటన ఆనంద్‌లో గొప్ప మార్పుని తెచ్చింది చెల్లి జ్యోతి పెళ్ళి చేసెయ్యమని తండ్రి సుబ్బారావుకి సలహా ఇస్తాడు ఆనంద్ – జ్యోతి పెళ్ళి జరిగి పోయింది ఆనంద్, సారథి ఫస్ట్ క్లాసులో పాస్ అయ్యారు ఆనంద్ కుటుంబ పరిస్థితి బోల్తా పడింది సుబ్బారావు మరణిస్తాడు ఆనంద్‌కి ఫాదర్ మంచి ఉద్యోగం ఇప్పిస్తారు సారథికి చెల్లెలు ప్రమీల పెళ్ళి సమస్య అయ్యింది ఆనంద్‌కు ప్రమీలని పెళ్ళిచేసుకోవాలని మనస్సులో వున్నా బయటపడలేదు

స్నేహితుడిని.

"భలేవాడివి అంత డబ్బు మేం ఎక్కడి నించి తేగలం? ఇక వాళ్ళ కోరిక తీర్చడానికి ఏదేనా బ్యాంక్ లూటీ చేయాల్సిందే"

"మరెలా?"

"ఆ సంబంధం వదిలేసుకోవడమే." పెదవి విరుస్తూ అన్నాడు సారథి

"అన్ని విధాలా అనుకూల సంబంధం కదరా!" పాలిపోయిన స్నేహితుడి మొహం చూస్తూ జాలిగా అన్నాడు ఆనంద్

"నిజమే కానీ ఏం చేస్తాం? దానికి ఆ జాతకం లేదు" నిరాశగా నిట్టూర్చాడు సారథి.

"ఛా! అతని విషయంలో మేం అంతా చాలా ఆశలు పెట్టుకున్నాంరా!" సారథికి చాలా బాధగా ఉంది.

"దట్సాల్! మన చేతుల్లో ఏమీలేదు. అదంతా దేవుని చిత్తం" ఆనంద్ అన్నాడు.

సారథిని ఇంటి దగ్గర డ్రాప్ చేసేసి తన ఇంటికి వచ్చేసాడు సారథి బలవంతం చేసినా అతనికి లోపలకు వెళ్ళాలనిపించలేదు. బైట నుండే సారథికి గుడ్‌బై చెప్పేసి వచ్చేసాడు

ఆ మర్నాడు సాయంత్రం మాత్రం అతనికి ప్రమీలను పలుకరించాలనిపించింది ఓటమిని ఆమె మనసు ఎలా తట్టుకుందో తెలుసుకోవాలనిపించింది

ఆమె బ్యాంక్ వదిలే సమయానికి ముందే బ్యాంక్ దగ్గరకు వచ్చేసాడు

ప్రమీల అప్పుడే బైటకు వస్తోంది ఆనంద్‌ని చూసి నవ్వుతూ పలకరించింది

"ఏమిటి ఇలా వచ్చారు?"

"నిన్ను చూడాలని"

"నన్ను చూడాలని ప్రత్యేకంగా రావటానికి నేనేం సినిమా స్టార్‌నా?" నవ్వింది

"నువ్వు సినిమాస్టార్‌వి అయితే అసలు వచ్చేవాడినే కాదు

"పోనీండి సరదాకు అన్నాను. మా అన్నను వదలి ఇలా నాకోసం రావడం ఆశ్చర్యం అనిపించింది అంతే!" వాదం పెరగకుండా తనే తగ్గిపోయింది

"ఈ రోజు నీతో ఒక గంట కాలక్షేపం చేయాలని ఉంది"

"ఇక్కడా ఈ రోడ్డు మీదా?" చుట్టూ చూసింది సాయంకాలం కావటాన బజారంతా సందడిగా ఉంది

"పోనీ నాతో బీచ్‌కు రాగలవా?" సందేహిస్తూ అడిగాడు

ప్రమీల గతుక్కుమంది. "అన్నయ్యకు తెలిస్తే బాగుండదేమో?" నసిగింది

"మీ అన్నయ్య నన్ను అంత త్వరగా అపార్థం చేసుకోడు తరువాత నీ ఇష్టం"

ఆనంద్ మాటలు తీసేయాలనిపించలేదు ఆమెకు

"సరే పదండి" ఆనంద్ ఆటో పిలిచాడు

*   *   *   *   *   *

బీచ్‌లో ఒక మూలగా కూర్చున్నారు ఆనంద్ ప్రవర్తన ఈ రోజు చాలా వింతగా ఉంది ప్రమీలకు. ఆనంద్ ఇన్నేళ్ళ నుండి తనతో ఇలా మాట్లాడలేదు అతడు పరాయి మగవాడు కాబట్టి తనూ అతనితో జాగ్రత్తగానే ఉంటూ వచ్చింది అటువంటి వ్యక్తి ఇప్పుడు ఇలా తనని కోరి బీచ్‌కు తీసుకు రావడం ఆశ్చర్యంగా ఉంది

పిలిచింది ఆనంద్ కాబట్టి అతనితో ఇలా ధైర్యంగా వచ్చింది. అదే మరొకరు



...స్తే పొరపాటున కూడా వచ్చేది కాదు

"చెప్పండి నన్నెందుకిలా తీసుకు వచ్చారు?" ప్రమీల అడిగింది

"ప్రమీలా! మురళీకృష్ణ పెళ్ళి సంబంధం ఆగిపోయింది కదా! నీకు బాధగా ...దూ?" ఆనంద్ మాటలతో ప్రమీల వదనం ఎర్రబారింది

"నేనేం ఎగతాళికి అడగటంలేదు కేవలం కాలక్షేపం కోసమే ...డుగుతున్నాను" కంగారుగా అన్నాడు

"అతన్ని కొనుక్కునే తాహతు నాకు లేదని తెలిసి ఎందుకు బాధపడతాను" ...ప్పుహగా అంది

వరకట్నపు పిశాచాల దురంతాల కోరలలో అన్నెం, పున్నెం ఎరుగని ...బతు కు బలియేనా? ఘంటసాల కంఠం ఆనంద్ హృదయంలో మెదలింది

"మతాంతర, కులాంతర వివాహాలపైనీ అభిప్రాయం చెప్పు ప్రమీలా?"

ప్రమీల చిన్నగానవ్వింది

"కట్నం కోరని ఏ కులాంతర, మతాంతర వివాహం అయినా నాకు ఇష్టమే ...ని మా అన్నయ్య, నాన్నా ఒప్పుకోరు నేను అలా కులం చెడి పెళ్ళాడతానని ఎలా ...గను? ఇప్పటికే నా పెళ్ళి కోసం వాళ్ళు ఎంతో ప్రయత్నం చేస్తున్నారు ...టువంటిది నేనుగా అలా తెగిస్తే వాళ్ళు ఎంతో బాధపడతారు, అదే నా భయం" ...తో నెమ్మదిగా అంది

"అలా అయితే కులం మారినా కట్న కానుకలు అడగని వ్యక్తిని నువ్వు ...ంగీకరిస్తావా?"

"చదువుకుని, కొద్దో గొప్పో సంపాదించుకునే సంస్కారవంతుడు అలా ...ుందుకు వస్తే నేనైతే అంగీకరించగలను కానీ మా వాళ్ళను ఎలా ఒప్పించగలను? అదీకాక అలా ముందుకు వచ్చే సంస్కారవంతులు మాత్రం ...క్కడున్నారు? నూటికి ఒకరో, ఇద్దరో ఉన్నారు ఆ ఒకరో, ఇద్దరో నన్ను వెదుక్కుంటూ రావద్దూ?"

ప్రమీల మాటలతో ఆనంద్ తేలికగా గాలి పీల్చాడు

"అటువంటి వ్యక్తిని నేను తీసుకు వస్తాను నువ్వు ఒప్పుకుంటావా?" ...నంద్ అడిగాడు

"ముందు తీసుకురండి అప్పుడు చూద్దాం" నిర్లక్ష్యంగా నవ్వింది ప్రమీల

"తీసుకు వచ్చాను చూడు" ఆనంద్ చిన్నగా అన్నాడు

"ఎక్కడా?" అంటూ ప్రమీల ఆశ్చర్యంగా చుట్టూ చూసింది దరిదాపుల్లో ...వరూ లేరు

"నేనే ఆ వ్యక్తిని" చూపుడు వేలితో తనని తాను చూపించుకుంటూ ...ప్పాడు ఆనంద్

ప్రమీల తెల్లబోయింది క్రమంగా ఆమె కళ్ళల్లో మెరుపును మించిన కాంతి వచ్చింది

"మీరా?" ఆశ్చర్యంగా చూసింది

"అవును నేనే నిన్ను ప్రేమించాను కానీ మన కులాలు వేరు అందుకే తెగించి సారథిని అడగలేకపోయాను నీకు పెళ్ళి కుదిరిపోతుందని తెలిసి రాత్రినుంచి నేనెంత మథనపడ్డానో ఆ దేవుడికి తెలియాలి నిన్న సారథి వచ్చి మురళీకృష్ణ సంబంధం వదులుకుంటున్నాం అని చెప్పాడు దాంతో అడుగంటిన నా ఆశాలత తిరిగి చిగురించింది నువ్వు నన్ను ఇష్టపడినా ఇష్టపడకపోయినా నా మనసులో ... చెప్పేయాలనిపించింది అందుకే ఇలా తీసుకు వచ్చాను"

ప్రమీల మౌనంగా ఉండిపోయింది ఆనంద్ అన్నివిధాలా పూర్ణపురుషుడు తమ ఇంట్లో వారికి కూడా అత్యంత ప్రియమయిన వ్యక్తి గతంలో అతను తాగినా, తిరిగినా కొన్నేళ్ళ నుండి తనలో కలిగిన పరివర్తన తనకు బాగా తెలుసు కట్నకానుకలు తీసుకున్నా, తీసుకోక పోయినా ఆనంద్‌లాటి వ్యక్తిని భర్తగా పొందటం అదృష్టం అనుకుంది

"నేను కాస్త ఆలోచించుకోవాలి" అన్నయ్య అంగీకారం లేకుండా అతనికి ఆశపెట్టడం బాగుండలేదు ప్రమీలకు

"ఇఫ్ యు డోంట్ మైండ్ ఇప్పుడేం తొందరలేదు బాగా ఆలోచించుకుని నీ నిర్ణయం చెప్పు ఆ తరువాత నేను సారథిని అడుగుతాను"

"అలాగే" అని తలూపింది ప్రమీల

* * * * * *

వారం రోజులు గడచిపోయాయి ప్రమీల ఏ సంగతీ తెలియజేయలేదు ఆమెను చూడాలని మనసు లాగినా ఆమె ఏ సంగతీ చెప్పేవరకూ ఆమెను కలవకూడదు అని నిర్ణయించుకున్నాడు

ఎనిమిదవ రోజు ఈవెనింగ్ పోస్ట్‌లో ప్రమీల వద్ద నుండి లెటర్ వచ్చింది ఆత్రంగా విప్పి చదివాడు

"మీరు అడిగిన దానికి నేను సిద్ధమే మీరు అన్నయ్యతో మాట్లాడండి" ఇంగ్లీషులో నీట్‌గా టైప్ చేసి వుంది

ఆనంద్ హృదయం పొంగిపోయింది

"అన్నయ్యతో మాట్లాడండి" అన్న వాక్యం దగ్గర అతని చూపు నిలచిపోయింది

ప్రమీల తన ప్రేమను ఆమోదించింది కానీ దానికి సారథి అంగీకారం లభించాలి ఎలా? తానుగా సారథిని అడిగి కాదు అనిపించుకుని ఓటమిని భరించలేడు ఈ సమస్య పరిష్కారం కావడం ఎలా?






అతనికి ఆ సమయంలో ఫాదర్ గుర్తు వచ్చారు ... జీవితంలో ఏర్పడిన క్లిష్ట సమస్యలు ఫాదర్ తీర్చారు కానీ ఇప్పుడు ఏర్పడిన ... ష్టమైన సమస్యను పరిష్కరించటానికి ఆ కరుణామయుడి అమృత హ... లేదో? ఫాదర్‌ను తలుచుకుని చాలా బాధపడ్డాడు

ఇంటికి వచ్చాకా తల్లితో ఎప్పటిలా మాట్లాడలేక పోయాడు అన్య మనస్కంగా ఉండిపోయాడు

కొడుకు మనసులో ఏదో బాధ ఉందని రాజేశ్వరి గ్రహించింది అతని మనసులో బాధ చెప్పమని బలవంతం చేసింది

ఆనంద్ ఇక కఠినంగా ఉండలేక పోయాడు ప్రమీల పట్ల తను ఏర్పరచుకున్న ప్రేమ గురించి దానికి ఆమె అంగీకారం గురి... తల్లితో మెల్లగా చెప్పేసాడు

రాజేశ్వరి మొహం వికసించింది

"మరి ఇంతకాలం ఈ సంగతి ఎందుకు దాచావు? అంటూ కొడుకుని కోప్పడింది

కుల మత వివాహాలపై సారథికి ఉన్న అభిప్రాయాల గురించి తల్లితో చెప్పాడు ఆనంద్

"ఈ విషయంలో కూడా సారథి కులాల మతాల విషయం చూస్తాడా?" రాజేశ్వరి ప్రశ్నించింది

కులం గురించి కాకున్నా తన రఫ్ కేరక్టర్ గురించి సారథికి తెలుసు కాబట్టి అది అలో చిస్తాడు అతను ఒప్పుకోలేడు అని ఆనంద మనసులో పీకుతోంది అలా అని తల్లికి చెప్పలేకపోయాడు.

"ఆనంద్! నీ అంతట నువ్వు పెళ్ళి చేసుకుంటానని ఒప్పుకున్నావు నాకు అదే పదివేలు సారథిని ఒప్పించే బాధ్యత నాది సరేనా?" రాజేశ్వరి కొడుకుతో అంది

"నీ ఇష్టం అమ్మా! ఎలా చేసినా నాకు అభ్యంతరం లేదు ముందు ఇది చెప్పు ప్రమీల అంటే నీకు ఇష్టమేనా? కాబోయే అత్తగారివి" కొంటెగా నవ్వుతూ తల్లిని అడిగాడు

"నీకు ఇష్టం అయ్యాకా నాకు ఇష్టం కాక ఎలా ఉంటుంది? సారథీ వాళ్ళది చాలా మంచి కుటుంబం. ప్రమీల బుద్ధిమంతురాలైన ఆడపిల్ల మనకు కష్టంలో, సుఖంలో ఎంతగానో సేవలు చేసింది నువ్వు పెళ్ళి వద్దు అని నిర్లక్ష్యం చేస్తున్నావని మౌనంగా ఉండిపోయాను కానీ ప్రమీల నా కోడలైతే బాగుండును అనే ఊహ నాకు ఎప్పటి నుంచో ఉంది ఆ రాత్రి ఆనంద్ నిశ్చింతగా నిద్రపోయాడు

★ ★ ★ ★ ★ ★

"ఆనంద్!" ఆఫీసర్ రూమ్ స్ప్రింగ్ డోర్స్‌కు "ధన్!" మని చప్పుడయ్యేలా వదిలేస్తూ సారథి లోపలకు అడుగు పెట్టాడు

సారథిని చూడగానే ఆనంద్ రక్తం గడ్డ కట్టింది శరీరం చల్లబడింది అతన్నుంచి ఎన్ని దూషణాలు వినాల్సి వస్తుందో అని భయపడ్డాడు అందుకు కారణం రాజేశ్వరి ఉదయం ఎనిమిది గంటలకు సారథి ఇంటి దగ్గర దించి తను వచ్చేసాడు

"వాట్ హాపెండ్ సారథీ!" తనలో కలిగిన సంచలనాన్ని అణుచుకుంటూ అడిగాడు

"నువ్వు మా ప్రమీలను చేసుకుంటావా?"

"ఏం నీకేమైనా అభ్యంతరమా?"

"లేదు. నాకేం అభ్యంతరం? నీలాటి స్నేహితుడు దాని భర్త అయితే నాకు అంతకుమించి సంతోషం ఏముంది? సంతోషాతిరేకంగా అన్నాడు సారథి.

ఆనంద్ సారథిని అనుమానంగా చూసాడు

"ఒరేయ్! నువ్వు అనేది నిజమేనా! కులం, కులం అంటావుగా!"

"ఓహ్! అదా నీ అనుమానం?" సారథి నవ్వేసాడు.

"నా దగ్గర కులాలు, గిలాలు జాంతానై నీ అమూల్యమైన స్నేహం చాలు మాకు"

"నేను గతంలో చేసిన నేరాలు నీకు తెలుసు" ఆనంద్ మొహం బాధతో నల్లబడిపోయింది.

సారథి వచ్చి స్నేహితుడి చేతులు పట్టుకున్నాడు "ఆ నేరాల మించిన పశ్చాత్తాపం నీలో కలిగింది నువ్వు చేసిన పాపాలు ఆనాడే ప్రక్షాళన అయ్యాయి నువ్వేం సందేహించకు అయినా ముసుగులో గుద్దులాటగా ఇన్నాళ్ళూ ఎందుకు అడగలేదు?"

ఆ సంగతి అంతా నీకు తెలుసు. అందుకే జడిసానురా!"

"పోనీ ఇప్పటికైనా చెప్పావు పొద్దున్న మీ అమ్మగారు వచ్చి అడిగారు ప్రమీల కూడాచెప్పింది అంతే నేను ఆఫీసుకు కూడా వెళ్ళలేదు. మీ అమ్మగారిని ఇంటి దగ్గర దింపి నేను ఇటు వచ్చాను"

"చిన్ననాటి స్నేహితులం ఆ స్నేహం ఇన్నేళ్ళు చెక్కు చెదరక నిలిచింది ఈ రోజు ఆ స్నేహం బావా బావామరుదుల స్నేహంగా మారుతోంది నాకు చాలా సంతోషంగా ఉంది" సారథికి సంతోషంతో ఒళ్ళు తెలియటంలేదు

పది రోజుల తరువాత ఆనంద్, ప్రమీల వివాహం ఆత్మీయుల మధ్య సందడిగా సాధ్యమైనంత నిరాడంబరంగా జరిగిపోయింది.

పసుపు బట్టలతో ఉన్న కొడుకును చూడగానే రాజేశ్వరికి భర్త గుర్తు వచ్చి కళ్ళు చెమర్చాయి

మనస్ఫూర్తిగా కొడుకూ, కోడల్ని దీవించింది.

★ ★ ★ ★ ★ ★

"ప్రమీలా నా జీవితం ఎన్నో మలుపులు తిరిగింది. ఇప్పుడు నీతో పెళ్ళితో కొత్త మలుపులు తిరిగింది ఇక జీవితంలో రాజీపడిపోతాను నా జీవితం ఇక రొటీన్‌గా గడిచిపోవాలి. ఇక ఇంకే మలుపు వద్దు" పాల గ్లాసుతో గదిలోకి వచ్చిన భార్యతో అన్నాడు ఆనంద్.

మధురంగా నవ్వింది ప్రమీల ఆ నవ్వులో అందాలు చూస్తూ మైమరచి నిలబడిపోయాడు ఆనంద్

(అయిపోయింది)

# విజ్ఞానం-వినోదం

బాబ్‌బ్రౌన్



## సమస్య

నీటి ప్రవాహ రహస్యం

## అవసరం

ఒక కర్ర లేదా మీటరు బద్ద పోయడానికి వీలుగా ఉండే జార్ అందులో నీరు

## ఈ విధంగా చేయండి

బొమ్మలో చూపిన విధంగా బద్దని నీటి ప్రవాహంలో పట్టుకోండి నీరు బద్దకి అంటుకొని కొనవరకు ప్రవహిస్తుంది

## ఇలా ఎందుకని?

నీటి పరమాణువులు ఒక దానితో ఒకటి కలుస్తాయి దీనిని సంయోగం అంటారు. అవి బద్దకి అంటుకొనడానికి ప్రయత్నిస్తాయి. దీనిని బంధనం అంటారు. ఈ ప్రయోగం బాగా రాకపోతే బద్దని బాగా శుభ్రం చేయండి ఎక్కువ సూక్ష్మ రంధ్రాలు గల చెక్కతో కర్రను తయారు చేయండి కర్రని వివిధ వాలులలో ఉంచి ప్రయోగం చేయండి





SUPER SPORTS SPECIAL
ఒలింపిక్స్‌కి ముందుగానే
కొనుక్కొని సియోల్‌నుంచి
వేయబడే రిలేని తప్పకుండా
చూడండి!
Solidaire
పెట్ 14 ఎస్ఐ
• తీసుకుని వెళ్ళడానికి చాలా సులభమైన బ్లాక్ అండ్ వైట్ టీవి
• స్పష్టమైన హై-ఇంపేక్ట్ పాలిస్టిరిన్ మోల్డెడ్ డ్యై-టోన్ క్యాబినెట్
• 12-ఛానల్ యాంత్రిక ట్యూనర్.
• వీసిఆర్, వీడియో ఆటలను చేర్చుకోడానికి సౌకర్యము.
• హై-గెయిన్‌కోసం జంట ఏంటినాలు
Solidaire
సాలిడైర్ పోర్టబుల్ బ్లాక్ అండ్ వైట్ టీవి
Insight-DE-703

మృదువుగా హాయి గొల్పే స్త్రీల పెటీట్ పాంటీలు ధరించండి.

నుతి మెత్తని నూలుతో తయారైన, నాగరికంగా, సౌకర్యవంతంగా, మీకు సరిపడేట్టు ప్రత్యేకించి రూపొందించిన స్త్రీల పాంటీలు.

అత్యంత నాణ్యమైన అంచులున్న ఎలాస్టిక్; మీ పాంటీల ఆకారం చెక్కు చెదరకుండా వుంటుంది....ఎల్లప్పుడూ!

రక రకాల ఆకర్షణీయమైన నమూనాలు, మరులు గొల్పే రంగులు....అన్ని వేళలా ధరించేందుకు సంబరపడతారు మీరు. చెప్పలేనంత ఆనందం మీ సొంతం!




Petite
Panties

ఎలాస్టో మిల్స్ ప్రై. లిమిటెడ్,
ఎ–6 మొగప్పేర్ ఇండస్ట్రియల్ ఎస్టేట్ మద్రాసు-600 050 ఫోన్: 423796 (P.P.)

JAISONS FP 1488 TEL




(గత సంచిక తరువాయి)

వెనుక నుండి చివరి తరగతి సామాజికులు చప్పట్లు కొట్టుటయు, ఈలలు వేయుటయు సాగించిరి. చావడి యంతయు గందర గోళముగా నుండెను. తెర యెత్తిరి. రాజరాజ నరేంద్రుడు వచ్చెను. ఆయన మహా నటకుడని యిదివరకే ప్రఖ్యాతి పడి యుండుట చేత జనులందఱు ఆయన యెడల గౌరవము ప్రకటించుచు చప్పటులు చఱచిరి. ఆయన యింగ్లండులో చక్రవర్తి యెదుట మహారాజు వలె శరీరోర్ధ్వ భాగము వంచి యూరపియను సలాము చేసెను.

ధర్మా: మొదటనే రసాభాసమా? తానొక పాత్రగా రంగము మీదికి వచ్చె నాయెను. అప్పుడే తన పాత్ర మఱచిపోయి, తాను కుమారప్ప యైనాడు.

తిరు: రాజరాజ నరేంద్రుని వేషము చూడండి! ఎంత చక్కగా కట్టినో!

కుమార: రాజరాజనరేంద్రుడు నక్కి యంచున చుట్టిన లేత గులాబి పంచ కట్టుకొనునా?

ధర్మా: ఈ నాటకములోని రాజరాజ నరేంద్రుడు చాళుక్య నృపతియే యేని, ఆయన క్షత్రియుడు, కర్మిష్ఠి, రంగుబట్టనే కట్టడు.

కుమా: జరీ పని చేసిన నల్ల ముఖమల్ కోటు తొడుగునా?

ధర్మా: వీండ్రు వేషములు వేయునపుడు పూర్వ రాజుల బొమ్మలు పెద్ద పెద్ద వస్తు ప్రదర్శనశాలలో నుండును. అవి చూచి వాని ప్రకారమైనను వేషములు వేసికొనరు.

కుమార: ఈ ఊరి కోటలోనున్న వంటిరి కదా, హరప్ప, కృష్ణమనాయల చిత్రములు? అవియును చూడవచ్చును.

ధర్మా: ఎవనికి బుట్టిన బిడ్డరా వెక్కి వెక్కి యేడ్చిన"దని యీ గోడంతయు వారికేమి పట్టినది! సామాజికులు తెలియని తమ కంటికి ఏదైన సరే, యింపుగానున్నదనియే యనుకొందురు. అందు చేత వీరి ఆటలు సాగుచున్నవి.

కుమార: మహా మహాదుష్యంతుని వేషమునకే గతి లేదు. వాని వేషము మైసూరు మహారాజా ఖత్తు. ఇంక రాజరాజ నరేంద్రునకు వచ్చినది.

ముగ్గురును నవ్విరి. వీరు ముగ్గురును మాట్లాడుచున్నందుకు ప్రక్క వారికి కోపము వచ్చెను. రాజ రాజనరేంద్రుడు పద్యము చదివినప్పుడెల్ల నొక వికారముగా చదువజొచ్చెను.

ధర్మా: వాచికము చూడు మెంత బాగున్నదో??

కుమార: నెల్లూరు చదువు చదువుచున్నాడు.

ధర్మా: అట్లనకుము. ఆ వైపున మాత్రము మహానుభావులు లేరా? దొరస్వామిగారిని చూచితివా? ఆయన చనిపోయి అయిదారేండ్లయినది. బెజవాడలో ఆయన తానీషా చూచితిని. ఓహో! ఏమి మహానుభావుడు! ఆయన తనవద్దకు వేషము వేయుదునని ఎవడైన వచ్చెనా, మొదట జుట్టు తీయించెడి వాడట. తాను ధరించు పాత్రకనుగుణముగా జుట్టును, మీసములును, గడ్డమును ధరించవలయును. ఇప్పుడు ప్రతివాడును బుట్టంత జుట్టును పెంచును. ఏ వేషమునకైనా అదియే జుట్టు. రారాజ నరేంద్రునకదియే జుట్టు, సారంగధరున కదే జుట్టు. బ్రాహ్మణుడైన సుబుద్ధికి నదియే.

కుమార: పూర్వ నటులకు ప్రస్తుత నటులకు అదే భేదము. పూర్వము నటుడనగనే జుట్టు తీయించెడి వారు. ఇప్పుడు నటుడనగనే జుట్టు పెంచును– ప్రక్కనున్న ఒకాయన– "ఏమయ్యా! మీరు మమ్ము నాటకము చూడనీయరా యేమి?

కుమార– చూడవయ్యా! చూడు! మా మాటలు నీ కన్నులకేమి అడ్డము వచ్చెను? అదిగో! సారంగధరుడు వచ్చుచున్నాడు. చూడుము.

రంగావధాని సారంగధరుడై ముఖమల్‌లాగు, ముఖమల్ కోటు, లేత గులాబి తల గుడ్డ పైని కలికుతురాయితో వచ్చెను. అందఱును చప్పట్లు కొట్టిరి. అతడు వచ్చుచునే పద్యమారంభించెను. సంగీతము పాడి పాడి, పద్యము సగముండగనే ఒక కీర్తన మొదలు పెట్టెను. కీర్తనయైనంతనే మఱల మిగిలిన పద్యము చదివెను. అది అంతయు పావురము లెగురుటను మెచ్చుకొనుట.

ధర్మా: కుమారస్వామీ! ఆ పాటలోని శబ్దములేమియో, వాని అర్థమేదియో నీకు తెలిసినదా?

కుమార: ఈ హార్మనీ, తబలావాండ్రు విననిచ్చిరా? వీరి మ్రోత వాని మ్రోతకన్నా ఎక్కువైనది.

సావజికులందరును పద్య మాపినంతనే చప్పట్లతో నాకాశము పగులగొట్టిరి. "వన్సుమోరు"లు బయలుదేఱెను. సారంగధరుడు రంగము మీద పరవళ్ళు త్రొక్కుచుండెను. రంగ మొకవైపు నుండి మఱియొక వైపునకు పరువులెత్తెను.

కుమా: సారంగధరుడు మంచి వినయవంతుడు సుమండీ! అతని మొగములో చూడుడు! సిగ్గుతో మొగమంతయు మూసికొనిపోయి, ఫాలమెంత విశాలముగా నున్నదో!

ధర్మా: రాజు గదా! మొగము మూసికొనిపోవుట అదృష్ట లక్షణము, కొంతసేపటికి చిత్రాంగి వచ్చెను. వచ్చినంతనే సామాజికు లైదు నిముసముల వఱకు రొదయడగించలేదు. ఈలలు కొట్టు వారు, చప్పట్లు చఱచువారు, అసభ్యములైన కేకలు వేయువారు– చావడి దద్దరిల్లిపోయెను. చిత్రాంగి మాట వినిపించు వఱకు బది నిమిసములు పట్టెను. అదియు ముందున్న వారికి, మంగమ్మ చాల వివేకముతో అభినయించెను, చిత్రాంగి రాజు భార్య,

జరిగిన కథ – 50 :– రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు. దేవదాసి ప్రతిరోజూ దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. రామేశ్వరము జైలుకి పోయిన తరువాత మంగమ్మకు అతని ఆస్తి అంతా దక్కుతుంది. ధర్మారావుకు కొడుకు పుడతాడు. గణాచారి అప్పుడప్పుడూ వేప మండలూ రావిమండలూ ఊరి మీద పడవేస్తూ ఉంటుంది. పంకజమ్మగారి ఇంట అప్పుడప్పుడూ ధర్మారావు భారతీయ తత్వాన్ని గురించి ఉన్యసిస్తూ ఉంటాడు. ఆ ఉపన్యాసాలకు రాధాపతి మొదలయిన వారు నొచ్చుకుంటారు. ధర్మారావు అరుంధతి పశుపతి ఇంటికి వెడతారు. బెజవాడలో ధర్మారావు దుర్గను సకుటుంబంగా సందర్శిస్తాడు. అరుంధతి ఆరోగ్యం చెడిపోతుంది. మంగమ్మ స్వయంగా సినిమాహాలు నడుపుతూ వుంటుంది. మంగమ్మ ధర్మారావుకు నాటకం టిక్కెట్టు పంపుతుంది.

సారంగధరునివలచినది అంత మాత్రమున కులము చేత వచ్చు భోగముది కాదు మంగమ్మ అభినయము తదనుగుణముగానున్నది

కుమార: అందరి కన్న మంగమ్మగారి అభినయమే బాగుగా ఉన్నది

ధర్మా: అవునోయి! ఈ స్త్రీ పాత్ర ధారులకు సత్యభామ, చిత్రాంగి భోగము వాండ్రవలె కనిపింతురు సత్యభామ జగన్నేతకు ప్రియురాలేమిటి? అందులో వివాహము చేసుకొన్న భార్య, రాజకుమారిక, ఆమెను కూడ దుష్టనుగానే ప్రదర్శింతురు

సారంగదరుడు చిత్రాంగి మాట వినలేదు వారిద్దరు నేమేమి అనుకొనుచుండిరో ఒకటే మ్రోగుచున్న సామాజికులకు వినిపించలేదు నటకులందరును వారి వారి భాగములు వారే ఆశువుగా చదివిరి ధర్మవరము కృష్ణమాచార్యుల్లుగారి నాటకమని ప్రకటించిరి కుమారప్పగారు మహాశువుగా వచనములు కొట్టిపోసిరి ఆయన ఒక్కొక్క అభినయమునకు సామాజికులు దిగ్భ్రాంతులైరి

ధర్మా ఆ భ్రూవిక్షేపము, తదవయవ చాలనము చూచితివా? మంచి నటకుడే! అది సహజమైన గుణము తక్కినవి చదువుకొని తెచ్చుకొనవలయును

కుమార ఆయన ఎమ్ ఎ పరీక్షయైనాడండీ

ధర్మా అందుకనియే మరియు అద్వాన్నము వీరందరును పాత్రలయొక్క శీలమునకు క్రొత్త వ్యాఖ్యానము చేయునట్లు నటింతుమందురు వీరికి రస స్వరూపము తెలియదు ఈ వ్యాఖ్యానము లెవరికి కావలయును? అదిగో చూడుము! సారంగధరుని దాని చంపుమని చెప్పి అనవసరముగా రేడియో స్వగతము దంచి స్తంభమభినయించినాడు అతడు స్తంభగతుడై ఉండగా చిత్రాంగి ఆ మాటయన్నది దానికి తాను సమాధానము చెప్పుచున్నాడు స్తంభగతుడైన



ప్రపంచ కప్ స్కై ఛాంపియన్ షిప్‌లలో గెలుపొందిన మొదటి ఆల్ప్సు ప్రాంతేతర వాసి అమెరికాకు చెందిన ఫిల్‌మాహ్‌రె. 1980–81ల్లో జరిగిన ఈ పోటీలో రెండు, మూడో స్థానాలు కూడా ఆల్ప్సు ప్రాంతేతరులకే దక్కాయి. స్వీడన్‌కు చెందిన ఇంగ్‌మార్ స్టెన్‌మార్క్ సోవియట్ యూనియన్‌కు చెందిన అలెగ్జాండర్ జిరోవ్.




## ఆల్ప్సు ప్రాంతేతర విజేతలు

తనకా వాక్యమెట్లు వినిపించినది?

ప్రక్కనున్న ఆయన "అయ్యా! మీ గోలతోనే సరిపోవుచున్నది మేము వచ్చినది నాటకము చూచుటకా, మీ మాటలు వినుటకా" అనెను

కుమార నాటకము చూచినచో మునుపటి వలెనే ఉందువు మా మాటలు వినినచో కొంత బాగు పడవచ్చును

ప్రక్కాయన "తెలివి తేటలు కలవాడవులే ఇంక నోరు మూయు"మనెను ధర్మారావు "ఏందుకయ్యా తొందరపడెద"వనెను ప్రక్కాయన "ఇందాకటి నుంచి చూచుచుంటిని మీరిద్దరు వాగినట్లే ఉన్నారు పైగా పెద్ద మనిసివలె సర్ది చెప్ప వచ్చెదవు కుఱ్ఱ వాడిందాక తన్నులు తినెను నీకు కూడ కావలయునా?" అనెను కుమారస్వామి ధర్మారావులు వాగ్వృత్తి గాని, హస్త వృత్తి ఎరుగరు. తిరుగబడినచో ధర్మారావు రెండు కొట్టగలడు, రెండు తినగలడు, కాని అట్టి చేట్ట దెబ్బ లాడుట అతనికి మర్యాద కాదు అప్పటికే నలుగురు అతని వంక చూచుచుండిరి అందుకని ధర్మారావు మాటాడక ఊరకుండెను. కాని అతని కన్నులలో నిప్పులు కురియుచుండెను ప్రక్కాయన ధర్మారావు వంక కోర చూపులు చూచుచుండెను. ధర్మారావు బయటికి పోయి చివరి తరగతిలో వెదకెను అచ్చట వేంకటేశమని ఒకడు కనిపించెను వాడు గొల్ల. కబీరునకు వానికి మిక్కిలి స్నేహము, ధర్మారావు వేంకటేశమును దీసికొని వచ్చి ఆ ప్రక్కాయనను చూపించెను "ఇతడు నన్ను గొట్టునట! ఇంటికి పోవు వఱకు జాగ్రత్తగా చూచుచుండు"మనెను తిరుమలరావును కొట్టిన రౌడీ "ఏమిటిరా, వేంకటేశము!" అని కేక వేసెను వేంకటేశము "ఇచ్చట నొక ముండ ఉన్నదిలే! అది కొట్టునట!" అనెను ప్రక్కాయన వేంకటేశము వంక, దూరమందున్న రౌడీ వంక మిఱ్ఱి మిఱ్ఱి చూచెను వేంకటేశము "రా! బయటికిరా!" అని గద్దించెను

## వేయిపడగలు

ప్రక్కాయనకు ముదురు పాకమున పడ్డదని తెలిసినది అంతటితో అతడూరకుండెను. గేది క్రాపింగు రౌడీకి ధర్మారావు వేంకటేశమును తెచ్చెనని తెలిసెను ధర్మారావాదరించిన కుఱ్ఱవానిని తాను కొట్టెను. రౌడీ తాను కూర్చున్న చోటు నుండి లేచి, తిరుమలరావును "నీ స్థలములో నీవు కూర్చుండవయ్యా" అని పిలిచెను తిరుమలరావు "దెబ్బ చాలునులే" అనెను వాడు మరి మాట్లాడక చావడిలో నుంచి వెడలిపోయెను

నాటకములో హాస్యగాడొకడుండెను వాడది వఱకె గ్రామ ఫోను ప్లేటులు కొన్ని యిచ్చెను ఆ హాస్యగాడు రాజ సేవకుని వేషము వేసికొని వచ్చెను సామాజికులు వానిని వాడిచ్చిన గ్రామఫోను పాటలు పాడమని కేకలు వేసిరి. రాజరాజ నరేంద్రుడు మూర్ఛలో నుండెను. చిత్రాంగి ఉద్విగ్న స్థితిలో నుండెను. వాడు పాటలు పాడక తప్పక వచ్చెను. వాడు పాడినంతసేపు రాజరాజ నరేంద్రుడు మూర్ఛలో ఎట్లుండును? ఆమె యుద్విగ్న ముఖ లక్షణములే ఎట్లు నిలుపుకొనును? సామాజికులు కేకలు మరియు ఎక్కువయ్యెను కుమారప్ప గొప్ప నటుడు, ఆయన రసభంగమైన యెడనన్నియు సర్దుకొని వచ్చునట వారు వెంటనే మూర్ఛదేరి, "సేవకుడా! మా మనస్సు చాల విషాదపూరితమై ఉన్నది నీవు కొంత సంగీతము చేసి మాకు సంతోషము కలిగించుము" అనెను వాడు పాటలు పాడెను ధర్మారావు దిగ్భ్రాంతుడైపోయెను కుమారస్వామి కుమారప్పను తిట్టుచుండెను ప్రక్కాయన కన్నులు ముందుండెను గాని వెనుకకే చూచుచుండెను అందుచే కుమారస్వామి మాటలు వినిపించలేదు

ధర్మారావు రెండు గంటల కింటికి పోయెను సావిత్రమ్మగారు తలుపు తీసెను అతడు పోయి పాద ప్రక్షాళనము చేసికొని, చిన్న మంచముపై పరుండెను పిల్లవానిని పెట్టుకొని అరుంధతి పెద్ద మంచము మీద పరున్నది ఆమెకు మెలకువ వచ్చి "ఇంటికి సరిగా వచ్చితిరా" అనెను ధర్మారావు "అంత సరిగా రాలేదు" అనెను

అరుం దారిలో పాముద్దము వచ్చెనా?

ధర్మా నాకెప్పుడును పాముద్దము రాదు నన్ను రక్షించునదే పాము.

అరుం: ఆయనకు పని కల్పించునదే మీరు!

ధర్మారావు నిదురపోయెను తెల్లవాఱు వచ్చుచుండెను. అతనికొక కల వచ్చెను ధర్మారావొక చోట కూర్చుండెను ఆ స్థలము సముద్రపుటొడ్డు



'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.



## ఆచ్ఛాదన లేని మోకాళ్ళు నిషేధం

ఆచ్ఛాదన లేకుండా మోకాళ్ళను ప్రదర్శించే నౌకర్లను ఇంగ్లీషు ఫుట్‌బాల్ అసోసియేషన్ 1904లో నిషేధించింది. ఆ నిషేధం 1907లో సడలించ బడింది.




## 41 రోజుల్లో మూడు రికార్డులు

1979లో 41 రోజుల వ్యవధిలోనే ఇంగ్లీషు పరుగు పందెం క్రీడాకారుడు సెబాస్టియన్ కో మూడు ప్రపంచ రికార్డులు స్థాపించారు. ఎనిమిది వందల మీటర్లు, మైలు, 1500 మీటర్లు పరుగుల్లో ఒకేసారి ప్రపంచ రికార్డును స్థాపించిన మొదటి క్రీడాకారుడు ఆయనే.

సముద్రము హోరుమని మ్రోయుచుండెను. మబ్బు పట్టి చినుకులు పడుచుండెను. గాలి హోరుమని ఫెళ ఫెళార్భటులతో వీచుచుండెను. ధర్మారావచటి నుండి లేచిపోవుదమనుకొనెను. కాని లేవలేదు. జలము పొంగి అంతకంతకు తన మీదికి వచ్చుచున్నది. మరి కొంతసేపు కూర్చున్నచో సముద్రము తన్ను ముంచి వేయునేమో! అతని కేమియు తోచలేదు. ధర్మారావు మనస్సులో "రామరామ" అనుకొనెను. అంతలో అతనికి తాను చూచుచున్న సముద్రము మీది నుండి వేయిపడగలతో ఒక మహా సర్పమవతరించెను. తన్మహా సర్ప సహస్ర ఫణా మండలి ధర్మారావు చుట్టు నభేద్యమైన మణి ప్రాకారము నిర్మించెను. సముద్రము ఫణామండలమును తన తీవ్రతరంగా ఘాతములచే తాడించెను. ఆ తాడనములకు సహస్రఫణములలో ఉన్న చిన్న చిన్న బొమికలన్నియు విరిగి నిశ్శేషముకము అయ్యెనేమో! మణి ప్రాకారమభేద్యముగానుండెను- అరుంధతి వచ్చి భర్తను లేపి, పోయి పిల్లవాని యొద్ద పండుకొనుడనెను. అతనికి మెలకువ వచ్చి చూడగా తన చుట్టునున్న మణి ప్రాకారము భార్య మందస్మితచ్ఛటాపాళిగా గోచరించెను. అదియే యిదియై పరిణమించెను. గాబోలు!

మఱునాడు కుమారస్వామి మంగమ్మ యింటికి పోయెను. ప్రొద్దు క్రుంక వచ్చినది. ఇంట నొక్క మంగమ్మయే ఉండెను.

కుమార: నటకు లందరు. ఏరండీ?

మంగ: కోట చూచుటకు పోయిరి.

కుమా: మీరు వెళ్ళలేదేమి?

మంగ: ఎవరైన నీబోటి పెద్దలు వచ్చెదరు ఆతిథ్యమీయవలెనని.

కుమా: అర్ఘ్యమా అనా ర్ఘ్యమా?

మంగ: నీవు పండితుడవు, నాకేమి తెలియును.

కుమా: అదిగాదండి? అర్ఘ్యమైనచో ఆవు పెయ్యయేదైన ఉన్నచో చంపి వండి పెట్టవలయును.

మంగ: ఆవు పెయ్య లేదు; చిన్న గేదె పడ్డ ఉన్నది. అది మైనన వండి పెట్టుటకు రాదు. పెండ్లి చేసికొనుటకైనచో ఇచ్చెదను.

కుమా: మాకు పెండ్లియే కాలేదాయెను. అయిన తరువాత దున్నలు పుట్టినచో మీ సంబంధము చేసికొందుము.

మంగమ్మ: అవునప్పటికి మన సిద్ధాంతము సరిపోవును. మా గేదె పడ్డ పెద్దది. మీ దున్న చిన్నది.

కుమా: ఇప్పుడు రాధాపతిగారుండవలయును.

మంగ: తల కొట్టి మొల వేయునా?

కుమా: అయిన వాడేదైనను చేయవచ్చును.

మంగ: అల్లరి పిల్లడా! నీవిక్కడ నుండి వెళ్ళిపో!

కుమా: ఈ ఆతిథ్య మార్గము కాదు; అనార్ఘ్యము కాదు.

మంగమ్మ: అవునుగాని, ధర్మారావుగారిని కలిసికొంటివా?

కుమా: ఇంత వరకు నిద్దురపోవుటయే సరిపోయినది. ఎందుకు?

మంగమ్మ: నాటకమెట్లున్నదో?

కుమా: నేను చెప్పుదునా?

మంగ: నీవు చెప్పునది నాకక్కరలేదు.

కుమా: ధర్మారావుగారి కెట్లున్నదో చెప్పెదను.

మంగ: అది నీకెట్లు తెలియును?

కుమార: రాత్రి మేమిద్దఱము ఒక చోటనే కూర్చున్నాము. నాటక మాడినంత సేపు ధర్మారావు గారు నాటకము తనకెట్లున్నదో చెప్పుచునే ఉన్నారు.

మంగ: ఎట్లున్నది?

కుమారస్వామి తనకిష్టము లేని విషయమును చేయి నేలకు చూపించి యిట్లున్నదని చెప్పును. అనగా మంటిపాలినున్నదని అతని అర్థము. చేయి అట్లు చూపించుట అందరికి కోపము. కుమారస్వామి అట్లు చేసినప్పుడెల్ల మంగమ్మ, పంకజమ్మ, రాధాపతులు మండిపోదురు. మంగమ్మ నాటకమెట్లున్నదనగా కుమారస్వామి యిట్లున్నదని చేయి నేల వంక చూపించెను. ఆమె కూర్చున్నది లేచి, కఱ్ఱ ఒకటి పుచ్చుకొని, "నీ వింక మా యింటికి రాకు. ఫో" అని కొట్టబోయెను.

కుమా: కొట్టవమ్మా! కొట్టు! నేను ధర్మారావుగారి అభిప్రాయమిట్లున్నదని చెప్పినాను.

కొట్టు! దెబ్బ తీసికొనిపోయి ధర్మారావుగారికే యిచ్చెదను- ఆమె కఱ్ఱ పారవేసి పోయి, మఱల కుర్చీలో కూర్చుండి, "నిజముగా వారట్లే అన్నారా?" అనెను.

కుమా: వారు నేల మీద నుమియలేదు.

మంగ-ఏమియు బాగుండలేదా?

కుమా: మీ వేషమే కొంత బాగున్నదన్నారు.

మంగ: పోవోయి ముఖస్తుతి సేయుచుంటివి! నేనె న్నడును రంగము మీదికే ఎక్కలేదు.

కుమా: నాలుగైదుసార్లు రంగము మీది కెక్కుట వలన భయము వదులుటయే కదా లాభము. అది మీకిది వరకే వదిలినది.

మంగ: నీవు నన్నే మాట పడిన ఆ మాటయే అనుచున్నావు.

కుమా: అందరిననుటకు వీలగునా? మీరన్నచో నాకు చనవున్నది గనుక అనుచున్నాను.

మంగ: ఇప్పుడీ కబుర్లకేనా, ఏదైనా పని ఉండి వచ్చినావా?

కుమా రాత్రి నాటకమునకే మాత్రము డబ్బు వచ్చినది?

మంగ పన్నెండు వందలు వచ్చినవి

కుమా. జనము డబ్బు లేదు, లేదని ఏడ్చెదరు ఎచట నాటకము వేసినను వేయికి తక్కువ లేదు! ఖర్చులు పోగానే పన్నెండు వందలా?

మంగ కాదు, ఖర్చులు నాలుగు వందలైనవి

కుమా నాలుగు వందల పది రూపాయలైనవి

మంగ అది యేమిటి?

కుమార ఇప్పుడు పది రూపాయలు నాకిచ్చు చున్నారు కదా?

మంగ నేనిచ్చుట లేదు

కుమా ఇచ్చుటలేదా? నేను గుంటూరు పోయి రావలయును

మంగ నా దగ్గఱ లేదు అత్తగారి నడిగి తీసికొనరాదా?

కుమా· అత్తగారైన అడుగనే అక్కఱలేదు ఆమెకు నామీద ఇప్పుడు కంఠము వఱకున్న( అప్పుగానే యిందు, మఱల తీర్చెదను

మంగ ఇదివఱకిచ్చిన పాతిక రూపాయలు?

కుమా అన్నియు కలిపి ఒకసారియే యిచ్చెదను అంత అపనమ్మకమైనచో నోటు వ్రాయించుకొనుడు

మంగమ్మ నాలుక గీసుకొనుటకా?

కుమా ఈ డబ్బంతయు మీదైనట్లు మాటాడెదరేమి?

మంగమ్మ మరి ఎవరిది?

కుమా ఆ చెఱసాలలోని కేగినాయనది

మంగ వానిది, నీది

కుమా ఎవరిదో నాకెందుకు, పది రూకలిట్లు పారవేయండి పోదును

మంగ రాధాపతిగారిని - రానిమ్ము డబ్బాయన వద్దనున్నది

కుమా ఆయన వచ్చినచో నాకు వచ్చినట్లే! అబ్బో! మీరా! డబ్బు నమ్మి ఆయన వద్ద ఉంచెదిది? ఏడిపించక తొందరగా ఇప్పించవమ్మా

మంగ తెపు ప్రొద్దున్న గదా! వెళ్ళునది!

కుమా ఎందుకు చంపెదవు? ఇచ్చినచో నిమ్ము, లేకపోయినచో నేను పోవుచున్నాను

మంగ రావయ్యా? అంత కోపమెందుకు?

కుమా చెంగల్రావు కూడ షికారు వెళ్ళెనా?

మంగ రాధాపతిగారు వానిని కోటలో దాసీవాండ్రలో కలిపి వచ్చెదనన్నాడు వాడు భయపడి రానోయని గోలకెత్తెను రంగావధాని వట్టిదే అని లాలన చేసి తీసికొనిపోయెను

కుమా రంగావధానిగారనరేమి? ఓహో! అందుకనియా!

మంగ ఎందుకని?

కుమా ఆయన సారంగధరుడు మీరు చిత్రాంగి, అందుకని

మంగ నేను పది రూపాయలీయను ఫో!

కుమా నేనన్న మాటలో తప్పేమున్నది? సారంగధరునకు చిత్రాంగికి ఏమి సంబంధమున్నది?

మంగ డబ్బిచ్చెదను, తీసికొని పో గోల!- అని తెచ్చి యిచ్చెను

కుమా అయ్యో! ఇంకొక పది రూపాయలన్న అడుగకపోతిని!

మంగ ఆ డబ్బిటు తే! నీకు దిమ్మకొక్కగా నున్నది! ఇక్కడ డబ్బు ఫోగు వేసికొని కూర్చున్నానా యేమి?

కుమా మఱల పుచ్చుకొను డబ్బు కోసమింత అల్లరి చేసెదరేమి?

మంగ తిమ్మనగారు తీరుగా కూర్చుండబెట్టి బారుగా వడ్డింతురన్నట్లు నీవు డబ్బు మఱల ఈయబోవుచున్నావు!

కుమా నేను మఱల ఈయవలయునేమో అనుకొన్నాను లెండి! అక్కఱ లేనిచో సరే!

మంగ· ఎంత మంది తినుచున్నారు నా డబ్బు!

కుమా అట్లయినచో ఈ వెధవ డబ్బు నాకక్కరలేదు, తీసికొనుము

మంగ. ఇటు తే- కుమారస్వామి నవ్వుచు వెడలిపోయెను కుమారస్వామి అట్లు పోయెను, నటకు లందరు ఇట్లు వచ్చిరి రాధాపతి మంగమ్మను చూచి "కుమారస్వామి బుజము లెగుర వైచుచు బోవుచున్నా డే!" అనెను

మంగ ఇక్కడకు వచ్చుచున్నాడా?

రాధా ఇక్కడ నుండియే కదా పోవుచున్నాడు

మంగ అతడిక్కడకు రానేలేదే?

రాధా అబద్ధాలెందుకు?

మంగ వచ్చెననగా మీరు చంపుదురా?

రాధా ఆ కాడికి బెదరుట యెందుకు?

మంగ ఎవరు బెదరిరి?

## మానవతా! నీవెక్కడ?

ఆకలితో అలమటిసూ్త
ముసలితనం అలుముకున్న
అభాగ్యురాలు అర్థిస్తే
మంచినీళ్లయినా ఇవ్వకుండా
ఛీ, ఛీ! ఫో, పో–
వృద్ధస్త్రీల సంక్షేమానికంటూ
అందమైన ఆడవాళ్ళు
నైసుగా అడిగితే
ఐసయి పోయి
కూల్‌డ్రింక్స్‌తో పాటు
నూటా పదహార్లిచ్చి
ఆహా! ఓహో! –

–బొగ్గరపు'రాధాకృష్ణమూర్తి

రంగావధాని: ఎవరు బెదరిరి! మంగమ్మ బెదరినది అవిగో కన్నులు, కనబడుట లేదా?

కుమారప్ప. ఏరా, అవధానీ, లేడి కన్నుల వలెనున్నవా యేమి?

మంగ: అవును ఒక యేడాది నుండి అట్లేయున్నవి

రంగా· అది వఱకు

మంగ. కుమారస్వామి ఉన్నచో చెప్పెడివాడు!

రంగా· ఆ మాట నీవే చెప్పరాదా?

మంగ చెంగల్రావు వచ్చినాడా?

కుమారప్ప మేము వెళ్ళినాము మాకు మఱల కనిపించలేదు, అందరును మాకు దాసీవాండ్రే కనిపించిరి వారిలో ఇతడు కలిసి పోయెను కాబోలు! మేము గుర్తు పట్టలేకపోయినాము

అంతలో చెంగల్రావచటికి వచ్చెను అతడు వచ్చి కూర్చుండి "అప్పా! కాళ్ళు పిసుకనా" అని ఆమె పాద సంవాహనము చేయుచుండెను

రంగా· ఒక్కొక్కరు దళము వేసికొని పుట్టెదరోయి! దమ్మిడీ కర్చు లేకుండా మంగమ్మకు చూడు, పరిచారకుడు దొరకెను

మంగ· బోలెడంత డబ్బు కర్చై మీరందరును దొరికిరి దానికేమి చెప్పెదవు

రంగా: రాతిరి మిగిలిన ఎనిమిది వందల మాట యేమి చెప్పెదవు?

కుమారప్ప ఏడు వందలే అనుము కుమారప్ప నూట పదార్లు పుచ్చుకొనకుండ వేషము వేయడు కదా!

రంగా రంగావధాని మాత్రము తక్కువ తిన్నాడా

మంగ రెండవ తరగతి రైలు ఖర్చులు, కాఫీ హోటళ్ళు సిగరెట్లు, రాతిరి తెచ్చిన సీసాలు ఇవి అన్నియు మీరు పెట్టుకొనినచో నాకేమియు అభ్యంతరము లేదు రాతిరి ఎనిమిది వందలు మిగులలేదు

రంగా ఎంత మిగిలినదమ్మా? పది రూపాయలు మిగిలినవా?

మంగ· సరిగా అంతే మిగిలినవి అవియే కుమారస్వామికిచ్చినది

రాధా అతడిచటికి రానేలేదంటివి గదా?

మంగ మీరు నాకేమి తాళి కట్టితిరా? అంత బాదరబందీ యేల?

రంగా· ఏమండీ, రాధాపతిగారూ మీరు "ఎనటోలు ఫ్రాన్సు" వ్రాసిన "రెడ్ లిల్లీ" చదివినారు కాదు? అందులో నా చిత్రకారుడున్నాడే, మీ యీర్ష్య అట్లున్నది,

రాధా· అతనిదే "థేయాస్" అను నవలయున్నది మంగమ్మ చివరకట్లగునటులున్నది

మంగ. అది ఎట్లయినది?

రాధా. ఆ "థెయాస్" అన్నది స్త్రీ. బోగముది ఒక సన్యాసి యామెను పట్టణములో నుండి తీసికొని

# నా ప్రపంచమే తలక్రిందులై పోయేది...



## నేను న్యూ ఇండియాతో పశువుల భీమా చేయించి వుండకపోతే



నా ఎద్దులు చచ్చిపోయాయి, కాని పని మాత్రం ఆగి పోలేదు
ఎందుకంటే, న్యూ ఇండియా సహాయంతో కొత్త ఎద్దులు కొనుక్కోగలిగా.

రైతుకు అతడి ఎద్దులు ఎంత విలువైనవో, అతడికి, అతడి కుటుంబం వారికి బాగా తెలుసు. కాని, ఆ ఎద్దులకు రోగమొస్తే, ప్రమాదంలో దెబ్బ తగిలి పనికి రాకపోతే... లేదా చచ్చిపోతే? అలాంటప్పుడు న్యూ ఇండియా ఎష్యూరెన్స్ ఒక మంచి నేస్తంలా మీకు ఆధారంగా నిలుస్తుంది.

**న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారి పశువుల భీమా**

ఒక ఏడాదిలో, పశువుల ఖరీదును బట్టి, ప్రతి 100 రూపాయలపై గరిష్ఠం 4 రూపాయలు చెల్లిస్తే చాలు! దేశమంతటా న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారివి దాదాపు 1000 కార్యాలయాలు వున్నాయి. ఎక్కువ వివరాల కోసం నేడే మీ ఏజెంట్‌ను కలవండి లేదా మీకు దగ్గరలోని కార్యాలయానికి విచ్చేయండి.

## న్యూ ఇండియా ఎష్యూరెన్స్




జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ

పశువుల భీమా–నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం!

R K SWAMY/NIA/3574/TEL

పోయి ఒక ఆశ్రమములో ప్రవేశ పెట్టెను. అచటనామె మహా భక్తురాలైనది. ఈ సన్న్యాసి చెడిపోయెను.

రంగా: ఇందులో మీరు సన్న్యాసిగా కనబడుటలేదే?

కుమారప్ప: రాధాపతిగారిలో పూర్వ భాగమేమో కాని, పర భాగమట్లే కానవచ్చును.

మంగ: ఆమె పేరేమి?

రంగా: థయీస్. లేకపోయినచో వై క్రైంచి వారెట్లుచ్చరింతురో తెలియదు.

మరునాడు చక్రవర్తి వచ్చెను. కుమారస్వామి గ్రామములో లేడు. సాయంవేళ పంకజమ్మగారి యింటివద్ద రెండిండ్ల వారు సభ చేసిరి.

పంక: ధర్మారావుగారు లేరే!

చక్ర: దూత లేదు కదా!

శ్యామల: ఆ దిగులెందుకు నేనే పోయి పిలుచుకొని వత్తును. మంగమ్మ లేచి వాకిటిలో నున్న తన బండి వానిని పిలిచి, శ్యామలను పొమ్మని నిర్బంధ పెట్టి పంపించెను. చక్రవర్తి వెలతెల పోయెను. పంకజమ్మ తలవాల్చెను. రాధాపతి గోళ్ళు కొరుకుకొనుచుండెను.

రంగావధాని: ధర్మారావనగా, పత్రికలలో వ్రాయుచుండునాయన యేనా? చాల రసవంతముగా వ్రాయను. మా ఊరిలో పండితులందరు ఆయనన మెచ్చుకొందురు.

మంగ: వారే వారిదీ యూరు, వారు బి.ఏ. పరీక్ష యిచ్చినారు. వారు చాల మేధావులు.

తరువాత ఒక పది నిముషములు అందరు నిశ్శబ్దముగా ఉండిరి. ధర్మారావును, శ్యామలయు వచ్చిరి. కుమారప్ప రంగావధానులకు ధర్మారావును శ్యామల పరిచయము చేసెను.

రంగా: నేను తమ కావ్యములు చాల చదివితిని. మీ యశస్సు యెరుగుదునుగాని మిమ్మెరుగను.. తమరు మొన్న రాత్రి నాటకమునకు దయచేసితిరా? ఈ ప్రశ్నతో కుమారప్ప మొగమునకు నొక తీవి గోచరించెను.

ధర్మా: వచ్చితిని.

పంక: ఎట్లున్నది.

ధర్మా: నాటకముల సంగతి నాకేమి తెలియును? పెద్ద పెద్ద నటుల మీద నా విమర్శ యేమి?

రాధా: అట్లు కాదు మీరు దేనిని గురించి అయినను చెప్పగలరు. మా, రంగావధాని సారంగధరుని కన్న నారదుని వేషము బాగుగా నుండెను.

ధర్మా: నాలుగైన అభినయములలో ఆహార్యకము వాచికము మొదట చక్కగా నుండినచో చూడముచ్చటగా ఉండును. నాకు తెలిసినంత వఱకు ఆంగికము నేర్చిన నటుడే కనిపించలేను. సాత్త్వికము కొంత ప్రకటింతురు. అది వారికి సహజమైన లక్షణము. ఆహార్యక వాచికములు లేనే లేవు. ఈ నటకులందరికిని తెలియనే తెలియదు.

రాధా: ఒక్క పెద్ద మాట అని వేసినారే!

ధర్మా: నాకా సంగతి ఎక్కువ తెలియదని మొదటనే చెప్పితిని గదా!

రంగా: మీకే తెలియనట్లున్నది.

ధర్మా: నారదుని వేషము కట్టుదురా, అది యేమి? శాకుంతలములో కణ్వుడు, కణ్వ శిష్యులేమి- మరియొక ఋషి వేషమేమి- మఠములోని బైరాగుల వలె వేషములు వేయుదురు. నారదుడు దివ్యర్షి. నఖశిఖాపర్యంతము తెల్లనివాడు. శిశు పాలవధలో ప్రథమ సర్గలో నారదు లవతరింతురు. మాఘుడిరువది శ్లోకముల దాక నారదుని వర్ణించి నాడు. మన నటకులు చివరకు నారదునకు తెల్లని గడ్డమైన కట్టరు. ఆ నారదుడు సామగాన వేత్త. భజన కీర్తనలు పాడుటేమిటి, భజన కీర్తనలైనను కాదు. పార్శీ మెట్లు పాడుట ఏమిటి?

రాధా: మీరు చెప్పినది బాగుగానే ఉన్నది. కాని శిల్పము రెండు విధములు. ఒకటి ఆదర్శకము; రెండవది సర్వజనా కర్షకము. ఇప్పుడు రంగముల మీద గోచరించునది జనాకర్షకమైన శిల్పము.

ధర్మా: అవును; రాయబారమునకు పోవు కృష్ణుడరువది ఏండ్ల వాడు- రెండు మహారాజ

వంశముల మధ్యగల వ్యవహారమును పొసగించుటకు పోవుచున్నవాడు. రాజనీతివేత్త కౌరవ సభకు పోవుచు- బృందావనము నాటి కృష్ణుని వలె పోవును నెమలిపింఛము పెట్టుకొనినగాని, నీలి రంగు బనియను తొడుగుకొనినగాని కృష్ణుడు కాదాయెను ఇది జనాకర్షక శిల్పమే!

రాధా అవును కృష్ణుడనగా సామాన్యులకే భావమున్నదో శిల్పియైన నటుడా భావమునే చిత్రించుచున్నాడు.

ధర్మా మీరందరును హూణభాషా విశారదులు కదా? కుమారప్పగారు షేక్స్పియర్ నాటకముల గూడ నాడుదురని విన్నాను వారొక షైలకు వేషమో, హామ్లెటు వేషమో వేయుదురనుకొనుడు ఆ పాత్రయొక్క వయస్సు, వాని జాతి దుస్తులు, మొదలైనవి చక్కగా చదివియున్నారా, లేదా! షైలాకు వేషము యూదుని వలె వేయుటలేదా! షైలాకనగా వడ్డి వర్తకుడు ఒక కోమటి వలె వేషము వేసికొని రమ్మనుడు! భారతీయులకు చక్కగా తెలియును.

రాధా అవును. ఇంగ్లాండులో 'నిప్పుడట్లే ఆడుచున్నారట! షేక్స్పియరు నాటకములు ఆధునిక సంప్రదాయముల కనుగుణముగా వేషములు వేసి ఆడుచున్నారట! "హామ్లెటు" డెన్మార్కు యువరాజువలెగాక నేటి ఒక హూణ యువకునివలె వేషము వేసికొని వచ్చుచున్నాడట! అదియు శిల్పమే

ధర్మా: అట్లయినచో కృష్ణుడు బృందావన కృష్ణునివలె వచ్చుటెందులకు? నేటి ఒక పెద్ద రాజకీయవేత్తయైన రాయబారి వలె వేషము వేసికొని రమ్మనుడు! సప్రూ, జయకరులవలె వేషము వేసికొనుమనుడు!

రాధా: మీదంతయు విపరీత వాదన.

మంగమ్మ: మనకు నచ్చులేదు కనుక.

రంగా: ధర్మారావుగారు చెప్పినది త్రోసివేయుటకు వీలు లేదు ఏమో కాని, నారదుని వేషము మాత్రము వారు చెప్పినట్లే నేనింక పోసదను. సామాజికులను కొనునట్లు మనము వేషము ధరించుటేమి! అది యెట్లు ధరియింపవలయునో అట్లు ధరియింప వలయును గాని

ధర్మా: నాటకమనునది ఒక విద్యా బోధనా సంస్థ అనభ్యస్త విద్యులగు సామాన్యులకు పూర్వకాల మందలి రాజులు, ఋషులు మొదలైన వారెట్లుండిరో వారికి తెలియజేయవలెను నలునివేషము, తాగిన యెఱ్ఱని కనులతో ఈచుకుపోయిన రొమ్ముతో, కృత్రిమముగా ఒకడు వేషము వేయును అతనిని "నిర్మల నిజ కథా నిమిషకల్లోలినీ క్షాళితాఖిల జగత్కల్మషుం" డన్నాడు. తన కథయన్న గంగ చేత, లోకము పాపములను గడిగిన వాడట నీ వేషము చేత, నీ యభినయనము చేత నలుడంతటి వాడుగా సామాజికులకు నీవు స్ఫురింపజేయవలదా? అపుడు విద్య బోధించినట్లగును నాటకము శిల్పమైనచో దానికి ప్రయోజనమది అప్పుడే నిజమైన యానందము కలుగును గనుక

రంగా: మీరు చెప్పినట్లు చూచినచో ఇప్పటి నాటకములు . నాటకములే కావు, నటులు నటులే కారు.

ధర్మా: ఇప్పుడు, నేనేమి చెప్పితిని? ఆంగిక సాత్త్వికములగాధములైన విషయములు ఆలోతు మనవారికి అసలందుట లేదు అచ్చటచ్చట మహానుభావులే లేకపోలేదు వారైనను చక్కగా చదువు కొనినగాని వారి రచన నిర్దుష్టముగా నుండదు నేనేదో పని మీద నుండగా శ్యామల మీతో మాయమ్మ చాలనవసరముగా మాటాడవలె అనుచున్నదని చెప్పెను నేను నిజమే అనుకొంటిని క్షమించవలయును సెలవు-"

రంగావధాని లేచి నమస్కారము చేసెను శ్యామల బయటిదాక నంపించెను బండి వానితో దిగబెట్టి రమ్మని; చెప్పెను అయన రెండు నిముసములూరు కుండి "విమర్శన అంతయు నాటు సరకు" అనెను చక్రవర్తి నవ్వెను ఒక్క వేసంగి వెచ్చని ఆవిరిగాలి మంటలూది పోసెను

(ఇంకా ఉంది)

## ఇ'వేమన' పద్యాలు

### కొక్కెర



# వారఫలం

## 3-6-1988 శుక్రవారం మొదలు 9-6-1988 గురువారం వరకు

★ **మేషం**· గ్రహానుకూలత గల సమయం మీ ఆశయం లాభప్రదంగా నెరవేరుతుంది శుభ కార్యాలోచనలు అనుకూలించే సమయం వృత్తియందు వికాస మున్నది అభివృద్ధికరమైన దినాలు వ్యాపారస్తులకు మరింత అనుకూలం, స్త్రీలకు సర్వానుకూలం, వృత్తి వికాసం

★ **వృషభం**. సభా గౌరవ మున్నది మీ మాట నల్గురకు యోగదాయకం కార్యాచరణమునకు అనుకూల వారం దూర ప్రాంతాలకు ప్రయాణం కట్టాలనే మీ వాంఛ లాభదాయకం అనుకూల వార్తా శ్రవణం స్త్రీలకు రాజకీయ రంగాన మేలు కృషియందు పెంపు, ఆరోగ్య వృద్ధి, ఉత్తమ స్నేహం

★ **మిధునం**. గ్రహానుకూలత గల వారం కళాసాహిత్య రంగాలందు మీకు ప్రవేశమున్న లాబదాయకమని గ్రహించాలి, కృషి చేయాలి, వస్తు సేకరణకు కొందరకు ప్రయాణావకాశం విద్యావేత్తల సహాయం లభిస్తుంది గ్రహించండి స్త్రీలకు నూతనోద్యోగానికి యత్నించే లాగైతే మేలే పత్రికా గౌరవం లభ్యమవుతుంది

★ **కర్కాటకం**. అనుకూల వార్తా శ్రవణం ఆనంద దాయకమైన వారం పది మందిలో పేరు ప్రతిష్ఠలకు ఆస్కార మున్నది రాజకీయాలందు రాణింపు నిశ్చయం రావలసిన డబ్బు అందటం వార విశేషం సుఖ శాంతులకు లోపం లేదు స్త్రీలకు నాట్య కోవిదులకు, సంగీత ప్రవీణులకు చెప్పదగిన అవకాశాలున్నాయి

★ **సింహం**. అప్తుల సహాయ మున్నది విద్యావేత్తల వలన మేలున్నది సభా గౌరవ మున్నది మిత్ర రంగానుకూల మున్నది విదేశ మిత్రుల వలన కొందరకు కాకపోయినా కొందర కైనా మేలు చేకూర నున్నది కొందరకు నూతనోత్సాహం, ఎందుకు? ఉద్యోగం చిక్కినందుకు స్త్రీలకు అనుకూల మిత్ర సమాగమం, దనలబ్ధి

★ **కన్య**· బంధు మిత్రులు యిల్లు చేరనున్నారు సాహితీ రంగాన కొందరకు అనుకూలత యున్నది కొందరకు సభా గౌరవం చలన చిత్ర రంగాను కూలతకు ఆస్కారం వృత్తి వికాసం, సాధు సజ్జన సాంగత్యం స్త్రీలకు గౌరవం, ధనవృద్ధి, వృత్తి యందు వికాసం, రాజకీయాలందు అనుకూలత, గ్రహించండి

★ **తుల**· విదీ విరామం ఎరుగక పనులు సాదించు కొంటారు ఒకానొక విషయం కొంత బాదాకర మైనా మీకే అనుకూలం వారాంతాన మేలున్నది శని గ్రహ అండదండ లున్నాయి ఆదాయ మున్నది కృషి యందు అనుకూలం స్త్రీలకు అన్ని విదాలా మేలు

★ **వృశ్చికం**. ఇంట శుభం జరుగుతుంది ఇరుగు పొరుగు వారి వలన మేలున్నది కృషి యందు రాణింపు చేకూరుతుంది ఆదాయ మున్నది అనుకూల వార్తా శ్రవణం అప్రయత్న దనలబ్ధి స్త్రీలకు అన్ని రంగాల వారికి అనుకూలం రాజకీయంగా మేలున్నది సుఖ శాంతు లున్నాయి

★ **ధనుస్సు**· ధనాదాయానికి లోటు లేదు అయినా అధిక ఖర్చులు మాటకు విలువ పెరుగుతుంది ఇంట శుభకార్యాలోచన లుంటాయి విద్యావేత్తల సహాయ మున్నది వస్తు సేకరణం విజయ వంతంగా కొనసాగు తుంది స్త్రీలకు రాజకీయాలందు అనుకూలం సుఖానందం కార్య సాదన

★ **మకరం**: ఎంత కృషి చేస్తే అంత లభిస్తుందని, కార్యాచరణ యోగదాయకమని గ్రహింప గలుగుతారు విద్యావేత్తల సహాయం లభ్యమవుతుంది బిడ్డల విషయంగా వారి బాగోగుల నిమిత్తం చేసే యత్నాలు లాబదాయకం గ్రహించాలి స్త్రీలకు సుఖదాయక వారం, వృత్తి వికాసం ఆదాయ మందు వృద్ధి

★ **కుంభం**: అనేక రంగాలందు మేలున్నది మీ చాకచక్యం వికసింప నున్నది సభా గౌరవం చేకూరు తుంది పత్రికా రంగాన మేలున్నది శిష్ట జనుల సహవాసం లాబదాయక మవుతుంది ప్రతిబా వ్యుత్పత్తులకు అనుగుణ్యత యున్నది స్త్రీలకు: వృత్తి విద్యానుకూలత, ఉద్యోగరీత్యా అనుకూలత

★ **మీనం**· బహు చాకచక్యంతో కార్యం సాదింప బడుతుంది అది రాజకీయ రంగ సంబందం కావచ్చు కళారంగ సంబంధం కావచ్చు విద్యావంతుల సహాయం లభిస్తుంది పరీక్షలు విజయవంత మవుతాయి సభా గౌరవాధిక్యతకు అస్కార మైన వారం స్త్రీలకు రాజకీయాల ప్రమేయం ఈ వారం అనుకూలించదు వృత్తి వికసించదు గ్రహించాలి

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి




## ఏదో నాటకం!

శిటిల్సు అప్పుడు కరెంటు పోయింది. ఎంత గోల పెట్టినా క్లోజింగ్ ఎనౌన్స్‌మెంటు ఇవ్వరు ఎనౌన్సర్లు - పేపరులో కొడుకు పుట్టాల- గణేశ్‌పాత్రో అని చెప్పారు. పాఠకులు సత్యసాగర్ గారు ఇది వరకంత చక్కగా వ్రాయటం లేదని అన్నారు. ఈ కరెంటు కోత విపరీతంగా ఉండటం వల్ల, అర నాటికలూ- పావు నాటికలూ తప్ప కనిపించవు- అది ఒక కారణం. మీరు చెప్పినట్లు ఒక నాటకాల్నే కాదు ప్రసంగాల్నీ నృత్యాన్నీ పాటల్నీ కూడా విమర్శిస్తున్నాం సత్యసాగర్ గారూ- ఎంత విమర్శించినా హైదరాబాద్ అంతేనండీ- గొంగట్లో తింటూ వెంట్రుక లేరినట్లున్నది.

## కష్మాకష్

లలిత అనే సంగీత పాటకురాలికి ఒక నంగివాడు భర్తగా దొరికాడు- అతనికి మాటలు నేర్పటమే ఆమె జీవిత ధ్యేయం. ఎవరేమన్నా అందులో కృతకృత్యురాలవుతుంది- సత్యసాగర్ గారూ హిందీ నాటికల్ని ఒదిలితే మనకి మిగిలేది చీకటీ అంధకారం- కనక హిందీ నాటికలకి కూడా జాతీయ భాషకిచ్చే గౌరవం ఇవ్వాలి. హైద్రాబాద్ కన్నా ఢిల్లీ బాగుంటుందని నేను వేరే చెప్పక్కరలేదు.

## లత

తెలుగు వాళ్ళు గర్వించదగ్గ రచయిత్రి అయినా (తేంక్స్) కరెంటు విపరీతంగా పోతున్నప్పుడు చేసేదేముంది. రుచికరమైన ఈ శీర్షిక ఆ వెలుగు మీద ఆధారపడి ఉంటుంది. తెలుగు ప్రసారాల సరళి ఏమీ బాగా లేదు. అయినా రాస్తూనే ఉన్నాను. ఇక ముందు బాగుపడతాయనే ఆశలేదు. సుప్రభాతం - ఎర్రంశెట్టి శాయి నాటకాలు- సినిమా తీసి చూడు- ఫిల్ము తీసి చూడు ఇంకా ఏ నాటికా బాగా లేదు. తెనాలి రామకృష్ణ బాగుంది. సీతారామల సినిమా గోల, భలే సుబ్బారావు చూస్తున్నారా? మనం మనం- స్త్రీల శీర్షిక చెప్పుకోదగ్గట్లు లేదు. పిల్లల కార్యక్రమాలా?ఎందుకు లెండి వాటి జోలికి పోను- హిందీ నాటకాలా? టెక్నిక్ బాగుంటుంది. కథ ఫరవాలేదు.

## భలే సుబ్బారావు

ఒక నాటకాల రాయుడు ఆఫీసునీ భార్యనీ నిర్లక్ష్యం చేసి నాటకాల పిచ్చిలో పడతాడు. అతని పిచ్చి వదలగొట్టాలని పార్కులో ఆమెతో ఎవరో మాట్లాడుతున్నట్లు చూపించీ అతనికి మరో సెటప్ ఉందనీ అనటంతో- ఆ అమ్మాయి వెళ్ళిపోతుంది. ఇతన్ను చేసేది లేక ఆఫీసు వర్కు సిన్సియర్‌గా చేసి డబల్ ప్రమోషన్... ఈ మాటే నాటకంలో అన్నారు.... అది పొంది మేనేజరు అవుతాడు- వరూధిని అనే భార్యకి తలకి దెబ్బ తగిలి హాస్పటల్లో ఉంటుంది. ఇద్దరూ కలుసుకుంటారు. ఇది అత్యద్భుతంగా లేదు గాని మనకన్న కన్నడం వాళ్ళు మెరుగనుకుంటాను.

## రామాయణ్

రామాయణ్ కోసం ఆదివారం ఎదురు చూస్తాం. శ్రీరామలక్ష్మణులు నాగపాశబద్ధులై ఉండగా- ఇంద్రజిత్ జయధ్వానం మిన్నుముట్టగా- ఏమీ తోచని హనుమ నారదుడి సహాయంతో గరుత్మంతుడిని పిలుచుకొస్తాడు- నాగపాశాలు వెళ్ళిపోతాయి. గరుడుడు రాముడికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి వెళ్ళిపోతాడు నారాయణ మంత్రం చదువుతూ. మళ్ళీ ఇంద్రజిత్ యుద్ధానికి బయలుదేరుతాడు.

అనంతరం రామానందసాగర్ శ్రీరాముడి మూర్ఛ గురించి ఇందులో అందులో ఉంది అని సమర్ధించుకున్నాడు. ఆయన చెప్పిన వాటిల్లో కాకపోయినా విచిత్ర ఆనంద రామాయణాల్లో ఉంది. ఈ వారం బాగుంది. అనేక రామాయణాల్లో అనేక కథలు. ఇప్పటికి ఇదే రామాయణం అని ఎవరూ చెప్పలేరు.

## ఉడాన్

కొత్త సీరియల్ - గురువారం నాడు ఇస్తున్న నాటిక- రచన ఉదయన్. ఒక కుటుంబంలో తాత తండ్రి- అతని మేనత్త ఒక విధవరాలు. కొత్తగా ఈ లోకంలోకి వచ్చిన తమ్ముడూ- ఎనిమిదేళ్ళ కల్యాణి ఉంటారు. ఆ తాత ఛాందసుడు. ఆ ఎనిమిదేళ్ళ మనవరాలు చదువుకోవటం ఇష్టం లేక తన టాంగా ఇవ్వడు. కథ ఇంతటితో ఆగదు. ఆ పిల్లకి పెళ్ళి సంబంధం చూస్తాడు. కొడుకు ఒప్పుకోడు. నీకు స్వయం వ్యక్తిత్వం లేదు నాతో మాట్లాడటానికి అంటాడు. కొడుకు ఇంట్లోంచి బయటికి వచ్చేస్తాడు. పంజరం ఇల్లు కాదు అని తండ్రి చెప్పిన మాటకి కల్యాణి చిలుకని వదిలి వేసింది. కథ ఏదో నవల లాగా ఉంది.

## చర్చ

గోవిందనిహలానీ- భీష్మ సహానీ జిలానీల చర్చా కార్యక్రమం శుక్రవారంనాడు ప్రసారం చేశారు. హిందీ భాషలో ఆక్రోష్- అర్ధసత్య- పార్టీలాటి సినిమాలు తీయటంలో కమ్మర్షియల్ ఫిల్ము అనిగాని కాదనిగాని అనుకోలేదు. సమాజం మారుతుందని కూడా అనుకోలేదు వినోదం ఈస్తటిక్ సెన్స్ అవసరమే. గాని వినోదం పేరుతో వికృతం కారాదు.జనం ఇలాగే చూస్తారు అని ఆత్మవంచన చేసుకోవటం బాగా అనిపించదు- అన్నారు గోవింద నిహలానీ- ■

అరుణ్ గోవిల్, దీపికలకు ఒక దృశ్యాన్ని వివరిస్తున్న రామానంద సాగర్



# చట్టం విధించని శిక్ష

తిరుమలశ్రీ

అలంకరణ పూర్తవగానే ఓ సారి అద్దంలో తన రూపం చూసుకుంది వాసంతి

పాతికేళ్ల పరువం ప్రతి అంగంలోనూ స్పష్టమవుతోంది పొడవుగా, పచ్చని శరీరంతో స్లిమ్‌గా వుండే తాను కాలేజ్ బ్యూటీ. అందని తన అందాన్ని తలచుకుని పిచ్చెక్కి పోయే వారు అబ్బాయిలంతా

"వాసంతీ! నీ ముస్తాబింకా పూర్తి కాలే?" అంటూ భర్త పిలుపు వినిపించడంతో తేరుకుని, "అం అయిపోయింది వచ్చేసా" అంటూ డ్రెస్సింగ్ టేబిల్ ముందు నుంచి కదిలిందామె

అంతలోనే బెడ్‌రూంలో అడుగు పెట్టిన నరేంద్ర అపురూప సౌందర్యంతో మెరిసి పోతూన్న భార్య వంక ఓ క్షణం రెప్ప వాల్చకుండా చూసాడు

పెద్ద బోర్డర్ వున్న లైట్ బ్లూ కలర్ అరణి పట్టు చీరెలో పాలరాతి బొమ్మలా వున్నదామె

"ఓహ్! బ్యూటిఫుల్!" అంటూ ఆమెను కావలించుకుని, పైకెత్తి గిర్రున త్రిప్పాడు

సిగ్గుతో సుమబాలలా ముకుళించుకుని పోయింది వాసంతి

అతను ఆర్తిగా తన గులాబి చెక్కిళ్ల పైన అధరాలతో ముద్రలు వేస్తూంటే ఒక ప్రక్క ఆనందము, మరో ప్రక్క సిగ్గూ ముంచుకు వచ్చాయి ఆమెకు

"వదలండి, బాబు చూస్తున్నాడు" అంది

బెడ్ మీద పడుకున్న ఏడాది బాబు బోసి నవ్వులతో చూస్తున్నాడు

భార్యను వదిలి కొడుకు దగ్గరకు. వెళ్లాడు నరేంద్ర చిటికెలు వేసాడు బాబు చేతులు అందించాడు

ఆ వేళ వూటీకి ప్రయాణం పెట్టుకున్నారు నరేంద్ర, వాసంతిలు – ఓ వారం, పది రోజుల పాటు సరదాగా తిరిగి వచ్చేందుకని బిజినెస్ వ్యవహారాలతో బిజీగా వున్న నరేంద్ర ఆ మధ్య వాసంతిని ఎక్కడికీ తీసుకు వెళ్లడం జరుగలేదు కనుక ఆమెకూ కాస్త మార్పుగా వుంటుందనీ, బిజినెస్ ప్రాబ్లెమ్స్‌తో విసుగెత్తి పోయిన తనకూ కొంత రిలీఫ్‌గా వుంటుందనీ, పైగా అది వేసవికాలం కావడంతో వూటీ ట్రిప్ ప్లాన్ చేసాడు

డ్రయివర్ సామాన్లు తీసుకు వెళ్లి కారులో పెడుతున్నాడు, నరేంద్ర తల్లి పర్యవేక్షణలో.

చంటాణ్ణి ఎత్తుకుని భర్త వెంట నడిచింది వాసంతి

హాల్లోకి వచ్చేసరికి టెలిఫోన్ మ్రోగింది ఆగి, రిసీవరు అందుకున్నాడు నరేంద్ర

అవతలి నుంచి ఏం వినిపించిందో, అంతవరకు వెన్నెలతో వెలిగిపోయి అంతలోనే మబ్బులు క్రమ్ముకున్న అంబరంలా అయిపోయింది అతని వదనం

రెండు నిముషాల పాటు ఫోన్‌లో వింటూ వుండిపోయాడు నరేంద్ర అతని ముఖంలో మారుతూన్న రంగులను గమనిస్తూన్న వాసంతి ఆశ్చర్యపోయింది విషయం బోధ పడక

రిసీవరు పెట్టేసాడు నరేంద్ర ఎంత అణచుకోవడానికి ప్రయత్నిస్తూన్నా మనిషిలో ఆందోళన కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది

భార్య దగ్గర కొచ్చి, 'సారీ, వాసంతీ! అనుకోకుండా బిజినెస్ ప్రాబ్లెమ్ ఒకటి వచ్చింది ఇవాల్టికి మన ప్రయాణం వాయిదా వేద్దాము అనేసి, ఆమె జవాబుకు ఎదురు చూడకుండా కంగారుగా బయటకు పరుగెత్తాడు

ఎదురు చూడని ఆ పరిణామానికి తెల్లబోయిన వాసంతి, భర్త వెళ్లిన వైపే విస్తుపోతూ చూస్తూ నిలుచుండి పోయింధి

* * * *

అందగాడూ, ఆరడుగుల పొడవైన వాడూ అయిన నరేంద్ర ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్ ధనికుల ఏకైక సంతానం

వాసంతి ఓ మధ్యతరగతి కుటుంబానికి చెందిన యువతి బి ఎస్సీ పాసయింది

ఒక రోజున నరేంద్ర ఏదో ఎగ్జిబిషన్‌లో వాసంతిని చూడడం జరిగింది ఆమె అందానికి పిచ్చి వాడయ్యాడు అతను తండ్రి లేకపోవడంతో తల్లిని వొప్పించి వాసంతిని పెళ్లాడాడు

వారి వివాహమయి మూడేళ్లయింది వాసంతిని తన ఆరో ప్రాణంలా చూసుకుంటాడు అతను ప్రేమానురాగాలను పుష్కలంగా పంచి ఇచ్చే భర్త పొందులో జీవితం స్వర్గతుల్యమే అయింది

వాసంతికి అత్తగారు కూడా ఆప్యాయతతో చూసుకుంటుంది ఆమెను ప్రపంచంలో తన కంటె అదృష్టవంతురాలు మరొకరు వుండరనుకునేది వాసంతి వారి ప్రేమ ఫలం బాబు రాకతో ఆలుమగల మధ్య అనురాగం మరింత ప్రగాఢమయింది

నరేంద్రకు ఎన్నో కంపెనీలు వున్నాయి వాటన్నిటిలోనో షేర్లు వున్నాయి

అతను ఫారిన్ ఎక్ఛేంజ్ విషయంలో ప్రభుత్వాన్ని మోసగిస్తున్నాడనీ, తెలివిగా పన్నులు ఎగగొడుతున్నాడనీ తెలియడంతో ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖ హఠాత్తుగా నరేంద్ర కంపెనీలన్నిటి మీదా ఒకేసారి దాడులు జరిపింది ఆ విషయం భార్యకు తెలియనివ్వ కూడదనుకున్నాడు గాని, ఇంటి మీద కూడా రెయిడ్ జరగడంతో వాసంతికి విషయం అవగతమయి పోయింది

భర్త మీద వాసంతికి అచంచల విశ్వాసం వుంది అతను విద్యాధికుడు, తెలివైన వాడు, సమర్థుడు, ఉన్నతాశయాలు కలవాడూనన్న అభిప్రాయం ఆమెకు వుంది

కాని, ఆ నాటి సంఘటనలు ఆమె విశ్వాసానికి అశనిపాతాలయ్యాయి

నరేంద్ర కుతంత్రుడు, మోసగాడు, స్వార్థపూరితుడు, ప్రభుత్వానికి – ప్రజలకు ద్రోహం చేసేవాడు అంటే నమ్మలేకపోతోంది

కాని, రెయిడ్స్‌లో అతని మోసాన్ని, దగాను నిరూపించే పత్రాలు, సాక్ష్యాలు, బ్లాక్‌మనీ దొరికినట్లు తెలిసి ఆమెకు మతి పోయింది

దేశంలోని వార్తా పత్రికలన్నిటిలోనూ నరేంద్ర కంపెనీల పైన, ఇంటి పైన జరిగిన దాడులను గూర్చి వివరంగా ప్రచురింపబడింది అది చూసి స్నేహితులు, శ్రేయోభిలాషులు నిత్యమూ ఫోన్‌లో పరామర్శలు చేస్తూంటే అవమానంతో క్రుంగిపోయింది వాసంతి

భార్య ఆందోళనను గమనించిన నరేంద్ర తేలికగా నవ్వేసాడు

"మరీ మడి కట్టు కూర్చుంటే బిజినెస్‌లో రాణించలేం, వాసంతీ! ఇదంతా మామూలే, ధనవంతులకు, వ్యాపారంలో దినదినాభివృద్ధి చెందే బిజినెస్ మాగ్నెట్స్‌కీ కలిగే అనుభవాలే ఇవి, జరిగే

పరాభవాలే ఇవి! ప్రొఫెషనల్ జెలసీనే ఇందుకు కారణం వీటి వెనుక వుండే రాజకీయాలు నీకు అర్థం కావులే. ఇటీజ్ ఎ పార్ట్ ఆఫ్ ద గేమ్' అంటూ వోదార్చాడు ఆమెను 'చూస్తూండు తెలివైన లాయర్ ఈ సోకాల్డ్ సాక్ష్యాధారాలను ఎలా త్రిప్పి కొడతాడో!

అయినా వాసంతికి ఆందోళనగా, భయంగానే వుంది అవమానంగానూ వుంది

'ఇప్పుడేమవుతుంది? నరేంద్రకు శిక్ష పడుతుందా? ఛ! ఎందుకిలా జరిగింది?' అనుకుందామె పదే – పదే

రెయిడ్స్ జరుగుతూండగానే కోర్టు నుంచి ఎలాగో యాంటిసిపేటరీ బెయిల్‌ని సంపాదించిన నరేంద్ర అరెస్టు నుంచి తప్పించుకున్నా, తరచు కోర్టుకు హాజరు కావలసి వస్తోంది

ఆర్నెల పాటు ఆ కేసు నడిచింది కేసు నడుస్తున్నంత కాలమూ వాసంతి మామూలు మనిషి కాలేకపోయింది మునుపు వున్న వుత్సాహం, చలాకీతనం ఇంకిపోయాయి ఆమెలో అక్కడికీ భర్త, అత్తగారూ అప్పుడప్పుడు మందలిస్తూనే వున్నారు – ఆ బిజినెస్ ప్రాబ్లెమ్స్, మగవాళ్ళ వ్యవహారాలు ఆడవాళ్ళకు అనవసరమనీ; అతనికి ఏమీ అవదనీ, ఆమెను వర్రీ కావద్దనీను

వాసంతి జవాబు ఇచ్చేది కాదు ఆమె మదిలో ఏమి వున్నదో గాని, పైకి మాత్రం ముభావంగా వుండిపోయేది



* * * *

ఆ రోజు ఆ కేసులో కోర్టు తీర్పు ఇస్తుంది ప్రొద్దుటి నుంచీ టెన్షన్‌గానే వుంది వాసంతికి తీర్పు రాగానే ఇంటికి ఫోన్ చేసాడు నరేంద్ర

వాసంతీ! కేసు మనమే గెలిచాం మన లాయర్ అత్యంత సమర్థతతో కేసు స్వరూపమే మార్చి వేసాడు!" అంటూ ఆనందంగా చెప్పుకుపోయాడు అతను నేను ముందే చెప్పలేదూ? బ్రహ్మ రుద్రాదులు వచ్చినా మనల్ని పట్టుకో లేరు ఈ నరేంద్ర తెలివితేటలంటే ఏమనుకున్నావ్ మరి!'

ముక్తసరిగా 'వూ, ఆఁ' అనడం మినహా ఏమీ

జవాబు ఇవ్వలేదు వాసంతి

హలో! వాసంతీ! మాట్లాడవేం, వాసంతీ? ఈ వార్త నీకు సంతోషాన్ని కలిగించడం లేదా? అంటున్నాడు నరేంద్ర అతవలి నుంచి

జవాబివ్వ లేదామె

ఆఁ, తెలిసిందిలే! ఈ శుబవార్తను స్వయంగా వచ్చి చెప్పకుండా పోన్‌లో చెబుతున్నానని కోపం వచ్చింది కదూ? ఒకే ఓ అరగంటలో అక్కడ వుంటాను సరేనా?

మౌనంగా రిసీవరు పెట్టేసింది వాసంతి

గోడకు చేరగిలబడి కళ్ళు మూసుకున్న దామె

ఆమె మదిలో తీవ్రమైన సంఘర్షణ అరంబమయింది తల సమ్మెటలతో మోదినట్లుగా పగిలిపోతోంది గట్టిగా కణతలు నొక్కుకుంటూ కొన్ని నిముషాల పాటు అలాగే వుండిపోయింది ఆ క్షణంలో ఆమె నెవరైనా చూసినట్లయితే, ఆమె పడుతూన్న తీవ్ర మనో సంఘర్షణను ఆమె




వదనంలో కొంత వరకైనా చదువ గలిగే వారేమో!

ఓ అరగంట తరువాత ఇంటికి చేరుకున్న నరేంద్ర హుషారుగా వున్నాడు

'వాసంతీ! వాసంతీ! గుమ్మంలోంచే పిలుస్తూ వచ్చాడు

హాల్లో తల్లి ఎదురు పడడంతో, మనం గెలిచామమ్మా! ప్రభుత్వమే ఓడిపోయింది ఈ నరేంద్రను పట్టుకోవడం ఎవరి తరం!? అన్నాడు సంతోషంతో అతని గొంతులో గర్వం తొంగి చూసింది

ఆ తల్లి కూడా కొడుకు సమర్థతకు గర్విస్తూ, ఆప్యాయతతో అతని తల నిమిరింది, అన్నీ మీ నాన్నగారి పోలికలే వచ్చాయి నీకు! అంటూ

వాసంతి ఎక్కడమ్మా? అని అతను అడుగుతూన్నంతలో నే అక్కడికి వచ్చింది వాసంతి

వాసంతీ! ఈ నరేంద్ర సామర్థ్యం ఇప్పటికైనా తెలిసొచ్చిందా?" అంటూన్న నరేంద్ర, హఠాత్తుగా మధ్యలో నే ఆగిపోయాడు

వాసంతీ! ఏమిటది?" అన్నాడు తెల్లబోతూ

సాదా వాయిల్ చీరె కట్టుకుంది వాసంతి నగలు తీసి వేయడంతో మెడ బోసిగా వుంది

చంకను బాబు, చేతిలో ఓ సూట్‌కేసూ వున్నాయి

నేను నేను వెళ్ళిపోతున్నాను అందామె చిన్నగా, కంపించే స్వరంతో

ఎ ఎక్కడికి, వాసంతీ? ఈ వేషం ఏమిటి? ఎక్కడికి వెళుతున్నావ్? అయోమయంగా ప్రశ్నించాడు అతను

గమ్యం నాకే తెలియదు తెలిసిందల్లా ఈ ఖరీదైన జీవితం నుంచి, ఈ అన్యాయపు రిచెస్ నుంచి దూరంగా పారిపోతున్నానని మాత్రమే!' అంది వాసంతి

ట్రాన్స్‌లో వున్న దానిలా – ఆమె చూపులూ – పలుకులూ – నరేంద్రను కలవరపరచాయి

"వాసంతీ! వాట్యూయూ మీన్? అన్నాడు తెల్లబోతూ

నరేంద్రా! నీ అందం, ఆదర్శాలు చూసి నా మదిలో నీ విగ్రహాన్ని ప్రతిష్ఠించుకున్నాను భక్తితో పూజిస్తున్నాను ఇన్నాళ్ళూ కాని, నీ నిజ రూపం ఇప్పుడు బయట పడింది నువ్వు స్వార్థపరుడివీ, మోసగాడివీ అనీ ప్రజలను దోచుకుంటూ, ప్రభుత్వాన్ని వంచించే కుటిల వ్యాపారివనీ ఇప్పుడే గ్రహించాను నిన్నొక అసాధారణ వ్యక్తిగా, అపూర్వమూర్తిగా ఎంచుకుని ఆరాధిస్తూన్న నా అచంచల విశ్వాసాన్ని తీవ్రంగా చలింపజేసావు ' అంటూన్న వాసంతికి మధ్యలో నే అడ్డు తగులుతూ

'వాసంతీ! నీకేమైనా మతి పోయిందా? నేను నిర్దోషినని కోర్టే తీర్పు ఇచ్చింది!" అన్నాడు స్వరంలో విసుగు, కోపము మిళాయిస్తూ.

"హుఁ! ధనంతో నువ్వు అన్యాయాన్ని న్యాయం చేయవచ్చును. అక్రమాన్ని క్రమం చేయవచ్చును కాని, నిజాన్ని ఎలా కాదనగలవు? చట్టం బారి నుంచి తప్పించుకున్నా, మనస్సాక్షి నెలా మూసి వుంచగలవ్?" ఆవేశంగా అంది వాసంతి "చట్టాన్ని నువ్వు మోసగించవచ్చు, నరేంద్రా! కాని, కట్టుకున్న బార్యను మాత్రం మభ్య పెట్టలేవు . సమాజంలోని అసమానతలను రూపుమాపాలని ప్రభుత్వం చేస్తూన్న తీవ్ర కృషిలో పాలు పంచుకోవలసిన నీ బోటి దనికులు ప్రభుత్వం చేబట్టిన ఆ గురుతర బాద్యతలో చేయూత నివ్వవలసిన నీ వంటి విద్యావంతులు అవినీతి చర్యలతో ప్రభుత్వం కళ్ళు గప్పి ప్రజలకు అన్యాయం చేయడం సహింపరాని నేరం నేను ఎవరినైనా భరించగలనేమో గాని – ఐ కాంట్ టోలరేట్ ఈ ఇకనామిక్ అఫెండర్స్! అటువంటి వారు నా దృష్టిలో దేశద్రోహుల క్రిందే లెక్క!

వాసంతీ! తీక్షణంగా అన్నాడు నరేంద్ర ఆమె ఒక్కో పలుకూ, ఒక్కో కత్తి కోతగా అతని గుండెల్ని చీలుస్తోంది

'డోంట్ బీ ఫూలిష్! బిజినెస్ విషయాలు నీకనవసరం అన్నాడు కోపంగా

"సారీ, నరేంద్రా! బిజినెస్ విషయాలు నా కనవసరమైనా, నా భర్త నైతిక విలువలు నా కెంతయినా అవసరం. దేశాన్ని దోచే అవినీతి పరుడితో కాపురం చేయడం నా మనస్తత్వానికి పడదు అందుకే వెళ్ళిపోతున్నాను దృఢంగా అంది వాసంతి

షటప్! పొంగి వస్తూన్న ఆగ్రహాన్ని అణచుకోవడానికి ప్రయత్నిస్తూ అరిచాడు అతను

అంతవరకు మ్రాన్పడిపోయిన నరేంద్ర తల్లి తేరుకుని, 'తొందర పడకమ్మా, వాసంతీ! అనవసర విషయాలతో మనసు పాడు చేసుకుని, తెలివి తక్కువగా బంగారు జీవితాన్ని బుగ్గి చేసుకోకు" అంది

క్షమించండత్తయ్యా! అవినీతితో సంపాదించిన ధనరాశులు నా కొద్దు నా భర్త అవినీతి పరుడన్న సత్యం అనుక్షణమూ నా మనస్సాక్షిని పురుగులా దొలుస్తూంటే, అతనితో కాపురం చేయడం నా వల్ల కాదు అందుకే బాగా ఆలోచించుకునే ఈ నిర్ణయానికి వచ్చాను' అంది వాసంతి ఆమె స్వరంలో దృఢ నిశ్చయం తొణికిసలాడింది

అంతేకాదు, అవినీతి పరుడైన తండ్రి ప్రబావం నా బిడ్డ మీద పడడానికి వీల్లేదు అందుకే, ఈ వాతావరణానికి దూరంగా నా బిడ్డను తీసుకుపోతున్నాను భరత మాత గర్వించే విధంగా నా బాబును తీర్చిదిద్దుకుంటాను. ధనరాశులు నా వద్ద లేకపోవచ్చును కాని, కష్టపడి సంపాదించిన డిగ్రీ నాకుంది. దాని సాయంతో నా కాళ్ళ మీద నేను నిలువగలనన్న కొండంత ఆత్మవిశ్వాసమూ వుంది వస్తా, గుడ్ బై!"

నరేంద్ర అతని తల్లి ఆ షాక్ నుంచి తేరుకునే లోపునే బాబుతో చర – చరా బయటకు నడిచింది వాసంతి ఆత్మస్థైర్యంతో నైతిక బలంతో డు కాగా ■

# తెలుగు క్రీడారంగానికి పట్టిన గ్రహణం!

జాతీయ క్రీడారంగములో తెలుగు వారి స్థానము ఏమిటి అని పరిశీలిస్తే ఎంతో బాధ కలుగుతుంది. మనదేశంలోని అతి పెద్ద రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. అనేక రంగాలలో అభివృద్ధి సాధించిన ఆంధ్రప్రదేశ్ క్రీడా రంగములో అవమానము పొందుట, నిరాశ కలిగించటానికి కారణం ఏమిటి అని ఆలోచిస్తే క్రీడాకారుల తప్పు లేదని అనిపిస్తుంది. మరి దీనికి బాధ్యత మన క్రీడా సమాఖ్యల (అసోసియేషన్స్) అధినేతలు, మన క్రీడారంగ బుద్ధిజీవులు, నిర్వాహకులు అనవచ్చు. మన రాష్ట్ర క్రీడా సమాఖ్యలపై పెత్తనం గత 30 ఏళ్ళుగా కొందరు వ్యక్తుల ఆధీనములో యున్నది. మన క్రీడా పథకములు రూపొందించు బుద్ధిజీవులు ఎంతో కాలముగా రాష్ట్ర క్రీడామండలి కేంద్రమయిన లాల్‌బహదూర్ క్రీడాంగణ ఖిలాలో గబ్బిలాల లాగ పట్టుకుని వేలాడుతున్నారు. వీరి వలన మన క్రీడారంగము ముందంజ వేయలేక పోవుచున్నది. వీరిలో పదవులలో కొనసాగాలి అన్న ఆలోచన మినహాయించి క్రీడాభివృద్ధికై కృషి చేయాలి అనే పట్టుదల కనిపించదు. రాష్ట్ర క్రీడా సమాఖ్యల సభ్యత్వము కొరకు జరుగు అవకతవకలు, సమాఖ్య ఎన్నికలు, రాష్ట్ర జట్లు ఎంపికల సమయములో కుదుర్చుకొను 'ఒడంబడికలు' వలన ప్రతిభ గల ఆటగాళ్ళకు, నిర్వాహకులకు గుర్తింపు లభించక, అసమర్థుల నాయకత్వములో, రాష్ట్ర జట్లలో ప్రతిభకు స్థానము, ప్రోత్సాహము లభించుట లేదు. ఇది అందరికి తెలిసిన యదార్థము. నేటి మన రాజకీయ రంగము కన్న క్రీడారంగములో కుల, మత, ప్రాంతీయతత్వాలను ప్రోత్సహించటం ఎక్కువగా ఉన్నది. నేడు మన రాష్ట్ర క్రీడామండలిచే గుర్తింపు పొందిన రాష్ట్ర క్రీడా సమాఖ్యలు 40 వరకు కలవు. కాని వాటి అధినేతలు 70, 80 మంది మాత్రమే. జాతీయ క్రీడా సమాఖ్యల పెత్తందార్ల ఎన్నిక సమయములో జరుగు 'బేరాల' వలన వీరి స్థానములలో కొనసాగుతున్నారు. తెలుగు క్రీడా రంగమునకు అపూర్వ సేవ చేసిన నూకల రామచంద్రారెడ్డి, రాజారామ్, గౌస్ మహమ్మద్. గులాం అహ్మద్, వి. వి. నారాయణరావు, డి.ఎన్. రెడ్డి అహ్మద్ మొయిద్దీన్ విజ్జీ, సంస్థానాధిపతులు. రాజాలు నేడు కరువు అయినారు. నిస్వార్థముగా క్రీడారంగమునకు సేవ చేయుచున్న వారికి గుర్తింపు లేదు. నేడు మన రాష్ట్ర క్రీడా సమాఖ్య అధినేతలు వ్యక్తిగతముగా సాధించినది, చేసిన సేవ ఏమీ లేదు. రాష్ట్ర క్రీడామండలి, రాష్ట్ర ప్రభుత్వము అందించు వార్షిక ఆర్థిక సహాయముతో వీరు



శ్రీ డి. ఎన్. రెడ్డి

పెత్తనము చేస్తున్నారు. దేశ, రాష్ట్రములలో పోటీ సమయములలో, సమావేశములలో పాల్గొనుటకు వెళ్ళి సుఖాలు, సౌకర్యాలు పొందుచున్నారు. క్రీడా పోటీలలో పాల్గొను ఆటగాళ్ళను కనీస సౌకర్యములు అందవు.

గత ముప్పై ఏళ్ళలో మన క్రీడాకారులకి సదుపాయములు ఎన్నో చేయబడ్డాయి. శ్రీకాకుళం, విశాఖపట్నం, కాకినాడ, ఏలూరు, విజయవాడ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు, నిజామాబాద్, అదిలాబాద్‌లలో స్టేడియంలు నిర్మించబడ్డాయి. ఇంకా అనేక చోట్ల క్రీడాంగణములు నిర్మించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

పూర్వాంధ్ర ప్రాంతములో, హైదరాబాద్ సంస్థానములో గల మన క్రీడా జట్లు అనేక జాతీయ స్థాయి పోటీలలో విజయాలు సాధించుటమే కాక ఉన్నత ప్రమాణాలు నెలకొల్పాయి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన క్రొత్తలో కూడా మన క్రీడాకారుల ప్రతిభ కొనియాడబడేది. అప్పటికి మన రాష్ట్రములో ప్రత్యేక శిక్షకులు (కోచ్) లేరు. అనుభవము గల వృద్ధ క్రీడాకారులే గురువులు. రాష్ట్ర క్రీడా సమాఖ్యలు పటిష్టముగా లేవు. కాని ఎంతో దీక్షతో పని చేసేవి 1961 లో ఆం. ప్ర. స్పోర్ట్స్ కౌన్సిల్ ఏర్పడినది. తెలుగు నాట క్రీడలను యింకా అభివృద్ధి చేయాలి అనే కాంక్షతో ప్రభుత్వము ఏర్పరచినది. 1964 నాటికి రాష్ట్ర క్రీడామండలిలో హైదరాబాద్ ప్రాంతీయ శిక్షణ కేంద్రంలో ఆరుగురు కోచ్‌లు పని చేసే వారు. అప్పుడు కోచ్‌లలో మనస్పర్థలు లేవు. 1970 వరకు మన క్రీడా స్థాయిలో పెద్దగా మార్పులేదు. ఆ తర్వాత క్షీణించటం ప్రారంభమయినది. ఇప్పుడు రాష్ట్ర

1964లో ప్రాంతీయ క్రీడామండలి కోచ్‌లు, కార్యదర్శి, కూర్చున్న వారు శ్రీ ఇ. బి. అయిబరా, వి. వి. నారాయణరావు, శ్రీ ఫరుక్కుందా అలీఖాన్, నిలబడి ఉన్న వారు శ్రీయుతులు ఖుర్షిద్ అలీ, ఎం. కె. రెడ్డి, ఎస్. కోదండరామయ్య, ముంతాజుల్‌హక్, వి. సూర్యనారాయణ, కాజిమ్ హుస్సెయిన్.



# తెలుగు క్రీడారంగానికి పట్టిన గ్రహణం!

క్రీడామండలిలో సుమారు 160 మంది వివిధ క్రీడా కోచ్‌లు ఉన్నారు జిల్లాకు కనీసం నలుగురైదుగురు కోచ్‌లు ఉన్నారు హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియం, సికింద్రాబాద్ జింఖాన గ్రౌండ్సులలో 50 మంది కోచ్‌లు వివిధ ఆటలలో శిక్షణ యిస్తున్నారు రాష్ట్ర క్రీడా సమాఖ్య అధికారం కోసం పట్టుదలలు పెరిగాయి వాటిలో క్రీడాభివృద్ధి చేయాలి అనే కాంక్ష తగ్గింది పదవిలో కొనసాగాలి అనే ఆశ పెరిగింది జాతీయ, అంతర్జాతీయ క్రీడారంగములో అనేక నూతన పద్ధతులు, పథకాలు కనుక్కొని ప్రమాణాలు పెంచుచున్నారు ప్రతిభ పెరుగుచున్నది కానీ తెలుగు నాట అవి తగ్గుతున్నాయి

ఇది వరకు ఎటువంటి కనీస సదుపాయాలు, ప్రోత్సాహము శిక్షణ వసతులు లేకపోయినా మన క్రీడా ప్రమాణములో ప్రతిభ కనిపించింది ఇప్పుడు అన్ని సదుపాయాలు, వివిధ రకముల ప్రోత్సాహము, 160 మంది శిక్షకులు (కోచ్)లు ఉన్నా కూడా ప్రతిభ కనిపించక పోవటానికి కారణము ఏమిటి?

మొదట్లో రాష్ట్ర క్రీడామండలి ప్రభుత్వము నుంచి రూ 50 వేలు ఆర్థిక సహాయము పొందేది క్రమేపి రెండు లక్షలు నుండి నేడు కోటి రూపాయల పైగా ఆర్థిక సహాయము పొందుతున్నది రాష్ట్ర క్రీడా మండలి క్రీడాభివృద్ధి సాదించాలి అనే దీక్షతో కోచల సంఖ్యని సదుపాయాలని పెంచింది క్రీడా సమాఖ్యలకు ఆర్థిక సహాయం అన్ని రకములుగా అందిస్తున్నది జాతీయ స్థాయిలో మన క్రీడాకారులు విఫలమవుతున్నారు ప్రతిభావంతులైన కొందరు యితర ప్రాంతములకు వలస వెళ్తున్నారు మన క్రీడా జట్ల ఎంపిక, తర్ఫీదు యిచ్చి జాతీయ పోటీలలో పాల్గొనవలసిన బాధ్యత రాష్ట్ర క్రీడా సమాఖ్యలది రాష్ట్ర క్రీడా మండలి గ్రామీణ క్రీడల బాధ్యత వహించుచున్నది మరి మన యోధులు విఫలమగుటకు కారణం మన క్రీడారంగ బుద్ధిజీవులు చెప్పరు రాష్ట్ర క్రీడా సమాఖ్య అధినేతలు ఓటమి గురించి పట్టించుకోరు

ఇప్పుడు 25 ఏళ్ళకు పైగా యున్న రాష్ట్ర, జిల్లా క్రీడామండలిలను ప్రభుత్వము 'రద్దు' చేసి వాటి స్థానములో స్పోర్ట్స్ అథారిటీ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (తెలుగు క్రీడా వికాసం) ఏర్పరచినది రాష్ట్ర, జిల్లా వివిధ క్రీడా సమాఖ్యల పని తీరుపై అసంతృప్తిని వ్యక్తం చేసింది ఇకముందు రాష్ట్ర, జిల్లా క్రీడా సమాఖ్యలకు అందించే ఆర్థిక సహాయం ప్రోత్సాహాలని ఇచ్చే విషయంలో త్వరలో కొన్ని నిబంధనలు ఏర్పరచనున్నది అలాగే జిల్లా రాష్ట్ర స్పోర్ట్స్ అథారిటీ పని తీరును క్రమబద్ధం చేయనున్నది ఇంత వరకు ఆసక్తిగా పని చేయని ఫలితాలు చూపని 'కోచ్'లపై చర్య తీసుకొనే ఆలోచన ఉన్నది మండల స్థాయి నుండి జిల్లా, రాష్ట్ర స్థాయిలలో మూడు అంచెల స్పోర్ట్స్ అథారటీలను ఏర్పరచింది

ప్రభుత్వ ఆలోచనలు మంచివి ప్రవేశ పెట్టే పథకాలు అమలు జరుపుటకు అనుకూలముగా యుండాలి రాష్ట్ర వివిధ క్రీడా సమాఖ్యల అధినేతలు, కోచ్‌లలో మార్పు రావాలి ఔత్సాహిక, ప్రతిభ కలిగిన యువ క్రీడాకారులకు సరియైన గుర్తింపు ప్రోత్సాహము అందేటట్లు చూడాలి లేకపోతే ఎన్ని చట్టాలు చేసినా, పథకాలు రూపొందించినా, దీక్షతో కొందరు పని చేసినా ఫలితాలు సాధించలేము

రాష్ట్ర ప్రభుత్వము, స్పోర్ట్స్ అథారిటీ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ అధినేతలు మన క్రీడారంగాన్ని పట్టుకొని పీడిస్తున్న అసమర్థులైన క్రీడా సమాఖ్య అధినేతలు, స్వార్థముతో పదవులను ఆశించు బూటకపు క్రీడా నిర్వాహకులను తొలగించాలి రాష్ట్ర క్రీడా సమాఖ్య అధినేతలు పదవిలో కొంత కాలము మించి కొనసాగరాదని నిర్ణయము చేయాలి తెలుగు క్రీడారంగానికి పట్టిన గ్రహణం విడవాలి

–ముకరమ్

## ఉత్తరాలు

( 7 వ పేజీ తరువాయి)

### సీరియల్స్

జయప్రద ముఖచిత్రంతో విడుదలైన పత్రికలో చల్లా సుబ్రహ్మణ్యంగారి 'పవిత్రపాపి' సీరియల్ చాల సస్పెన్స్‌గా వుంది ఈ సీరియల్‌కు రావుగారు వేసిన బొమ్మ చాల చాల బాగుంది రాకాలాటి ఒక్క వ్యక్తి వుంటే చాలు రాజకీయ నాయకుల ఆటలు కట్టించటానికి రాకాలాటి ఒక్క వ్యక్తి వుంటేచాలు ఈ సమాజంలో పాపాత్ముల గుండెల్లో రైళ్ళు పరిగెత్తించటానికి రాకా పాత్రను సృష్టించి స్టోరీని అనేక మలుపులు తిప్పిస్తున్న రచయిత చల్లాగార్కి నా హృదయపూర్వక అభినందనలు

–చలపాక ప్రకాష్, విజయవాడ

★ ★ ★

నటి "జయప్రద" ముఖచిత్రం మమ్మల్ని ఎంతగానో ఆకర్షించింది మల్లాది "వినాయకరావు పెళ్ళి" చాల చాల బాగుంది ముఖ్యంగా పెళ్ళి చూపుల్లో పోలీసుల్ని కొట్టడం చాల బాగుంది చల్లా సుబ్రహ్మణ్యం "పవిత్రపాపి" ఆదిలోనే ఆకట్టుకుంది

పి కీర్తన, రాజమండ్రి

★ ★ ★

మల్లాదిగారి 'వినాయకరావు పెళ్ళి' సీరియల్ చదివినంతసేపు సంతోషం మరల మరల చదవాలి అనే ఆరాటం చల్లా సుబ్రహ్మణ్యంగారి "పవిత్రపాపి"లో రాజకీయ నాయకుల గుండెల్లో నిద్రపోతున్న "రాకా" పాత్ర చాల బాగుంది

–కె శ్రీనివాసు, రామచంద్రాపురం

★ ★ ★

హరికిషన్ గారి ఆడపిల్లలు – అనుభవాలు అన్న సీరియల్‌ను చదువుతుంటే రచయిత స్వానుభవంతో రాస్తున్నారేమోననిపించేటంతటి సహజంగా ఉంది

–మంతెన విజయలక్ష్మి, విజయవాడ

### కథలు

జయప్రద ముఖచిత్రముతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగున్నది వెలుగు నీడలు కథ మమ్మెంతగానో ఆకట్టుకున్నది

పి ఎస్ రాయుడు, ప్రసన్నబాబు,
అనంతపూర్ కాటన్‌మిల్సు

★ ★ ★

"చీకటిని చీల్చిన చిరుకిరణం" కథ చాల పసందుగా ఉంది కథ నడిపినతీరు ప్రశంసార్హం

-పక్కి సంజీవకుమార్, నెల్లూరు

★ ★ ★

జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన సంచికలో చీకటిని చీల్చిన చిరుకిరణం ఎంతో బాగుంది వంశమూ, కీర్తి, ప్రతిష్ఠ అంటూ వాటి కోసం ప్రాకులాడుతూ పెద్ద ఉద్యోగం రాక, చిన్నపని చేయలేక నేడు ఎందరో నిరుద్యోగులు అటు సమాజానికి, ఇటు తల్లిదండ్రులకు బరువౌతున్నారు అందరికీ 'వైట్ కాలర్ జాబ్'లు, గవర్నమెంటు ఉద్యోగాలు రావాలంటే అది జరిగే పని కాదు దొంగతనం, వ్యభిచారం వంటి వృత్తులు కాక మరే పని చేసయినా, రెక్కల కష్టంతో పొట్ట పోసుకోవటం నామర్దా కాదు నిరుద్యోగులల్లో ఆత్మవిశ్వాసాన్ని, బ్రతుకు పట్ల తీపని పెంచగలిగిన ఈ కథ నిజంగా ఎందరో నిరుద్యోగుల చీకటి బ్రతుకులలో 'చిరుదివ్వె'గా భాసిస్తుందనటంలో సందేహం లేదు రచయిత శ్రీ గోపాలకృష్ణకు అభినందనలు

–వక్కలంక రామారావు, అమలాపురం ☐

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor . M. Madhava Rao, Chief Editor S Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial 75667

34565

జీవం ఉట్టిపడేలా చేసే లిరిల్ తాజాదనం.




**లిరిల్**

తాజాదనపు సబ్బు

వళ్లు పులకరింపజేసే నిమ్మకాయల తాజాదనంతో.

LINTAS LR P 54 2720 TL

# నిష్మల వెంకటరావుకు రెండు బంగారు పతకాలు

కళా ప్రపూర్ణ, పరిశోధన పరమేశ్వరిత్యాది బిరుదాంచితులైన కీర్తిశేషులు శ్రీ నిడుదవోలు వెంకటరావు ఆంధ్ర జగమెరిగిన విద్వత్పరిశోధకులు ఆయన గ్రంథాలపై ఇంతవరకు ఎవరూ పరిశోధన చేయలేదు నగరంలోని హైదరాబాద్ విశ్వ విద్యాలయం తెలుగు విభాగంలో శ్రీ వెంకటరావుపై తొలిసారిగా పరిశోధన జరిగింది శ్రీ నిష్మల వెంకటరావు అనే ఉత్సాహవంతుడైన యువకుడు కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకటరావు జీవితం -వాఙ్మయ సూచిక" అనే విషయంపై ఎం ఫిల్ కు పరిశోధన చేసి ఆ పేరుతోనే రచించి ముద్రించిన గ్రంథం ఆవిష్కరణ మార్చి 19వ తేదీన కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ సంస్థ ఆధ్వర్యంలో వైభవోపేతంగా జరిగింది కిన్నెర సంస్థ అధ్యక్షులు, మాజీ పోలీస్ డైరెక్టర్ జనరల్ శ్రీ ఎం వి నారాయణరావు స్వాగతం పలుకుతూ, పోలీసుశాఖలో కొట్టు మిట్టాడుతున్న తమకు మామగారైన వేదుల సూర్యనారాయణశర్మగారి వల్ల సాహిత్యంలో అభిరుచి కలిగినట్లు– ఆయకర్ శాఖ ఉద్యోగంలో తలమున్కలై ఉన్న శ్రీ నిష్మల వేంకటరావుకు పెద్దలవల్ల తెలుగులో ఆసక్తి కలిగిందని స్వయంకృషితో ఎం ఫిల్ పట్టం సంపాదించారని డాక్టరేట్ కూడ సంపాదిస్తారని అన్నారు ఆదికార సంఘం భూతాధ్యక్షులు డాక్టర్ వీరభద్రరావు సభకు అధ్యక్షత వహించగా, అద్యతన భూతాధ్యక్షులు డాక్టర్ సి నారాయణరెడ్డి ముఖ్యాతిథి కాగా, వర్తమాన అధ్యక్షులు డాక్టర్ నందూరి రామ కృష్ణమాచార్యులు వక్తలుకాగా ఆవిష్కరణ సభ శోభాయమానమైంది డాక్టర్ నారాయణరెడ్డి గ్రంథాన్ని ఆవిష్కరించి, రచయితను శాలువ కప్పి సన్మానించారు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారిని ఆయన ప్రశంసిస్తూ, ఆయనలో భోళా శంకరత్వం, జ్వాలా శంకరత్వం రెండూ ఉండి పరిశోదన పరమేశ్వరత్వం సార్థకమయిందన్నారు చలద్విజ్ఞాన సర్వస్వంగా, అద్యాపకులకు విద్యార్థులకు పరిశోధకులకు కరదీపికగా వెలిగిన నిడుదవోలు వారి మీద శ్రీ నిష్మల వెంకటరావు చేసిన కృషి శ్లాఘనీయమని ఆయన ప్రశంసించారు శ్రీ ఎం వి సుబ్బారావు శ్రీ నిష్మలకు కిన్నెర జ్ఞాపికను బహూకరిస్తూ ప్రశంసించారు శ్రీ నిడుదవోలు సర్వేశ్వరరావు నిడుదవోలు వెంకటరావు గారిపై రచించిన గేయాన్ని శ్రీసర్వేశ్వరరావు సతీమణి శ్రీమతి మహాలక్ష్మి శ్రావ్యంగా గానం చేశారు జంట నగరాలలోని వివిద సాహితీ సంస్థలవారు, సాహితీవేత్తలు శ్రీ నిష్మలను ఘనంగా సత్కరించారు శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావు గ్రంథ పరిచయం చేస్తూ, వెంకట్రావుగారి వ్యక్తిత్వాన్ని, వాఙ్మయ సూచికను సక్రమంగా, శాస్త్రీయంగా గ్రంథంలో పొందు పరచినందుకు శ్రీ నిష్మలను మెచ్చుకొన్నారు హైదరాబాద్ విశ్వ విద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ జి వి సుబ్రహ్మణ్యం ప్రసంగిస్తూ'నిడుదవోలువారి అపూర్వ సాహిత్య సంపదను వెలికి తీయటంలో శ్రీ నిష్మల దీక్షను ప్రశంసించారు డాక్టర్ నందూరి రామకృష్ణమాచార్యులు తమ ప్రసంగంలో శ్రీ నిడుదవోలు వారితో తమకు గల పరిచయాన్ని వివరించి, శ్రీ నిష్మల కృషికి తగిన మన్నన ఆంధ్రదేశంలో వస్తుందన్నారు

అధ్యక్షులు డాక్టర్ కొత్తపల్లివారు ప్రసంగిస్తూ, ఈ గ్రంథాన్ని నిష్మల వెంకటరావు కీర్తిశేషురాలు తమ తల్లికి అంకితమివ్వడం సముచితమన్నారు శ్రీ నిష్మల వెంకటరావు అందరికీ కృతజ్ఞత తెలుపుతూ, తాను నిడుదవోలువారిపై పరిశోదనకు కీర్తిశేషులు గురుతుల్యులు అయిన శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు, తమ గురువులు డాక్టర్ కొత్తపల్లి వీరబద్రరావు కారణమన్నారు తమ మాతృమూర్తి స్మారకంగా హైదరాబాద్ విశ్వ విద్యాలయంలో ఉత్తమ తెలుగు పరిశోధనకు ఒక బంగారు పతకం, విశ్వ విద్యాలయానికి వెలిగా ఉత్తమ పరిశోదన గ్రంథానికి నిడుదవోలువారి వర్ధంతినాడు - అక్టోబరులో – కిన్నెర నిడుదవోలు బంగారు పతకం ఇవ్వడానికి నిర్ణయించానని ఆయన ప్రకటించగా సభికులు హర్షధ్వానాలు చేశారు ప్రారంభంలో కిన్నెర సంస్థ కార్యదర్శి శ్రీ మద్దాళి రఘురాం పరిచయ వాక్యాలు పలుకగా, సహాయ కార్యదర్శి శ్రీ సుబ్బారావు చివరన వందన సమర్పణ చేశారు

## బాల నటుడు షణ్ముఖ శ్రీనివాస్‌కు సన్మానం :

అబినందన సంస్థ మార్చి 20న త్యాగరాజ గాన సబలో ఉగాది ఉత్సవాలు నిర్వహించినప్పుడు 1987 రాష్ట్ర ఉత్తమ బాల నటుడి అవార్డు అందుకున్న షణ్ముఖ శ్రీనివాస్‌ను సన్మానించింది ఈ సమావేశానికి ముఖ్య అతిదిగా విచ్చేసిన మంత్రి శ్రీ పుష్పరాజ్ శ్రీనివాస్‌కు అభినందన అవార్డును అందజేసి, శాలువతో సత్కరించారు అభినందన ఈ సత్సంప్రదాయం అనుసరిస్తున్నందుకు ఆయన ప్రశంసిస్తూ శ్రీనివాస్ నటుడుగానే కాక ఐంద్రజాలికుడుగా, మాండలిన్ వాద్య వాదకుడుగా, నర్తకుడుగా అత్యుత్తమస్థానాన్ని అందుకొన్నాడని ప్రశంసించారు ఇంకా ఎన్నో అవార్డులు రావాలని ఆశీర్వదించారు సభాధ్యక్షత వహించిన శ్రీ బి ఎన్ రెడ్డి, శ్రీయుతులు దైవజ్ఞశర్మ, లింగారెడ్డి, వెంకటరెడ్డి, షకీర్ హుస్సేన్ శ్రీనివాస్‌ను అభినందించారు ప్రారంభంలో శ్రీమతి బవాని స్వాగతం చెప్పారు శ్రీమతి రాజ్యలక్ష్మి వందన సమర్పణతో అభినందన సభ సమాప్తమైంది

## ఉపశ్రుతి :–

తాతా, తాతా ఆర్. టి సి అంటే అర్థమేమిటి చెప్పుకో చూద్దాం' అన్నాడు మనమడు ఉదయన చెప్పాను రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పోరేషన్– అని కాదు-అన్నాడు ఉదయన గట్టిగా అయితే ఏమిటి?- అన్నాను విను- అన్నాడు ఉదయన బడిపంతులు పోజులో ఆర్ అంటే రాదు టి అంటే తెలియదు సి అంటి చెప్పలేము అని అర్థం మా ఫ్రెండ్ చెప్పాడు- అన్నాడు □

చి. షణ్ముఖ శ్రీనివాస్‌కి అవార్డు అందజేస్తున్న సాంస్కృతిక శాఖ మంత్రి శ్రీ పుష్పరాజ్, అభినందన కార్యదర్శి శ్రీమతి భవాని, ఉప కార్యదర్శి శ్రీమతి సునీల, ఉపాధ్యక్షురాలు శ్రీమతి సూర్యకుమారి, శ్రీ బి ఎన్. రెడ్డి, శ్రీ షకీర్ హుస్సేన్, శ్రీ దైవజ్ఞశర్మగార్లని చిత్రంలో చూడవచ్చు





# అవీ-ఇవీ-అన్నీ

## బాల కళాకారుడు కురవి

బాల కళాకారుడుగా నేటికి 75 పైగా నృత్య ప్రదర్శనలు చేసిన కురవి వెంకట సుబ్రహ్మణ్యప్రసాద్ ఇటీవల 1988 ఏప్రిల్, పదవ తేదీన కూచిపూడిలో చయనము (యజ్ఞం) సందర్భంలో బాలనర్తకిగా (స్త్రీ వేషం) వేసి "పూజ" "దశావతారములు" "కృష్ణశబ్దం" "కొలువైతివా రంగసాయీ" పలు కూచిపూడి నృత్య అంశాలను ప్రదర్శించి పండిత పామరుల మనసులను రజింప చేశాడు.

కూచిపూడి శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రంలో శ్రీ వేదాంతం రాధేశ్యామ్ వద్ద సంప్రదాయ కూచిపూడి నృత్యాన్ని, 'కళాక్షేత్రం ప్రధాన అధ్యాపకులు శ్రీ పసుమర్తి వేణుగోపాల్ వద్ద గాత్ర సంగీతాన్ని అభ్యసిస్తున్న పన్నెండేళ్ల కురవి తల్లితండ్రులు శ్రీమతి విజయలక్ష్మి శ్రీ సదాశివశాస్త్రి.

అఖిల భారత కూచిపూడి నాట్యమండలి రాష్ట్ర స్థాయిలో నిర్వహించిన పోటీలలో చిరంజీవి కురవి జూనియర్స్ విభాగంలో మొదటి బహుమతి గెలుచుకున్నాడు. స్వర్గీయ ఇందిరా గాంధి వర్ధంతి సందర్భంగా "భక్త ప్రహ్లాద" యక్షగానంలో ప్రహ్లాదుడుగా నర్తించి ప్రేక్షకులకు కనుల విందు చేశాడు.

## 'నిర్వికల్ప సంగీతం'కు నూతలపాటి సాహితీ సత్కారం

గంగాధరం సాహితీ కుటుంబం (తిరుపతి) ప్రతి సంవత్సరం మే 29న శ్రీ నూతలపాటి గంగాధరం వర్ధంతినాడు అందజేస్తున్న "నూతలపాటి సాహితీ సత్కారం" యీ ఏడాది శ్రీ వాద్రేవు చిన వీరభద్రుడు గారి వచన కవితా సంకలనం "నిర్వికల్ప సంగీతం"కు లభించింది. న్యాయ నిర్ణేతలుగా డా. కె. వి. రామకోటిశాస్త్రి; శ్రీ నాగభైరవ కోటీశ్వరరావు, శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం వ్యవహరించాలి. సుప్రసిద్ధ కవి, విమర్శకుడు కీ. శే. నూతలపాటి గంగాధరం 13వ వర్ధంతి సభలో కవికి రు. 1500 యోగ్యతా పత్రం యివ్వబడుతాయని ఆ సంస్థ కార్యదర్శి ఎస్.ముని సుందరం తెలియజేస్తున్నారు. □

జ : ఒకవేద సంహిత (10, 18, 7 ) లో ఉంది. విధవరాలుకు భర్తను పోగొట్టుకున్న తర్వాత జీవితం గడిపే అధికారం ఉంది. విధవరాలు అవటం దురదృష్టం, కళంకం, బరువు కానేకాదు. విధవరాలు అలానే వుండాలన్న నియమం కూడా లేదు. మళ్లీ పెళ్లి చేసుకునే అధికారం ఆమెకు వుంది. అలా పునర్వివాహం చేసుకన్న వారిని 'పునర్భూ' అంటారని అధర్వ వేద సంహిత 9, 5, 27– 28 లో ఉంది.

ప్ర: ఏ స్త్రీ అయినా తన యిష్టానుసారం 'సతి' పాటిస్తే....?

జ: ఆమె అలా ఏ పరిస్థితులలో 'సతి' అవ్వాలనుకుంటుందో వాటిని రూపుమాపాలి.

## శాస్త్రార్థాలపై ఇద్దరు స్వాముల వివాదం

( 33 వ పేజీ తరువాయి)

ఇంతవరకు స్త్రీకి పురుమనితో సమానంగా హక్కులు లభించలేదు. స్వతంత్ర వ్యక్తిత్వంతో బతికే అవకాశం ఆమెకు యింకా లభించలేదు. పుట్టింటి నుంచి అత్తింటి గడప తొక్కిందంటే ఆమె శవమే బయటకు రావాలని ఆడదానికి బాల్యం నుండి నూరిపోసే అలవాటు మారాలి. భర్తే దైవం, అతడు లేనిదే స్త్రీ జీవితం వ్యర్థం అనే చదువు నేర్పబడ్డ స్త్రీ మానసికంగా ఎదగటంలేదు.

ప్రాణాంతకమైన ఈ వివాదం గురించి మహాత్మా గాంధీ ముందు గానే ఊహించారు. ఆయన శాస్త్రాలను అధ్యయనం చేయడమే కాదు, స్వయంగా ఆచరించి చూపించారు. నా జీవితమే నా సందేశం అని చెప్పిన మహాత్ముడు ఆయన. స్త్రీలు నాలుగు గోడల మధ్య నలిగిపోకూడదు అని చెప్పి అందుకు ఉద్యమించాడు. మూఢాచారాలను, కర్మకాండలను, వ్యతిరేకించారు. స్వాతంత్ర్యం వచ్చిన 40 సం. ల తర్వాత కూడా స్త్రీ స్వాతంత్ర్యం గురించి యిలా వివాదంలో దిగటం, 'సతి'ని సమర్థించటం నిజంగా శోచనీయం, విచారకరం.

- హితైషి

# కొత్త

# లిప్టన్ టాప్ స్టార్ టీ దీని యదార్థమైన శక్తి దీని రుచే



లిప్టన్ టాప్ స్టార్.
రుచే ఎప్పుడూ దాని గొప్ప బలిమి.
ఇప్పుడు అది మరింత మెరుగైంది.
ఎందుకంటే ఇప్పుడు క్రొత్త
లిప్టన్ టాప్ స్టార్ మెప్పించగల
దిగ్విజయమైన మిశ్రమాల
సమ్మిళితాన్ని అందిస్తున్నది. అవే ఎక్కువ రుచి, ఎక్కువ స్ట్రాంగ్.
ఆ కోవలోని ఏ టీతో పోల్చినా అది ఎక్కువ రుచిగాను ... స్ట్రాంగ్‌గాను
ఉంటుంది. ప్రయత్నించి చూడండి అందులోని వ్యత్యాసమేమిటో
మీకే తెలుస్తుంది. క్రొత్త లిప్టన్ టాప్ స్టార్ ఇప్పుడు ఆకర్షణీయమైన సరిక్రొత్త
ప్యాక్‌లో వస్తున్నది.







**లిప్టన్ టాప్ స్టార్ టీ**

**జయప్రదమైన రుచి మరియు శక్తిల మేళవింపు**

LINTAS LIL TS P1 2620 TEL